ఆంధ్ర సచిత్ర వార పత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

ఎడిటోరియల్ అడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ ఎడిటర్: వీరాజీ శక సం. 1911

విజయవాడ
25-8-1989

ముద్రాపకుడు, ప్రచురణకర్త : శివలెంక నాగేశ్వరరావు

భాద్రపదం 3వ తేదీ

# క్రికెట్ ప్రియుల ఆనందం కోసం రాజీ మార్గం మంచిది!

వెస్ట్ యిండీస్‌లో చావుదెబ్బలు తిన్న భారత క్రికెట్ టీము మానేజరు వెంకట రాఘవన్, తిరిగి వచ్చేశాడు కాని- జట్టు నాయకుడు వెంగసర్కార్- బెస్ట్ ఆల్‌రౌండర్ వైస్ క్యాప్టన్ కపిల్‌దేవ్; తొడలో ఎముకకి దెబ్బ తగిలిన కారణంగా సరిగ్గా బ్యాటింగ్ చేయలేకపోయిన అజారుద్దీన్ గ్లామర్‌బోయ్ రవిశాస్త్రి సహా- మన టీము సభ్యులు అందరూ అమెరికా, కెనడాలకు- యీ "క్రికెట్ ఆనందాన్ని అంటువ్యాధిలాగా తీసుకుపోయి, అక్కడి జనాలకు అంటగట్టడానికి; డాలర్‌లు మూటకట్టడానికి- "బోర్డు" ఆజ్ఞలను ధిక్కరించి వెళ్లి- "మాకు మేమే మొనగాళ్లం" అంటూ విర్రవీగుతున్నప్పుడు- దేశంలో కంట్రోలు బోర్డు- ఈ ప్లేయర్స్ మీద "కారాలు మిరియాలు" నూరుతున్నదన్న సంగతి వారికి తెలియదనా? తెలుసు కాని "ప్రలోభం" అటువంటిది- ఈ మధ్యనే మొహిందర్ అమర్‌నాధ్ అక్కసుగా "మూర్ఖశిఖామణుల బృంద" మంటూ ఎకసెక్కం చేసిన యిండియన్ "క్రికెట్ బాస్"లు యీసారి- అమెరికా నుంచి తిరిగి వచ్చిన "ఇండియన్ క్రికెట్ టీము సభ్యులెవ్వరికి అదే విధంగా నోరు పారేసుకొనే అవకాశం ఇవ్వలేదు! ఎదురులేని ఆరుగురు మహా క్రికెటర్‌లుగా వాసికెక్కిన వెంగ్‌సర్కార్, కపిల్‌దేవ్, రవిశాస్త్రి, అజారుద్దీన్, కిరణ్ మోరె, అరుణ్ లాల్ లను మరో ఏడాదిపాటు, బ్యాటూ, బంతీ పట్టుకొని పోటీ మైదానంలోకి దిగకుండా "వెలివేసేశారు! టీములో వున్న జూనియర్‌లను కేవలం జరిమానాలతో వదిలివెట్టేశారు. అవసరానికి పనికివచ్చే ద్వితీయశ్రేణి టీము కోసమే వీరిమీద "నిషేధం" విధించలేదనుకోవాలి.

క్రికెట్‌లోను, టెన్నిస్‌లోను-"ధనలక్ష్మి" ఘల్లుఘల్లున నాట్యమాడుతూ వుంటుంది. ఐనా అక్కడ ఆటగాళ్లకు "తలబిరుసుతనం" పాము పడగమీద 'మణి' లాగా కొన్ని వేళల్లో మాత్రమే, రాణిస్తూ వుంటుంది. సస్పెన్షన్లు, జరిమానాలు అంతర్జాతీయ క్రికెట్ రంగంలో టెన్నిస్ ఫీల్డ్‌లో కొత్త కాదు. తిరిగి అదే క్రికెటర్‌లు టెన్నిస్ వీరులు జట్టుకి నాయకత్వం వహించడం కూడా తప్పకాదు- మొన్న మొన్న మన వాళ్లు ఘోర పరాజయం పొందిన "వెస్ట్ యిండీస్" సిరీస్‌లోనే- అరివీర భయంకర పరుగుల పులిగా వాసికెక్కిన వెస్ట్ యిండీస్ జట్టు నాయకుడు వివియన్ రిఛర్డ్స్- ఐదవ టెస్ట్ పోటీలో అదుపుతప్పి చిందులు త్రొక్కినందుకు శిక్షగా "కరేబియన్ క్రికెట్ బోర్డు" అతణ్ని ఏడాది పాటు "పోటీ"ల నుంచి బహిష్కరించింది! ఒకప్రక్క ఆస్ట్రేలియాచేత చావుదెబ్బలు తింటూ- మరొకవైపు తిరుగుబాటు జెండా ఎగురవేసి "నిషిద్ధ ప్రాంతం దక్షిణాఫ్రికాకు వెళ్లి "క్రికెట్" ఆట ప్రదర్శిస్తామన్న- ప్రముఖ బ్రిటీష్ క్రీడాకారుల్ని- ఇంగ్లండు బోర్డు ఐదు సంవత్సరాలపాటు దేశం తరపున ఆడకుండా "వెలి" వేసింది!

భారతదేశ క్రికెట్ చరిత్రలో మాత్రం యీసారి బోర్డు తీసుకున్న చర్య అందర్ని చకితుల్ని చేసింది! క్రికెట్ క్రీడాకారులు "పులుల్లాంటివారు 'పిల్లు"లైపోయి "పబ్లిక్"గా పశ్చాత్తాపం ప్రకటించి- "యింకెప్పుడూ లిఖితపూర్వక ఆమోదం లేకుండా- మరో గడ్డ మీద "ప్యాడ్స్" ధరించం" అని వాగ్దానం కూడా చేశారు! సునీల్ గావస్కర్ విషయంలో - లోగడ "మెతకగా" వ్యవహరించింది- మొహీందర్ అమర్‌నాథ్ ఎంపికలో "పక్షపాతం చూపించింది" లాంటి ఆరోపణలకి గురియైన భారత క్రికెట్ కంట్రోలు బోర్డు యీసారి అటువంటి నిందలకు గురికాలేదు. ఇప్పుడు అందరికన్నా గట్టి దెబ్బ "కపిల్ డెవిల్" కే తగిలింది. మరొక్క టెస్ట్ పోటీలో పాల్గొంటే చాలు - అతను "నూరు టెస్ట్ పోటీల మొనగాడు" కాగలడు కాని- ఏడాది దాకా యీ అవకాశం కోసం గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవడమంటే ఎంత కష్టం?- క్రికెట్ కంట్రోలు బోర్డు యీ "సస్పెన్షన్ల" చర్య ద్వారా అతి సాహస మైన ప్రవృత్తిని ప్రదర్శించిందనే అంగీకరించాలి! పాకిస్తాన్ టూర్‌లో షార్జాకప్ యాత్రలో మనకి యీ ఆరుగురిలో కనీసం నలుగురు లేందే- ఆటలో గెలుపు మాట అటుంచి- గేట్ కలెక్షన్‌లు దారుణంగా పడిపోయి, క్రికెట్ కంట్రోలు బోర్డుకి ధన "నష్టం" కూడా రావచ్చును- దేశ ప్రతిష్ఠ సంగతి యిక్కడ అనవసరం. ఎందుకంటే యిటీవల కాలంలో మన హేమాహేమీల క్రికెట్ జట్టు మనకి "కప్పులు" ట్రోఫీలు" దాకా ఎందుకు? ఒక "ఉగ్గుగిన్నె" కూడా గెల్చి తీసుకు వచ్చి "యిదుగో ఇది మీకోసమే గెల్చుకొచ్చాం" అని చూపెట్టలేదు.

ఐనా క్రికెట్ ఆట భవిష్యతు; క్రికెట్ ప్రియుల ఆనందం- దృష్టిలో వుంచుకొని"బోర్డు" వారు "జరిమానాలు" మాత్రం ముక్కుపిండి వసూలు చేసి- ఈ ఆరుగురు క్రికెటర్‌లను కూడా "సస్పెన్షన్" నుంచి విడుదల చేయడం వితరణ విజ్ఞత కూడా అనిపించుకుంటుందనే అనుకుంటున్నాము. "దద్దమ్మల- లేదా ధనాశాపరుల ముఠా" కాదు భారతీయ క్రికెట్ కంట్రోలు బోర్డు అవసరమైతే "కత్తివేటు" వేయగల సాహసం గల సంస్థ అన్నది యిప్పుడు రుజువైంది! మన క్రికెటర్‌లు కూడా "నాలిక్కర్చుకునే" -బుద్ధిమంతులు- "ఆటంటే ప్రాణాలిచ్చే మహా వీరులు" అనిపించే రీతి యిప్పుడు ప్రవర్తించారు కనుక ఈ "సంక్షోభాన్ని" ఉభయతారకంగా పరిష్కరించుకోమని అందరికి విజ్ఞప్తి చేస్తున్నాము! "లెట్ క్రికెట్ లివ్ అండ్ యిన్‌డిసిప్లిన్ డై".

●

**తెలుగువారి నిరంతర సేవలో మాకిది 82వ సంవత్సరం**

విడిప్రతి వెల రు. 4-00

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

సంపుటము 82 | స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు | సంచిక 1

వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు

(1938-1972 సంపాదకులు) శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్‌లు: 75667, 61247, 61248

# వీక్లీ పోస్ట్

## ప్రోత్సాహం

28-7-89 ఆంధ్రసచిత్ర వార పత్రిక నటి 'సీత' ముఖ చిత్రంతో అత్యంత ఆకర్షణీయంగా ఉంది. ద్రౌపది సీరియల్ చాలా ఆసక్తిదాయకంగా యున్నది. "ఫొటో వ్యాఖ్య పోటీ" నూతన వర్ధమాన రచయితలను ప్రోత్సహిస్తోందనటంలో సందేహం లేదు. అలాగే "గడి కట్టు" పాఠకుల మెదడుకు మేత..వారి విజ్ఞానానికి మచ్చు తునక. ఆసక్తిదాయకమైన, విజ్ఞాన దాయకమైన శీర్షికలను ప్రవేశపెట్టడంలో ఆంధ్రపత్రిక దానికదేసాటి.

మహమ్మద్ రఫీ, కాశీబుగ్గ

## సీతకే అందం

సీత ముఖచిత్రం మన పత్రికపై రావడం వల్ల సీతకే అందం వచ్చినట్లుగా వుంది. డా. సమరం జవాబులు పాతచింతకాయ పచ్చడిలా వున్నాయి. సీరియల్స్ ఫరవాలేదు. ఇకపోతే "టిట్ ఫర్ టాట్" మీ ప్రశ్నలు- మా బుర్రలు చెడగొడుతున్నాయి.

-కొలూరి చినచంద్రరావు, పాలకొల్లు

## దొంగల....

మా అభిమాన ఆంధ్రసచిత్ర వారపత్రికలో అవధానులు విజయలక్ష్మిగారి కలం నుండి వెలువడుతున్న దొంగల రాజ్యంలో సీరియల్ వాస్తవికతకి అద్దం పట్టి హాస్యంతోపాటు లాస్యంకూడా జోడుగా వుండి ఎంతో అద్భుతంగా ఉంది చదువుతుంటే. నవరసాల్ని రంగరించి ప్రతివారం వెరైటీగా పత్రికను విడుదల చేస్తున్న ఎడిటర్ గార్కి మా శుభాభివందనంతో-

కుమారి పెయ్యేటి చాముండేశ్వరి, శ్రీకాకుళం

## దొంగల రాజ్యం

విజయలక్ష్మిగారి సీరియల్" దొంగల రాజ్యం వినూత్నంగా వుండి ఆకట్టుకుంది. దొంగలపై వ్యంగ్యమైన నవలిక వ్రాయడంలో కృతకృత్యులయ్యారు విజయలక్ష్మిగారు. విశేష పత్రిక ఆంధ్రపత్రికకు అభివందనములు.

-పి. శ్రీధర్ (అల్వాల్)

70వ పేజీ చూడండి



ఆంధ్ర సచిత్ర వారపత్రిక



ముఖచిత్రం :
భారత ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీకి
జన్మదిన శుభాకాంక్షలు!

నార్త్‌లో నెం. 1 ఐన
శ్రీదేవితో మళ్ళీ నాకిదే ఫస్ట్ పిక్చర్
అంటున్న "చిరంజీవి".
(వైజయంతీ మూవీస్ వారి చిత్రం)

పై వారం :
"న్యాయపీఠం" ప్రశ్నలు-జవాబులు
ప్రత్యేక శీర్షిక

**జౌ**త్యహంకార హంతకుల తుపాకీ గుండ్లకు గురియై కన్నతల్లి రక్తపు మడుగులో వుండగా - దేశమంతా కన్నీరు వరదలై పారుతుండగా - అతి క్లిష్ట విపత్కర విషమ పరిస్థితుల మధ్య ఇందిరాగాంధీకి వారసుడై గద్దెనెక్కిన ప్రధానమంత్రి శ్రీ రాజీవ్ గాంధీని - ప్రజలంతా పెద్ద మెజారిటీతో ఎన్నుకున్న తరువాత - రాజీవ్ గాంధీ శక్తి సామర్థ్యాల మీద ప్రతిపక్షాలు -





అనేక ప్రజా వర్గాలు కూడా క్రమేపీ కోపతాపాలు వ్యక్తం చేస్తున్న సమయంలో శ్రీ రాజీవ్‌గాంధీ పార్లమెంటులోను, వెలుపలా కూడా తాను చేయవలెననుకున్న కార్యక్రమాలను, సంస్కరణలను నిరాఘాటంగా చేయడానికి- సొంత పార్టీలోనూ లోక్‌సభలోనూ కూడా ఆయనకి వున్న మద్దత్తే కారణం ! - 64, 65 రాజ్యాంగ సవరణల ద్వారా కేంద్రానికి రాష్ట్రాలలోని నగరాల మీద, పల్లెలమీద ప్రత్యక్షమైన అధికారాలను, అదుపును ప్రవేశపెట్టిన రాజీవ్‌గాంధీ తన 46 వ జన్మదినోత్సవం చేసుకుంటున్నప్పుడు - ఆగస్టు 20 వ తేదీనాడు - మనం ఆయనకి శుభాకాంక్షలు చెబుతున్నాం. రాజీవ్‌గాంధీ వ్యక్తిత్వం ఈ గడచిన 5 సంవత్సరాల కాలంలోను చాలా స్పష్టంగా అందరికీ అర్థమైపోయింది. తల్లి మొండి, పుత్రుడు జగమొండి.

కాంగ్రెస్ పార్టీ ఏ రాష్ట్రంలో చూసినా అస్తవ్యస్తంగా అంతర్గత కలహాలతో అతలాకుతలం అవుతున్నా - కేంద్రంలో మాత్రం పార్టీ లోపల శ్రీ రాజీవ్ గాంధీ ఏకచ్ఛత్రాధిపత్యానికి లోపం రాలేదు. అతని అనుయాయులు వ్రేళ్ల మీద లెక్కబెట్టదగినవారు తప్ప - మెజారిటీ "హై హై నాయకా!" అంటూనే ఉన్నారు. చెంచాగిరి నిభాయిస్తూనే ఉన్నారు. రేపు ఎన్నికలలో "టిక్కెట్"లు దొరకనివాళ్లు తప్ప - తతిమ్మావారంతా "పల్లకీ బోయీలు"గా ఉంటారనే ఇప్పటి పరిస్థితులలో అనిపిస్తున్నది. తాత నెహ్రూ, తల్లి ఇందిరమ్మలు పార్టీ ప్రభుత్వం రెండూ రెండు గుర్రాలుగా స్వారీ చేయటం వేరు. విమానాల మీద తిరిగే రాజీవ్ గాంధీ - ఈ రెండు పగ్గాలను పట్టి వాటిని భూమ్మీద నడిపించటం వేరు. అందుకే ఈ జన్మదినోత్సవ శుభ సందర్భాన "మెనీ హ్యాపీ రిటర్న్స్ ఆఫ్ ద డే" అంటూ ఆయనని, ఆయన సమర్థతని అభినందించుతున్నాము.










## డెడ్‌లైన్స్

"హెడ్‌లైన్స్ - డెడ్‌లైన్స్" అని ఉంటాయి జర్నలిస్టుల పరిభాషలో. వారపత్రిక ముఖపత్ర తేదీకి వారంరోజులు ముందుగా మార్కెట్‌లోకి వస్తుంది. దానిలో పడే ఈ తాజాకాలమ్ "డెడ్‌లైన్" చివరి క్షణాల్లో రాస్తున్నా కూడా పది పన్నెండు రోజులు ముందుంచాల్సిందే. ఈ మధ్య కాలంలో పాఠకులు వర్తమాన చరిత్రలో చాలా మార్పులు చూడవచ్చును. అంచేతనే "హెడ్‌లైన్స్"ని "డెడ్‌లైన్స్" అజ్మాయిషీ చేస్తాయి అంటాము. వీటి బాధ కంప్యూటర్ యుగంలో కూడా తప్పటంలేదు.

మ్యునిసిపాలిటీ బిల్లు, పంచాయితీల బిల్లు కూడా చట్టం చేయాలన్న ప్రయ

# మన క్రికెట్ వీరులు

**భారత క్రికెట్ క్రీడాకారులలో అనేకమంది తమ ప్రతిభా సామర్ధ్యాలను నిరూపించుకొని ప్రఖ్యాతిగాంచారు. వారిలో కొంతమంది క్రీడాకారుల ప్రతిభా విశేషాలను ఈ క్రింద యిస్తున్నాము-**

| పేరు | టెస్ట్ పోటీలు | ఇన్నింగ్స్ | నాటౌట్ | పరుగులు | అత్యధిక స్కోరు | సగటు పరుగులు | సెంచరీలు | బంతులు | పరుగులు | వికెట్లు | సగటు పరుగులు | ఒకపోటీలో పదివికెట్లు | ఒకపోటీలో ఐదువికెట్లు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| విజయ్‌మర్చంట్ | 10 | 18 | 0 | 859 | 154 | 47.72 | 3 | 54 | 40 | 0 | - | - | - |
| సునీల్ గవాస్కర్ | 125 | 214 | 16 | 10122 | 236 | 51.12 | 34 | 380 | 206 | 1 | 206.00 | - | - |
| విజయ్‌మంజ్రేకర్ | 55 | 92 | 10 | 3208 | 189 | 39.12 | 7 | 204 | 44 | 1 | 44.00 | - | - |
| విజయ్‌హజారే | 30 | 52 | 6 | 2192 | 164 | 47.65 | 7 | 2840 | 1220 | 20 | 61.00 | - | - |
| గుండప్ప విశ్వనాథ్ | 91 | 155 | 10 | 6080 | 222 | 41.93 | 14 | 70 | 46 | 1 | 46.00 | - | - |
| వినోద్‌మన్‌కడ్ | 44 | 72 | 5 | 2109 | 231 | 31.47 | 5 | 14686 | 5236 | 162 | 32.32 | 2 | 8 |
| కపిల్‌దేవ్ | 99 | 143 | 12 | 4074 | 163 | 31.09 | 6 | 20641 | 10074 | 347 | 29.03 | 2 | 21 |
| సయ్యద్‌కిర్మానీ | 88 | 124 | 22 | 2759 | 102 | 27.04 | 2 | 18 | 13 | 1 | 13.00 | - | - |
| రమాకాంత్‌దేశాయ్ | 28 | 44 | 13 | 418 | 85 | 13.48 | - | 5597 | 2761 | 74 | 37.31 | - | 2 |
| ఎర్రపల్లి ప్రసన్న | 49 | 84 | 20 | 735 | 37 | 11.48 | - | 14353 | 5742 | 189 | 30.38 | 2 | 10 |
| సుబాష్‌గుప్తే | 36 | 42 | 13 | 183 | 21 | 6.31 | - | 11284 | 4403 | 149 | 29.55 | 1 | 12 |
| భగవత్ చంద్రశేఖర్ | 58 | 80 | 39 | 167 | 22 | 4.07 | - | 15963 | 7199 | 242 | 29.74 | 2 | 16 |

త్నంలో రాజీవ్‌గాంధీ మూడింట రెండు వంతుల మెజారిటీని రాజ్యసభలో ఏ విధంగా సాధిస్తారోనన్నది ఇది చదివేటప్పటికి మీకు స్పష్టంగా తెలిసిపోతుంది. ప్రస్తుతం (ఆగస్టు 10 బంద్‌నాడు) "యీ రెండింటిలోను గల లోపాల"ను రాజీవ్ గాంధీ చివరి క్షణంలోనైనా సవరించడానికి అంగీకరిస్తే "బాగుణ్ణు" అనే విజ్ఞులు - ఆశపడుతున్నారు.

## ఆటలో "అరటిపండు" కాదు

మన క్రికెట్ వీరులంతా విడవిడిగా మహాయోధులే. రికార్డ్సు చాలా వుంటాయి. కాని కలివిడిగా టీముకి ఆడుతున్నప్పుడు మాత్రం ఇటీవల కాలంలో మనకి తెచ్చిన "కప్పులు" "మెప్పులు" లేవు. వెస్టిండీస్‌లో చావు దెబ్బలు తిని- కాలు తొడ లోపల ఎముక దెబ్బ ఉన్నందువల్ల- బ్యాటింగ్ చేయని అజారుద్దీన్ సహా మవనాళ్లు తిరుగుబాటు జెండా ఎగురవేస్తూ- అమెరికా-కెనడాలకు వెళ్లి మజా మజాగా, ఖుషీ ఖుషీగా ఆటలు ఆడి డాలర్‌లు కొట్టుకొని వచ్చారు- బోర్డు వాళ్లేంచేస్తారు? అంతా ఆటలో అరటిపండు పాటలో పనసపండు అయిపోతుంది అనుకున్నారు. కాని బోర్డు మొదటికే మోసం చేసింది. అరుణ్‌లాల్, మోరేలకి కూడా స్టాటస్ పెరిగిపోయింది. "వెంగీ," "కప్పీ," "రవీ," "అజ్జు" మహరాజ్‌లతో కలిపి ఈ ఇద్దర్నీ కూడా ఏడాది దాకా మన "మైదానం"లోకి బ్యాట్ కాని బంతి కాని పట్టుకు దిగటానికి వీల్లేదని బోర్డు "వెలి"వేసింది. కపిల్‌దేవ్‌కిది మరీ దుఃఖం కలిగించింది. రకరకాల "సాకు"లు వెతుకుతున్నాడు. పైగా వెంకటరాఘవన్ దగ్గర "నోటిమాట"గా పెర్మిషన్ తీసుకున్నామంటాడు. సునీల్ గవాస్కర్ ఇదంతా మాచేత చేయించాడు అంటాడు- దేవ్ ఫీచర్స్ నడుపుతూ అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన కపిల్‌భాయి నిన్న పుట్టినపాపాయి కాదుగా- "వెలి"వేటుపడకపోతే టెస్టు పోటీలో మరొక్కసారి అడుగుపెట్టి- వెంటనే ప్రపంచమంతటా 100 టెస్టు పోటీల వీరుడిగా జేజేలు అందుకునేవాడు. 347 వికెట్లు 4 వేల పరుగులు సాధించిన నెం. 2 ఆల్‌రౌండర్ ఘనుడు ఈసారి నాయకత్వం కూడా దొరుకుతుందని ఆశలు పెంచుకున్నవాడు అందరికన్న ఎక్కువ కుంగిపోయాడు ఈదెబ్బకి- అయితే ఈ ఏడాదిపాటు ఈ వీరులు బ్యాట్ పట్టుకొనకుండా వుంటే మన అంతర్జాతీయ క్రికెట్ రంగంలో పోటీలు ఎలాగా నెగ్గంగాని- "గేట్ కలక్షన్లు" కూడా పోతాయి. బోర్డుకు చాలా నష్టం కూడా వస్తుంది. అంచేత కపిల్-వెంగ్‌సర్కార్‌లు పబ్లిక్‌గా నాలిక్కర్చుకుని ఇంకెప్పుడు ఇట్లా చెయ్యం అని క్షమావణ చెప్పుకున్నారు. కనుక జరిమానాలతో వదిలిపెట్టి నిషేధం ఎత్తివేస్తే ఉభయతారకంగా ఉంటుంది. సునీల్ మనోహర్ గవాస్కర్ మైదానం మీద వెలువలా కూడా చాలా గడుసువాడు. "చిక్కడు-దొరకడు" టైపు. అందుకనే యీసారి ఈ వ్యవహారంలో తనకేం సంబంధం లేదు పొమ్మన్నాడు. వెస్టిండీస్ టూరుకు ముందే వాళ్లందరికీ అమెరికా ఖండ యాత్ర తెలుసునని- తాను కేవలం అమెరికాకు వారు వచ్చిన పిదప మరి రెండు రోజులు అదనంగా వుండమన్నాను తప్ప ఏ పాపం ఎరుగనని అంటున్నాడు. నిజానికి వీళ్లంతా ఆరితేరిన వృత్తి క్రీడాకారులు- రూపాయి అణా పైసలు దగ్గర మొహమాటం చూపని వారు పసిపిల్లలేంకారు! అంచేత గవాస్కర్, వెంకటరాఘవన్‌లు వాళ్లకి నడబండీ ఇవ్వనక్కరలేదు. ఏది ఏమైతేనేం భారత దేశ క్రికెట్ కంట్రోల్ బోర్డు కూడా మొట్టమొదటిసారి తన తడాఖా చూపించారు కనుక క్రికెట్ శ్రేయస్సు దృష్ట్యా వారు తమ బహిష్కరణ ఉత్తర్వుని రద్దు చేసుకొని పాకిస్తాన్ టూర్‌కి షార్జాకప్‌కి మంచి టీము ఎన్నిక చేయడంలో నిమగ్నమైతేనే మంచిది. ఇకమీదట లిఖితపూర్వక అనుమతి తీసుంకుందాం అన్నాడు అమాయకంగా పోజుపెట్టి కపిల్- అదె లాగు తప్పదు- బోర్డుకి కావలసింది డబ్బు కనుక నిజమైన క్రికెట్ టీము ఒకటి మనికిప్పుడు కావాలి. వ్యక్తిగత హోదాని రికార్డుని పెంచుకొనే "గ్లామర్ తార"లు కాదు! -సో దానికి ప్రయత్నం చేయడం "బోర్డు" తక్షణ కర్తవ్యం.

*10-8-'89*

# తండ్రులకో కథ

కంభమూరి వెంకట మహాలక్ష్మి



భక్తులు మొక్కులు మొక్కుకుని తీరగానే అమ్మవారి జాతర్లకి కోళ్ళని మేకల్ని బలి యిస్తుంటారు.

కానీ- అత్తవార్లనే కొందరు కోరికల్ని కోరుకుని వారి దాహం తీర్చలేక పోతే అలుసుగా కనపడే కోడళ్ళని బలి యిచ్చేస్తుంటారు.

ఆదే జరిగింది అపర్ణ విషయంలో!!

అపర్ణ అగ్నిదేముడికి ఆహుతి అయిపోయింది! కాదు అహంకారుల కోపాగ్నికి "స్వాహా" అయిపోయింది!!

ఈ పవిత్ర భారత దేశంలో అత్తింటివారి కోరికల్ని తీర్చలేక, వారి ఆగ్రహాగ్నికి గురై, వారి దాహాగ్నికి బలయిపోతున్న వేలాది కోడళ్ళ కోవలోకే అపర్ణా చేరిపోయింది.

దిన పత్రికల్లో ప్రతీ రోజూ ప్రచురితమయ్యే ఈ వార్తల్ని చదివి జాలిగుండెతో ఓ నిట్టూర్పు విడిచి మర్చిపోతోంది ప్రజానీకం.

ఇటువంటి సదవకాశాల్ని వినియోగించుకుని కొందరు జేబులు నింపుకుని కేసుల్ని రూపుమాపుతున్నారు అన్యాయాల్ని అరికట్ట వలసిన అధికారులే! డబ్బు అనుబంధాల్ని పెంచనూ గలదు, తెంచనూ గలదు. ఎంత కష్టమైన పనయినా డబ్బు చేయించ గలిగినంత తేలిగ్గా మనిషి చెయ్యలేడు.

పై విషయాలన్నీ అపర్ణ ఆ యింటికి బలిపశువు కావడానికి కారణాలయ్యాయి.

డబ్బులేక పోవడం పరంధామయ్యకి ఒక శిక్ష అయితే, అతనికి దేముడు నలుగురు ఆడపిల్లల్ని యివ్వడం మరో పెద్ద శిక్ష.

"ఆడా మగా సమానమే!" అంటూ ప్రసంగాలు, పేపర్లు, పెద్దలు ఎంత చాటి చెప్పినా మధ్య తరగతి తల్లిదండ్రులకి మాత్రం ఆడపిల్లలు కొత్తరకపు గుదిబండలుగానే తయారవుతున్నారనే చెప్పాలి.

చదువులు కావాలంటారు కొందరు- ఉద్యోగాలు చేస్తున్న పిల్లలే కావాలంటారు మరికొందరు. తండ్రులు చచ్చీ చెడీ యివన్నీ అమర్చినా కట్నాల రేటు తగ్గుతుందా? అంటే అదీలేదు! ఇదివరలో వేల సంఖ్యలో వుంటే ఇప్పటి బేరం లకారాల నుంచి మొదలవుతోంది. ఇవికాక స్కూటర్లు, ఫ్రిజ్‌లు, టీ.వీ.లు పండగల కానుకలుగా తేకపోతే సులువైన సాధనం కోడల్ని హింసించడం- హత్య చెయ్యడం.

పోనీ పుస్తె, పుడక అమ్మి అవన్నీ కూడా యిచ్చి పంపిస్తే ఆ ఆడపిల్ల ఆ యింట దర్జాగా హాయిగా బ్రతుకుతోందా?అంటే అదీ లేదాయె!! ఆమెకి ఇంట్లో చాకిరితో పాటు బైట ఆఫీసు చాకిరీ ఎడిషనల్ బర్డెన్. అదీ నోరు మూసుకుని భరించినా ఆలశ్యంగా వస్తే అనుమానపు పోట్లు, ఎంత గడించినా పైస ఖర్చు చేసే స్వతంత్ర్యం లేకపోవడం- ఇలా చెప్పుకుపోతే కోడళ్ల పాట్లు కోకొల్లలు. ఒక మాటలో చెప్పాలంటే ఆధునిక యుగంలోని లాభసాటి బేరాల్ని అమలు పర్చుకుంటూ, పాత పద్ధతుల్ని, ఆచారాల్ని విడవలేక ఆడపిల్లని, ఆమె తల్లితండ్రుల్ని అడకత్తెరలో పెట్టి నలిపేస్తున్నారు అత్తవార్లనే అధికార పార్టీలు.

పరంధామయ్య పెద్ద కూతుర్ని చదివించాలన్న ప్రయత్నం ఫలించకపోగా పదో తరగతే పదే పదే చదివి పేసవలేక పోవడంతో పెళ్ళయినా చేసి ఓ భారాన్ని దింపుకుంటే వెనక చెట్లల్లా ఎదిగిపోతున్న మిగతా పిల్లలకి ఏదో చదువబ్బుతోంది కదా! పెళ్ళికాక పోదన్న ఆలోచన వచ్చి, ఏడు చెప్పుల జతల్ని అరగ్గొట్టుకుని ఓ గుమస్తాకిచ్చి అపర్ణని కట్టబెట్టాడు.

డిగ్రీలేని పిల్లని చేసుకుందుకు ఒప్పుకున్నారన్న ఆనందమే తప్ప- కుటుంబపు మంచి చెడ్డల్ని వాకబు చెయ్యలేదు. యాభైవేలకి నయాపైస తగ్గమని ఖచ్చితంగా చెప్పినప్పుడు కూడా డబ్బు

మనుష్యులని గ్రహించ లేదు సరికదా, యాభైవేలు నా గుమాస్తా బ్రతుకు ఎలా యివ్వగలదని ఆలోచించకుండా "ఊ" కొట్టి శకునులమీద సంబంధాన్ని ఖాయపర్చి, క్షణాల్లో ముహూర్తం పెట్టించేసాడు పరంధామయ్య ఈ సంబంధం తప్పిపోతే యింక అపర్ణకి పెళ్ళేకాదేమో అన్న కంగారుతో. మరో వారానికల్లా పెళ్ళి చేసేసాడు. పెళ్ళికి ముందు పి. ఎఫ్. లోన్ తీసుకుని వాళ్ళడిగిన యాభైవేలల్లో పాతిక వేలిచ్చి త్వరలోనే మిగతా పాతికవేలూ యిస్తానని కాళ్ళా వేళ్ళా పడటంతో గిరీష్‌ని తండ్రి అపర్ణ మెళ్ళో మూడు ముళ్ళూ వెయ్యనిచ్చాడు.

'పెళ్ళయి పోయాకా యింకేం చేస్తారులే!!' అన్న ధీమాతో అపర్ణని అత్తవారింటికి పంపి నిశ్చింతగా యింట్లో కూర్చున్నాడు మిగతా కట్నం డబ్బుల గురించి ఆలోచించకుండా పరంధామయ్య.

కబురు మీద కబురు పెట్టినా "అదిగో, ఇదిగో" అనడం తప్ప డబ్బులు రాకపోవడంతో ఇలా లాభం లేదని "డబ్బు మొత్తం తీసుకొస్తేనే మళ్ళీ ఈ గడప తొక్కడం" అంటూ అపర్ణని పుట్టింటికి పంపేసారు అత్త, మామ, భర్త.

"ఆడపిల్లని నరికినా, చంపినా అత్తవారింట్లో వుండడమే గౌరవమని, ఆడది మంచితనంగా అత్త మామల అభిమానాన్ని చూరగొనాలని, చాక చక్యంగా భర్త మనసు మార్చి వశపర్చుకోవాలిగానీ యిలా పుట్టింటికి రాకూడ"దన్న నీతుల్ని బోధించి, నాలుగు పతివ్రతల కథలు చెప్పి మళ్ళీ అత్తవారింటికి పంపేసాడు అపర్ణ తండ్రి.

తన బిడ్డ ఆ యింట గొడ్డు చాకిరీయే చేస్తోందా? గొడ్డులా తన్నులే తింటోందా?" అని ఏనాడూ తిరిగి చూడలేదు. తండ్రి చేసిన దొంగ వాగ్దానానికి ఫలితంగా ఆమె దోషిగా నిల్చి గొడ్డుని బాదినట్లు బాది, హింసిస్తుంటే "ఆడపిల్లనై పుట్టినందుకు ఫలిత మిలాగే అనుభవించా"లన్న నిజాన్ని జీర్ణించుకుని తలొగ్గి అన్ని హింసల్నీ సహిస్తున్న అపర్ణని చూస్తున్నగొద్దీ కసీ, కోపం పెరిగిపోతున్న అత్త, మామ, భర్త విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి ఓనాడు గ్యాస్ ఆన్ చేసి గదిలో బంధించి అగ్నిహోత్రుడికి ఆమెని బలిచ్చి తృప్తి తీర్చుకుని "ఆ తండ్రికి బుద్ధి రావాలంటే యిదే సరైన శిక్ష" అనుకొన్నారు.

ఇది ప్రమాదం కాదని, హత్యే అని ఊరంతా గుప్పుమంది. లబో, దిబో మంటూ వచ్చారు అపర్ణ తల్లితండ్రులు. ఛీత్కారంగా చూసి వెళ్ళగొట్టారు. పాతికేళ్ళ పిల్లని పోగొట్టుకున్న గర్భశోకంతో ఇంటి కొచ్చారు పరంధామయ్య, భార్య.

ఇన్నేళ్ళూ యిటు తల్లి తండ్రుల లేమితనాన్ని, అటు అక్క అత్తింట పడుతున్న పాట్లని చూస్తున్న హేమలో ఆవేశం కట్టలు తెంచుకుని, అక్క చావుకి కారకులు అత్తవారేనని, ప్రమాదం కాదని, హత్య చేసారని పోలీస్ రిపోర్టు యిచ్చి వచ్చింది.

పోలీసులు రంగంలోకి దూకగానే దొడ్డి గుమ్మమెంట వచ్చారు గిరీష్. తండ్రి పరంధామయ్య యింటికి. "చూడు పరంధామయ్యా! నీ కూతురు ప్రమాదవశాత్తూ చనిపోయిందని రాసివ్వకపోతే నీ అంతు చూస్తాం! రౌడీల చేత నీ పిల్లల బ్రతుకులు నాలుగు రోడ్ల మధ్య నాశనం చేయించి జీవితాంతం పెళ్ళిళ్ళవకుండా చేస్తాం! మేం చెప్పినట్లు రాసిచ్చావో నీ రెండో కూతుర్ని కానీ కట్నం లేకుండా పెళ్ళి చేసుకుని నీ ఓ భారాన్ని తగ్గిస్తాం!! ఆలోచించుకో–" అని బెదిరించి, ఆశ చూపించి వెళ్ళిన తరవాత పరంధామయ్యలో ఆశవిత్తు మొలకెత్తి వెంటనే పోలీసుల దగ్గరకెళ్ళి అపర్ణ చంపబడలేదని రాసిచ్చేసి రాగానే, అటు వాళ్ళిచ్చిన లంచం, ఇటు పరంధామయ్య యిచ్చిన కాగితాన్ని అందుకుని ఆ ఫైలు మూసేసారు పోలీసు డిపార్టుమెంటువారు.

మరో నెల తిరక్కుండా పెళ్ళికొడు కయ్యాడు గిరీష్.

తన ప్రయత్నం నిష్ఫలం కాగా మళ్ళీ ఆ రాక్షస గృహానికే తన్ని కూడా యజ్ఞ పశువుగా తండ్రి పంపిస్తున్నాడని తెలిసి ఏడ్చి మొత్తుకుంది. ఆ పెళ్ళి చేసుకోనంది, గోల చేసింది, గొడవ చేసింది. ఫలితం శూన్యం. తన కాళ్ళపై తాను నిలబడలేని స్త్రీ పుట్టింట కన్నవారికి, అత్తింట అందరికీ తలొగ్గి బ్రతకాలి. "కానీ కట్నం తీసుకోకుండా మీ పిల్లని పెళ్ళాడుతా"నన్న ఒక్క మాట అపర్ణ చావుని మరిపింప జేసింది. పిల్లని చంపిన వాళ్ళకే మళ్ళీ పిల్ల నివ్వడానికి సిద్ధపడటానికి కారణం?! కట్నం అనే పిశాచం తన్ని ఆవరించక పోవడమేగా?హత్యలు చేసే అత్తవారిని నిందించే ముందు అటువంటి కిరాతకులకి చేతులారా బిడ్డల్ని అప్పగించే తండ్రుల నెందుకు నిందించరు?! కూతురి జీవితం చావు బ్రతుకుల మధ్య నలిగి పోతోందని తెలిసి కూడా పతివ్రతా ధర్మాలని బోధించి పంపిస్తున్నారు



ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వి. చ. సంచిక!

* మీ 'పొట్టలు' జాగ్రత్త!!
* సాహిత్య హంతకోపాఖ్యానం మేము నిర్వహించిన హాస్యనవలికల పోటీలో ప్రథమ బహుమతి అందుకున్న వ్యంగ్య వీచిక యీ సంచికలో హోల్ మొత్తంగా చదివి కడుపుబ్బ నవ్వండి!
* ఏ విజయలక్ష్మి? ప్రదర్శన యోగ్యం, పఠన యోగ్యం, అత్యశ్యం పొట్ట చెక్కలయ్యే ప్రమాదం- యిదీ యీ 'నాటిక' ప్రత్యేకత.
* 'ఆత్రేయ' నాటికీ నేటికీ 'ఆత్రేయే' స్పెషల్ యింటర్వ్యూ.
* "హనీమూన్ ఆరంభసమయే" ఇదేమిటి? యిలాంటివి ఎన్నో వున్నాయ్- మీ కాపీకోసం మా ఏజెంట్ నడగండి.

-ఎడిటర్

గానీ ఆమెకి మేమున్నా మన్న ధైర్యాన్నిచ్చి, రక్షణ నెందుకు కలిగించటం లేదు?! కోడళ్ళ చావులకి అత్తవారెంత కారకులో తల్లి తండ్రులూ అంతే కారకులు కారా? ఆడపిల్లని వదుల్చుకోవాలన్న గోలే తప్ప ఆమె సాధక బాధకాల్ని విని ఓదార్చవలసిన బాధ్యత లేదా?

"అక్కని చంపినా నాన్న నన్ను మళ్ళీ గిరీష్‌కి కట్టబెడుతున్నారు. రేపు నాకూ అదే గతి పడుతుంది. అప్పుడు చెల్లాయ్ అరుణ నిస్తాడా? తరవాత ఆఖరిదాన్నీ.... ఛీ- ఛీ- యిలాంటి నాన్నలున్నంత కాలం గిరీష్ లాంటి వాళ్ళకి ఎన్ని పెళ్ళిళ్ళయినా అవుతాయి. తప్పెక్కడుంది? ఎవరిది??"

ఇవన్నీ హేమ ఆవేశపు ఆలోచనలు. ఆమెలో ఎన్ని ఆదర్శభావాలున్నా, ఎంత ఉడుకు రక్తం ఉరకలు వేస్తున్నా అంతా నిస్సారమై పోయింది. కారణం యింకా తను తన కాళ్ళమీద నిలబడటం లేదు. తండ్రి ఒద్దీలో వుంది. ఫలితంగా పెళ్ళి కూతురిగా పీటల మీద కూర్చుని గిరీష్ చేత పుస్తె కట్టించుకుంది.

అగ్నిహోత్రావధానుల్లా ఇంట్లో అందరి నోళ్ళూ నొక్కేసే తండ్రిని ఎదిరించలేక ఈ పెళ్ళికి తలొంచిన హేమ మనసు మాత్రం ఎదురు తిరిగి మరింత మొండి కత్తిలా తయారయింది.

అత్తవారింట అడుగెట్టిన హేమని మొండి దెయ్యం ఆవరించింది. ఎవరేం చెప్పినా నిర్లక్ష్యంగా వెళ్ళిపోయేది. ఎవర్నీ లెఖ్ఖ చేసేది కాదు. అపర్ణ పిరికితనానికి, నెమ్మదికి అలవాటుపడ్డ ఆ కుటుంబం హేమ నిర్లక్ష్యాన్ని సహించలేక పోయే-వారు. కొత్త కదా అని కొన్నాళ్ళు వేచి చూసారు. ఫలితం లేకపోవడంతో పాత పద్ధతుల్ని హేమపట్ల కూడా ఆచరించసాగారు. అపర్ణని కట్నం తేనందుకు హింసిస్తే హేమని మొండిదని, పెంకిదని హింసించ సాగారు. వారి మాటల్ని, తిట్లని వినీ విననట్లు ప్రవర్తిస్తున్న హేమని చూస్తుంటే వారికి మరింత పిచ్చికోపం కలగసాగింది.

"చెప్పులు తెచ్చిపెట్టు హేమా!" అన్న మాటల్ని వినీ వినకుండా వెళ్ళిపోతున్న హేమ జబ్బ పట్టుకుని గదిలోకి లాగి కొడుతున్న భర్తని, గది బైట నిలబడి ఆ వింత తిలకిస్తూ, ఆనందిస్తున్న అత్తమామల్ని అసహ్యంగా ఓ చూపు చూసి, పక్క నున్న పేపర్‌వెయిట్ తీసి భర్త మీదకి విసిరి తలుపు తోసుకుని బైటకి వెళ్తున్న హేమకి "వెళ్ళనీ పొగరుమోతు రాస్కెల్‌ని- ఎక్కడి కెళ్తుంది?! రేపు దాని బాబు తీసుకొచ్చి అపర్ణని మన కాళ్ళ దగ్గర పడేసి వెళ్ళినట్లే వెళ్తాడు. ఈ సారొస్తే దీన్నీ అపర్ణ దగ్గరకే పంపి, దాని బాబుచేత మరో కాగితం "దాని చావుకి అదే కారకురాలని" రాయించుకుందాం. దీని పీడా విరగడవుతుంది" అంటున్న భర్త మాటలు వినపడక పోలేదు.

వారం గడిచింది, నెల గడిచింది. హేమ మళ్ళీ ఆ యింటికి రాలేదు. ఏ రోజు కారోజు వస్తుందని, రాకెక్కడికి పోతుందని అహంకారంతో గిరీష్, అతని కుటుంబం ఎదురు చూస్తోంది.

పరంధామయ్య కూతురికి రాసిన ఉత్తరం చూసి హేమ పుట్టింటికి వెళ్ళలేదని తెలియగానే అంతా షాకయ్యారు. అదే అదనుకుని వున్న వాటికి లేనివి మరిన్ని అల్లి ముళ్ళపొద చేసి పరంధామయ్యకి ఉత్తరం రాశారు హేమ గురించి.

ఆ ఉత్తరం చూసిన పరంధామయ్య నిలువునా నీరు కారిపోవడమే కాకుండా, నిప్పు తొక్కిన కోతిలా ఇంట్లో గెంతు లెయ్యసాగాడు. ఏం చెయ్యాలో తోచక "ఎలాగైనా హేమని వెతికి మీ కాళ్ళ దగ్గర పడేస్తా" నంటూ ఉత్తరం రాసి హేమ కోసం గాలించ సాగాడు.

నెలలు దొర్లి పోతున్నాయి. హేమ జాడ లేదు. "మొదటి భార్యని హత్య చేసారు. రెండో భార్య స్వాతి! భరించలేక పెళ్ళయిన రెండు నెల్లకే వెళ్ళి పోయిం"దన్న పుకారు వూరంతా గుప్పుమనగానే గిరీష్‌కి పిల్ల నివ్వడానికి ఎవ్వరూ సాహసించటం లేదు. గిరీష్ కుటుంబీకులు మాత్రం హేమ ఎవడితోటో లేచి పోయిందన్న పుకారు పుట్టించి, అందరికీ చెప్పసాగారు.

పరంధామయ్య కూడా హేమని తిట్టుకున్నాడేగానీ హేమ వెళ్ళిపోడానికి కారణం ఆలోచించ లేదు.

నదీ ప్రవాహంలాగే కాలం కూడా ఆగకుండా దౌడు తీస్తోంది.

పరంధామయ్య యింటి ముందు పెళ్ళి పందిరి కలకల్లాడుతోంది. అమాయకంగా వున్న అరుణ పెళ్ళికూతురు ముస్తాబులో మరింత అందంగా కనపడసాగింది. అపర్ణ చావు, హేమ పత్తా లేకపోవడం అన్న బెంగల్ని ఆ పందిరి దరిదాపులకి రానివ్వకుండా తిరుగుతున్నాడు పరంధామయ్య. ఆయన సతీమణి అరుంధతి, మనసులో ఏముంటుందో ఎన్నడూ చెప్పుకోలేని అశక్తురాలు. తన మాటకి ఎదురాడనివ్వని పరంధామయ్య ఇంట్లో ఎప్పుడూ సింహంలా ప్రవర్తించ బట్టే అపర్ణ చావుకి కారణం తెలిసి మళ్ళీ అదే సుడిగుండంలోకి హేమని తోస్తుంటే భర్తని వారించాలనున్నా వారించలేక చాటుకెళ్ళి కళ్ళు తుడుచుకుందే తప్ప పైకి ఏమీ అనలేకపోయింది. దెబ్బ మీద దెబ్బ అన్నట్లు హేమ ఆ బాధ భరించలేక ఏ అఘాయిత్యం చేసుకుందో అన్న దిగులు ఆ యిల్లాలి గుండెల్ని నమిలేస్తున్నా, పైకి ఏడ్చే స్వాతంత్ర్యం లేని నిర్భాగ్యురాలు అరుంధతమ్మ.

ఓ పక్క అరుణ పెళ్ళి పనులు చేస్తూనే మరో ప్రక్క కొంగుతో మాటి మాటికి కళ్ళొత్తుకుంటూ, ముక్కు తుడుచుకుంటున్న భార్యని గుడ్లెర్రజేసి నోరు మూయించాడు పరంధామయ్య.

పెళ్ళివారొచ్చారు. అరుణ గౌరీ పూజకి కూర్చుంది. మహూర్తానికి మరో గంట టైముంది. ఇంతలో వచ్చారు పోలీసులు బిలబిలా. పెళ్ళికొడుక్కి, పెళ్ళి కొడుకు తండ్రికి, పరంధామయ్యకి అరెస్టు వారెంట్ చూపించి ముగ్గుర్నీ జీపు ఎక్కించారు.

పందిరంతా చిందర వందరయిపోయింది. పెళ్ళి కొచ్చిన జనాలంతా విభ్రాంతంగా చూస్తూ నిలబడిపోయారు. అరుణ, అరుంధతమ్మా ఒక్కసారిగా ఘొల్లుమన్నారు. అంతవరకూ కలకల్లాడుతున్న పెళ్ళి పందిరి శవం వెళ్ళిన పందిరిలా తయారయింది. పందిట్లో బాజాలు బదులు శోకాలు మారుమ్రోగసాగాయి. అసలు కారణం ఏమిటో ఎవ్వరికీ అర్ధంకావటం లేదు. ఎవరికి తోచిన రీతిని వారు "అదిగో పులం"టే- ఇదిగో తోక" అని అంటున్నారు. నిజం ఏ ఒక్కరికీ తెలియదు. కాస్సేపు కాలక్షేపం కబుర్లయ్యాక వచ్చిన జనం వారి వారిళ్ళకి వెళ్ళిపోయారు. బంధువులు మాత్రం అరుంధతమ్మని ఓదారుస్తూ కూర్చున్నారు.





# "ప్రజా శ్రేయస్సే పరమావధి!"

## 'మాగ్‌సేసే' అవార్డు విజేత లక్ష్మీజైన్ మాటలు

ప్రజలకు చేసిన సేవకు గుర్తింపుగా 1989 సంవత్సరానికి శ్రీ లక్ష్మిజైన్‌కు ప్రతిష్ఠాత్మకమైన 'మాగ్‌సేసే' అవార్డు లభించింది.

ఈ అవార్డునందుకున్న భారతీయులలో 27వ వాడైన శ్రీ జైన్ తనకు ఈ అవార్డు లభించటంవల్ల నైతిక సమస్య లెదురయ్యాయని అంటున్నారు. కారణం- తాను ఎవరికోసం పాటు పడుతున్నానో ఆ నేత పనివారు కొత్త జాతీయ జౌళి విధానంవల్ల ఒకవైపు ఉపాధికోల్పోయి వుండగా, మరో వైపు తనకు ఈ అవార్డు సమస్యను తెచ్చి పెట్టినట్లయిందన్నారు.

భారత స్వాతంత్ర్యానంతరం రాజకీయాలను త్యజించి పేద ప్రజల సముద్ధరణకై తన జీవితాన్ని అంకితం చేసిన శ్రీ జైన్- 'ఫౌండేషన్ నుంచి కాదు నాకు అవార్డు రావలసింది... ప్రణాళికా సంఘం నుంచి రావాలి' అని అన్నారుట. తనను అభినందించబోయిన ప్రణాళికాసంఘం సభ్యులతో. 'నేత పనివారి ప్రయోజనాలకోసం ప్రభుత్వం తన విధానాన్ని మార్చుకున్నప్పుడే అది నాకు లభ్యమవుతుంది' అన్న శ్రీ జైన్ మాటలు వింటే వారిపట్ల ఆయనకున్న శ్రద్ధ విదితమవుతుంది.

స్వాతంత్ర్యానంతరం అప్పటి ప్రభుత్వం దేశ విభజన సమస్యలతో సతమతమవుతుండటంతో శరణార్థుల పునరావాస, సహాయ కార్యక్రమాలను ఆయన స్వయంగా చేపట్టటం చూస్తే ఆయన వ్యక్తిత్వం ఎలాంటిదో ద్యోతకమవుతుంది. ప్రజలను చైతన్యవంతం చేయటమేకాదు, వారి ఆలోచనా సరళిలో కూడా మార్పు రావాలని ఆయన కోరారు.

'ఇప్పుడు సమాజానికి కావలసింది స్వచ్ఛంద సంస్థలు కాదు... స్వచ్ఛంద చర్యలు, కృషి అత్యవసరం' అని శ్రీ జైన్ అభిప్రాయపడ్డారు. కర్నాటక, ఉత్తరప్రదేశ్ ప్రణాళికా సంఘాల్లో ఆయన పనిచేశారు.

ప్రణాళికలు ప్రజల అవసరాల కనుగుణంగా వారి చొరవతోనే రూపుదాల్చుకోవాలని పేర్కొనటం ప్రజలపట్ల ఆయనకున్న అభిమానాన్ని చాటిచెప్తుంది.

'అభివృద్ధికితోడ్పడే రాజకీయ విజ్ఞత కావాలని, నేత పనివారి సమస్యకంటే, మన సమస్యలు ముఖ్యం కాదని' అంటున్న ఈ గాంధేయవాదికి 'మాగ్‌సేసే' అవార్డు సంతృప్తిని కల్గించకపోయినా, ప్రజా సేవలో విశేష కృషికి గుర్తింపుగా యిచ్చే ఈ అవార్డు శ్రీ జైన్‌కు యివ్వాలనుకోవటం మాత్రం సమంజసమైన నిర్ణయమే!

-తిలక్

మరో రెండు గంటలకి పోలీస్‌స్టేషన్‌కెళ్ళిన అరుంధతమ్మ, అన్న, మరిది పాలిపోయిన ముఖాలతో తిరిగొచ్చారు. వారు చెప్పిన విషయం విన్న అరుంధతమ్మ లబో, దిబో మంటూ గోల పెడితే, అరుణ గదిలో కూర్చుని కుళ్ళి కుళ్ళి ఏడవసాగింది.

ఏడాదిపాటు నడచిన ఆ కేసులో భార్య వుండగా పిల్లనిచ్చి పెళ్ళిచేస్తున్నందుకు పరంధామయ్యకి కొద్దిపాటి శిక్షతో వదిలెయ్యగా గిరీష్‌కి, తండ్రికి యావజ్జీవ కారాగార శిక్ష పడింది. కారణం - కావాలని హేమ గిరీష్‌ని రెచ్చగొట్టి వెళ్తూ వెళ్తూ చీరచాటున దాచిన టేప్‌రికార్డర్‌లో రికార్డ్ చేసిన గిరీష్ మాటలు 'వెళ్ళనీ పొగరుమోతు రాస్కెల్‌ని. ఎక్కడికెళ్తుంది? రేపు మళ్ళీ దాని బాబు తీసుకొచ్చి అపర్ణని మన కాళ్ళదగ్గర పడేసెళ్ళినట్లే దీన్ని తెచ్చి పడేసి వెళ్తాడు. ఈసారొస్తే దీన్నీ అపర్ణ దగ్గరకే పంపి దాని బాబుచేత మరో కాగితం 'దాని చావు కదే కారకురాలని రాయించుకుందాం! దాంతో పీడా విరగడవుతుంది' అన్న మాటల్ని కోర్టులో వినిపించి, అపర్ణ చావుకి కారకులు గిరీష్ కుటుంబమే అని రుజువు పర్చడమేకాకుండా, తనకి విడాకులివ్వకుండా మళ్ళీ పెళ్ళిచేసుకుంటున్నాడని చెప్పి, రుజువుపర్చగానే కోర్టు వారికి యావజ్జీవ కారాగార శిక్ష విధించింది.

ఇంటికొచ్చిన హేమని చూసి పరంధామయ్య సిగ్గుతో తలొంచుకోగా, తల్లి మాతృహృదయం ప్రేమతో పెల్లుబికి హేమని కౌగలించుకుని దుఃఖించసాగింది. తల్లిని, భీత హరిణిలా మూలకి నక్కి కూర్చున్న అరుణని అక్కున జేర్చుకున్న హేమ "చూడండి యిలాకంట తడిపెట్టడం నుంచే ఆడది అబలన్న పేరుపొందింది. పుట్టింట తండ్రి అదుపాజ్ఞల్లో, అత్తింట భర్త, వారి కుటుంబం వారి కనుసౌజ్ఞల్లో బ్రతకాల్సొస్తోంది. కాలంతో మనం మారాలి. ఆడది చదువుకుంటోంది. తన కాళ్ళమీద తాను నిలబడి తనకి జరిగే అన్యాయాల్ని ఎదుర్కోవాలి. అలా కొందరైనా ఎదురుతిరిగిననాడు పురుషాహంకారానికి బలికానవసరం వుండదు. ఇటు నాన్న మూర్ఖత్వంవల్ల, అటు గిరీష్ కుటుంబం అహంకారంవల్ల అక్క బలైపోయింది. అయినా మళ్ళీ నన్ను బలియివ్వబోయారు. నాన్నకి భయపడి ఆనాడు తాళికట్టించుకున్నా, వారి రాక్షసత్వం నుంచి తప్పించుకుని నా స్నేహితురాలి సహకారంతో ఉద్యోగం సంపాదించుకుని నా బ్రతుకు నేను బ్రతుకుతున్నాను. నే నెంత హాయిగా, స్వేచ్ఛగా బ్రతుకుతున్నా నాకు, నాన్న అరుణ, కరుణల జీవితాల్ని కూడా నాశనం చేస్తాడని, ఆ సింహాల నోటికే అందిస్తారేమో' అన్న అనుమానం కలిగేది. అందుకే ఈ వూళ్ళోనే వున్న నా స్నేహితురాలి ద్వారా ఈ ఇంటి విషయాలు ఎప్పటికప్పుడు తెలుసుకునే దాన్ని. సమయం వచ్చినప్పుడు తగినరీతిని అందరికీ బుద్ధిచెప్పాలని వేచివున్నాను. నేననుకున్నట్లే జరిగింది. టైమొచ్చింది. నా పట్టుదలకి ఫలితం దక్కింది. ఇంక మీరు ఎవ్వరికీ భయపడనక్కరలేదు. మీరు నిస్సహాయులు కారు. అరుణా! కరుణా! మీకు నా అండవుంది. ఇలాంటి తండ్రులు పిల్లల్ని బలిపీఠాలకి అప్పగిస్తుంటే గిరీష్ లాంటివాడికి ఎన్ని పెళ్ళిళ్ళయినా అవుతాయి. అలా జరుగుతోంటే ఆ అహంకారులు ఎన్ని హత్యలైనా చేస్తారు. ఇదిలా సాగినంతకాలం ఈ సమస్యలు అంతంకావు. ఈతరం ఆడది తలెత్తి ఎదిరించిననాడే ఇలాంటి మూర్ఖులకి బుద్ధివచ్చేది. నాన్న ఇంక ఏ ఆడపిల్ల గొంతూ కొయ్యలేదు" అంటున్న హేమ మాటలు తేళ్ళల్లా కుడుతుంటే సిగ్గుతో పరంధామయ్య తలదించుకున్నాడు. ●



# గర్భిణీస్త్రీలు తీసుకోవలసిన జాగ్రత్తలు!

*ప్ర :- డాక్టర్‌గారూ.. గర్భిణీ ఏర్పడిందని ఎలా నిర్ధారించవచ్చో వివరిస్తారా?*

జ :- గర్భిణీని నిర్ధారించుటకు కొన్ని అనుమానాస్పదమైన గుర్తులు కొన్ని ఖచ్చితమైన గుర్తులు ఉన్నాయి. అనుమానాస్పదమైన వాటిలో ఇంతకుముందు క్రమంగా వచ్చు ఋతుక్రమము (నెలసరి) ఆగిపోవును. కడుపు ఎత్తుగా పెరుగుట, రొమ్ములలో మార్పు మొదటి కాన్పువారిలో కన్పిస్తాయి. కొంత మందిలో వాంతులు, వికారం (వేవిళ్ళు) వుంటాయి. మూత్రము ఎక్కువగా వస్తుండటం, అలసట అనిపించడం! ఖచ్చితమైన నిర్ధారణ ఏమంటే కడుపులోపల బిడ్డ యొక్క గుండె శబ్దము 'ఫీటల్ మానిటర్' అనే పరికరము ద్వారా వినవచ్చును. కడుపుమీద చేయి ఉంచి బిడ్డయొక్క కదలికలు గమనించవచ్చు. నెలతప్పిన 15 రోజుల తరువాత మూత్రమును పరీక్షచేసి గర్భిణీ అయినది కానిదీ తెలియజేయువచ్చును.

*ప్ర :- ఎంత వయస్సువరకు గర్భిణీ ఏర్పడటానికి అవకాశం ఉంది?*

జ :- ఋతుక్రమం క్రమంగా వచ్చు స్త్రీలలో ఋతుక్రమం ఆగిపోయేవరకు గర్భిణీ వచ్చే అవకాశం ఉంది (40 లేక 45 సం.వరకు)

*ప్ర :- కడుపులో వున్న బిడ్డకు ప్రాణం ఉన్నదీ లేనిదీ ఎలా తెలుసుకోవచ్చుంటారు?*

జ :- రోజు రోజుకు కడుపు క్రమంగా ఎదుగుతుంటుంది. కడుపుపై చేయివేసి పరీక్షచేస్తే బిడ్డ కదలికలు గమనించవచ్చు. స్టెత్‌స్కోపు లేదా ఫీటల్ మానిటర్ ద్వారాకాని బిడ్డయొక్క గుండె శబ్దం కడుపుపై భాగం నుండి వినవచ్చు. అలాగే అల్ట్రా సౌండ్ స్కానింగ్ ద్వారా బిడ్డ ప్రాణంతో ఉంది లేనిది తెలుసుకొనవచ్చును.

*ప్ర :- సాధారణంగా గర్భస్రావం ఎందుకు జరుగుతుంటాయి డాక్టర్ ?*

జ :- గర్భస్రావం మొదటి మూడు నెలలలోనే జరుగుతుంటాయి. దీనికి సరి అయిన కారణం చెప్పడం కష్టమే. ముఖ్యంగా పిండం యొక్క ఎదుగుదల సరిగా లేకుండినా జనిటిక్ ఫ్యాక్టర్ వలనగాని, క్రోమోజోముల ఎబ్‌నార్మాలటిస్ వలన కాని జరుగవచ్చును. అలాగే తల్లియొక్క అనారోగ్య పరిస్థితి వలనకూడా జరుగవచ్చును. జ్వర తీవ్రత ఎక్కువగల జబ్బులవలన, సుఖవ్యాధులవలన, డయాబిటిస్, మూత్ర పిండాల వ్యాధులువలనకాని, పోషక పదార్థాల లోపంవలనను అధికంగా మానసిక వత్తిడి ఏర్పడటం వలనకాని గర్భసాృవము కలగటానికి అవకాశం ఉంది. విటల్‌మిన్ 'ఇ' లోపంవలన, గర్భసంచిలో పైబ్రాయిడ్స్ అనే గడ్డలు వుండటంవలన కూడా గర్భసాృవములు జరగవచ్చుమ.



డా. కె. సులోచనాదేవి,
ఎమ్.బి.బి.యస్., డి.జి.ఒ.

డా. కె. సులోచనాదేవి హైదరాబాద్ గాంధీ మెడికల్ కాలేజీలో వైద్య శాస్త్రాన్ని అభ్యసించారు. వీరు విజయవాడలోని సత్యన్నారాయణపురంలో భర్త డా. టి. సీతారామారావుగారితో కలిసి "శ్రీ నర్సింగ్‌హోమ్" నిర్వహిస్తున్నారు. మెడికల్ క్యాంపుల నిర్వహణకి, మెడికల్ క్యాంప్సలలో ఎక్కువగా వీరు సేవ చేస్తారు. సామాన్యుడికి వైద్యం దగ్గర కావాలనే ఆకాంక్ష వీరికి బాగా వున్నది. సాహిత్యాభిలాష వున్నది. డెలివరీ కేసులు లెక్కకుమించి చేసి పేరు పొందారు.

## కొన్ని జాగ్రత్తలు

*ప్ర :- గర్భిణీస్త్రీలు తప్పనిసరిగా తీసుకోవాల్సిన జాగ్రత్తలు వివరిస్తారా ?*

జ :- నెల తప్పిందని తెలిసినప్పటి నుండి గర్భిణీ అని నిర్ధారించిన తరువాత 7వ నెలవరకు నెలకు ఒకసారి, 8వ నెల రెండుసార్లు 9వ నెలలో వారానికి ఒక్కసారి డాక్టరుచేత పరీక్ష చేయించుకోవాలి. తొమ్మిది నెలలు పూర్తి అయ్యేలోపల 21 నుంచి 28 పౌన్లు కంటే బరువు పెరగకుండా చూచుకోవాలి. అలాగే రక్తపరీక్ష, మూత్రపరీక్ష 3వ నెలలోమరియు 5-7 నెలలో చేయించుకోవాలి. ఆహార విషయాలలో కూడా చాలా జాగ్రత్త వహించాలి. రోజుకు రెండు లీటర్లు నీరు తీసుకుంటే మూత్రము సరిగా వస్తుంది, మలవిసర్జనకూడా బాగుంటుంది. ఆహారంలో ఎక్కువగా పాలు, పళ్ళు, అయిరన్ ఎక్కువగల ఆకుకూరలు, మాంసకృత్తులు, లివర్, గ్రుడ్లు, పప్పు తీసుకోవాలి. పగలు రెండు గంటలు, రాత్రిళ్ళు 8 నుంచి 10 గంటలు నిద్ర అవసరము. అలాగే రోజూ తేలికపాటి వ్యాయామంవలన చాలా ఉల్లాసంగాను, సుఖప్రసవం జరుగుతుంది. దూరప్రయాణాలు తగ్గించాలి. రోజూ రెండుసార్లు గోరువెచ్చని నీటితో స్నానం చేయాలి.

*ప్ర :- గర్భిణీస్త్రీలు ఎటువంటి మందులు వాడకూడదో తెలియచేస్తారా ?*

జ :- గర్భిణీస్త్రీలు కొన్నిమందులు వాడినట్లయితే లోపల బిడ్డపై కొన్ని దుష్ఫలితాలు ఏర్పడతాయి. ఎక్కువ మోతాదులో సాలిటలేట్సు, పొటాషియం ఐయోడైడ్, విటమిన్ 'కె' మూర్ఛలు రాకుండా వాడే మందులు, మార్ఫిన్, ఆల్కహాల్, టాల్బుటమైడ్, క్వినైన్ క్లోర్‌ఫై ఆక్సైడ్, ఎఫెలోథిన్ టెట్రాసైక్లిన్‌లాంటి మందులు వాడకూడదు.

## కవలపిల్లలు

*ప్ర :- కడుపులో కవలలు ఉన్న సంగతి ఎలా తెలుసుకోవచ్చుంటారు ?*

జ :- కడుపుయొక్క పరిమాణం మామూలుకంటే పెద్దదిగా ఉంటుంది. కడు

వుమీద పరీక్ష చేసిన యెడల బిడ్డయొక్క శరీర భాగములు చేతి స్పర్శద్వారా తెలుసుకోవచ్చును. కొన్నిసార్లు వేవిళ్ళు ఎక్కువగా ఉండును. అన్నిటికంటే ఖచ్చితమైన నిర్ధారణ అల్ట్రాసౌండ్ ద్వారాను, 'ఎక్సరే' ద్వారాను తెలుసుకోవచ్చును.

*ప్ర :- సిజేరియన్ ఆపరేషన్ ఏ పరిస్థితులలో అవసరం ఏర్పడుతుంది ?*

జ :- కాన్పు మొదటి దశలో బిడ్డకు ఒత్తిడి ఎక్కువగా ఉన్నప్పుడు, ప్రసవద్వారం చిన్నదిగా ఉన్నప్పుడు, ఉమ్మినీరు పడిపోయి నొప్పులు రాకుండా ఉన్నప్పుడు, ముందు కాన్పులు సరిగాలేనివారికి, మావి ప్రసవ ద్వారంకు అడ్డువచ్చినప్పుడు, లోపల బిడ్డ ప్రాణంతో ఉండి నొప్పులు లేక గర్భస్రావం ఎక్కువ జరిగినప్పుడు, బిడ్డ ప్రాణంతో వుండి బొడ్డుత్రాడు ప్రసవం ద్వారంలో యిరుక్కొని వున్నప్పుడు అవసరం. ఇదివరకు రెండు సిజేరియన్స్ జరిగినప్పుడు మూడవది కూడా సిజేరియన్ అవసరమవుతుంది. పైన వివరించిన పరిస్థితులలో తప్పనిసరిగా సిజేరియన్ చేయవలసి వస్తుంది.

* "కాన్పుకు కాన్పుకు మధ్య 2 లేక 3 సం.లు తేడా ఉండటంవలన తల్లి ఆరోగ్యం బాగా ఉంటుంది."
* "క్రమమైన శారీరక వ్యాయామం పరిమితంగా ఇంటిపనులు చేసుకుంటే సుఖప్రసవం ఖాయం!"
* "నువ్వులు, బొప్పాయికాయలు తింటే గర్భిణీ పోవటమనేది కేవలం అపోహమాత్రమే"
* "అనవసరమైన మందుల వాడకంవల్ల పుట్టే బిడ్డపై దుష్పరిణామాలు వుంటాయి."
* "అనవసరంగా సిజేరియన్ ఆపరేషన్ ఏ డాక్టర్లూ చేయరు."

*ప్ర :- హాస్పటల్‌లో చేరితే అవసరం లేకున్నా సిజేరియన్ చేస్తున్నారనే అభిప్రాయం కొంతమందిలో ఉంది. దానిపై మీ అభిప్రాయం ఏమిటి డాక్టర్?*

జ :- మీరన్నట్లు అటువంటి అభిప్రాయం కొందరిలో ఉండవచ్చు, ఏ ఏ పరిస్థితులలో సిజేరియన్ చేస్తారో పైన వివరించాను. అంతేకాని అవసరం లేకపోయినా ఏ వైద్యుడు సిజేరియన్ చేయడని నా అభిప్రాయం!



*ప్ర :- గర్భిణీస్త్రీలకు ఆ సందర్భంలో ఏమైనా ప్రత్యేకమైన వ్యాధులు వచ్చేందుకు అవకాశాలున్నాయా ? అవి ఏమిటి ?*

జ :- రక్తపోటు ఎక్కువ అవడంవలన ధనుర్వాతము, రక్తహీనతవలన ఎనీమియా, డయాబిటిస్, మూత్రపిండములకు సంబంధించిన వ్యాధులు, బాక్టీరియన్ ఇన్‌ఫెక్షన్, ఫంగస్ ఇన్‌ఫెక్షన్, జాండీస్ మానసిక వ్యాధులు రావటానికి అవకాశం ఉంది. అటువంటి సందర్భంలో జాగ్రత్తగా ట్రీట్‌మెంట్ చేయించుకోవాలి.

*ప్ర :- ఫలానా రోజున ప్రసవించవచ్చుని ఖచ్చితంగా చెప్పవచ్చునా ? అయితే ఎలాగో వివరించరూ ?*

జ :- ఋతుక్రమం క్రమంగా వచ్చే



స్త్రీలలో ప్రసవం ఎప్పుడు వచ్చేది ఖచ్చితంగా చెప్పవచ్చును. అఖరిసారి ఋతుక్రమం తప్పిన నెల తేదిని గుర్తు పెట్టుకొనవలెను. ఆ తేదికి 7 రోజులు కలుపుకుని, ఆ నెలకు 3 నెలలు వెనకకు గుర్తు పెట్టుకున్నట్లయితే ప్రసవము యొక్క తారీఖు, నెల చెప్పవచ్చును. ఉదా: జనవరి 1వ చివరి ఋతుక్రమం అయిన డెలివరి ఎక్స్‌పెక్టెడ్ తేది అక్టోబర్ 8వ తేది అవుతుంది.

*ప్ర :- నువ్వులు, బొప్పాయికాయి తింటే గర్భిణీ పోతుందంటారు. అది ఎంతవరకు నిజమంటారు?*

జ :- ఇది కేవలం అపోహ మాత్రమే ! వీటిని తినడం వలన గర్భం పోదు.

*ప్ర :- 'ఎమ్.టి.పి.' అంటే ఏమిటి ? అది ఎన్ని నెలలో చేయవచ్చును ?*

జ :- 'ఎమ్.టి.పి.' అంటే మెడికల్ టర్మినేషన్ ఆఫ్‌ప్రెగ్నెన్సీ. ప్రభుత్వం దీన్ని చట్టబద్ధం చేసింది. దీన్ని 12 వారాలు లోపలే చేయాలి !

*ప్ర :- కాన్పుకు కాన్పుకు మధ్య ఎంత ఎడము ఉండాలో తెలియచేస్తారా ?*

జ :- కనీసం 2 సం. నుండి 3 సం. తేడా కాన్పుకు కాన్పుకు ఉండాలి. అలా లేకుంటే తల్లి ఆరోగ్యం క్షీణించటానికి అవకాశం ఉంటుంది !

ఇంటర్వ్యూ :
హిప్నటిస్టు టి.ఎస్. రావ్

సీరియల్

# పంచశూలమ్

విశ్వప్రసాద్

## 73

(గతసంచిక తరువాయి)

ఇంతవరకూ సాగిన కథ-19 : పంచశూలమ్ పంపిన యువకుడు ఇన్‌స్పెక్టర్ 'షా'గా చెలామణీ అవుతూ జోషీ కేసు దర్యాప్తు చేస్తుంటాడు. గురూజీ కూతురు మీనాక్షి అంధురాలై మరణించగా, జయరాజ్ కొడుకు మోహన్ హత్యకు గురై మరణిస్తాడు. ఎం. ఎల్. ఎ. దీపాదేవిని ఊర్వశి కాల్చి చంపుతుంది. జయరాజ్ భార్య పరిమళను మదన్ కాల్చి చంపి ఆమె శవాన్ని యింటి ముందు వ్రేలాడదీస్తాడు. ఊర్వశి తల్లి, చెల్లెలు ఉరిపోసుకుని చనిపోతారు. దీపాదేవిని చంపిందన్న ఆరోపణపై ఊర్వశిని- అబ్దుల్లా అరెస్టు చేసి మానభంగం చేయబోతాడు. పంచశూలమ్ అడ్డుపడి బెయిల్ మీద ఊర్వశిని విడిపించుకొని తీసుకువెళ్తాడు.

ఇన్‌స్పెక్టర్ ఆలీషాలా డ్రెస్ చేసుకుని, నిలువుటద్దం ముందు నిలుచున్నాడు సుభాష్! పులిపిరికాయకు గమ్ పెట్టి, కుడి బుగ్గమీద అతికించుకున్నాడు. హేండ్ స్టిక్ తీసుకుని బయలుదేరడానికి సిద్ధమయ్యాడు.

అదే సమయంలో ఫోన్ మోగింది. రిసీవరు అందుకున్నాడు.

"హలో, మై బోయ్! ఈ క్షణం నుండి నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి." అటు నుండి సుపరిచితమైన కంఠం వినిపించింది.

"ప్రతిక్షణం జాగ్రత్తగానే ఉంటున్నాను."

"మీనాక్షి కళ్ళు తీసేయడం, మీనాక్షి-మోహన్‌ల పెళ్ళి ఆగిపోవడం, మోహన్ తల పరిమళ కారు డిక్కీలో ఉండటం, పరిమల హత్యగావింపబడి తన యింటి గేటుకు వేలాడదీయబడటం, భీమరాజు-దీపాదేవీ చంపబడటం, అహల్య-మల్లికలు ఆత్మహత్య చేసుకోవడం-ఈ దుర్ఘటనలన్నీ పోలీసు డిపార్ట్‌మెంటులో కలవరాన్ని లేవదీశాయి. ఐ.జీ.తో సహా అంతా అలర్ట్ అయ్యారు. ప్రతి వ్యక్తినీ, పాయింటునూ పదే-పదే పరిశీలిస్తున్నారు."

"అది మామూలే....."

"కాని, సి.బి.ఐ. డైరెక్టర్ ఆదిత్య దగ్గర నుండి బయలుదేరాడు ఆలీషా. పాతికేళ్ళ క్రిందటి కేసు పరిశోధిస్తానని, అపరాధుల్ని ఉరికంబమెక్కిస్తానని ప్రగల్భాలు పలికాడు......అతని రూపంలో నువ్వు హైదరాబాద్ వచ్చావు. ఇంత వరకు జోషీ కేసుకు సంబంధించిన ఒక్క రహస్యం కూడా సి.బి.ఐ. డైరెక్టర్‌కు తెలియజేయలేదు. పైగా, నువ్వు హైద్రాబాదు వచ్చాక ఆ కేసుకు సంబంధించిన-ఐదుగురిలో యిద్దరు హత్యగావింపబడ్డారు...."

"ఇంకా ముగ్గురు మిగిలారు." ఆవేశంతో అన్నాడు సుభాష్.

"అది వేరే విషయం. కాని, షాగా వ్యవహరిస్తున్న నీ దగ్గర నుండి యింత వరకు ఆదిత్యకు ఏవిధమైన యిన్‌ఫర్‌మేషన్ వెళ్ళకపోవడం వల్ల, అతనే స్వయంగా వచ్చాడు."

"వాట్?" రెట్టించాడు సుభాష్.

"యస్...మీనాక్షి, మోహన్, పరిమళ, భీమరాజు, దీపల హత్యలతోను, విచిత్రమైన కథలతోను హైద్రాబాదంతా ఉడికిపోతోంది. అహల్య, మల్లికల ఆత్మహత్యలు పట్టణంలో విపరీతమైన సంచలనాన్ని కలిగించాయి. నిన్న రాత్రి ఊర్వశిని పోలీస్ స్టేషన్ నుండి బైటకు తీసుకొచ్చిన సంఘటన ప్రజల్లోనూ, పోలీసు డిపార్టుమెంటులోనూ ఆందోళన చెలరేగింది. ఈ సంఘటనలన్నీ ఢిల్లీ వరకు పాకాయి. దానితో సి.బి.ఐ. డైరెక్టర్ ఆదిత్య ఢిల్లీ నుండి రహస్యంగా విమానంలో వచ్చాడు. మారువేషంలో పంచామృతం హోటల్లో బస చేశాడు....నువ్వు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి."

"పొరపాటు జరిగితే సవరించడానికి మీరున్నారుగా!"

"ఉన్నాను. కాని, పంచప్రాణాల్లో రెండు ప్రాణాలు పోయాయి. మూడు ప్రాణాలతో బతుకుతున్నాను. అవి కూడా ఏ క్షణంలో పోతాయో తెలియదు. నా మీద ఎక్కువ ఆశపెట్టుకో వద్దు. నీ జాగ్రత్తలో నువ్వు ఉండు" అని అటువైపు రిసీవరు పెట్టేసినట్లు శబ్దం వినిపించింది.

నొసలు చిట్లించాడు. కొన్ని క్షణాలు ఆలోచిస్తూ నిలుచున్నాడు. ఓ నిశ్చయానికి వచ్చాడు. పులిపిరికాయను సవరించుకుని పోలీస్ స్టేషన్‌కు బయలుదేరాడు సుభాష్.

## 74

టూ టౌన్ పోలీస్ స్టేషన్ లోపల కెళ్ళగానే-షడన్ బ్రేక్ వేసి జీపు ఆపాడు ఆలీషా వేషంలో ఉన్న సుభాష్. ఒక్క సెకండ్ ఆ ప్రదేశాన్ని పరిశీలనగా చూశాడు.

ఎవరో పై అధికారులు వచ్చినట్లు, ఆ ఆవరణలో నిలుచున్న పోలీసులు చాలా అలెర్ట్‌గా ఉన్నారు. సింహద్వారం ముందు ఐ.జీ. మహేంద్ర కారు, రెండు జీపులు ఉన్నాయి. పరిస్థితిని అర్థం జేసుకున్నాడు సుభాష్. పళ్ళు పట-పట కొరికాడు-కోపోద్రేకాలతో.

అతని పక్క సీట్లో-కాళ్ళు, చేతులు బంధింపబడి, ముడుచుకుని కూర్చున్నాడు ఓ యువకుడు. ఫుట్‌బాల్‌ని తన్నినట్లు అతన్ని కాలితో తన్నాడు సుభాష్.

ఆ ఒత్తిడికి బంతిలా తూలి, జీప్‌లోంచి కిందకు పడ్డాడు ఆ యువకుడు.

అంతలోనే యిద్దరు కానిస్టేబుల్సు వచ్చి, సుభాష్‌కి సెల్యూట్ చేశారు. ఓ కానిస్టేబుల్ ఏదో చెప్పబోయాడు. కాని, అతని మాటలు వినే మూడ్‌లో లేదు సుభాష్. జీప్‌లోంచి

కిందకు దుమికాడు. "అతన్ని నా రూమ్‌కి తీసుకురండి" అని, గబ గబా మెట్లెక్కి ముందు గదిలో కెళ్ళాడు.

"సార్! మీకు ఫోన్" సార్జంట్ చెప్పాడు.

రిసీవరు అందుకున్నాడు "షా ఈజ్ దిస్ సైడ్" అన్నాడు సుభాష్.

"హై బోయ్! బి కేర్‌ఫుల్. నీ విషయంలో ఐ.జి.మహేంద్ర ఎటూ నిశ్చయించుకోలేక కన్‌ఫ్యూజ్ అయిపోయాడు. అయితే, ఓ మామూలు మనిషి-పోలీసు డిపార్టుమెంటులో ప్రవేశించి, సి.ఐ.డి యిన్‌స్పెక్టర్‌గా వ్యవహరిస్తున్నాడని అతను వూహించలేదు, ఎవరూ వూహించలేరు. ఎందుకంటే సివిలియన్స్‌కి పోలీసువారి క్రమశిక్షణ, రహస్యాలు, కిటుకులు, కసాయితనం తెలీదు. కాని, నువ్వు సోఫియాను వివాహ [illegible] చేసుకోవడం వలన, ఆమె తండ్రి పోలీసు ఆ [illegible] రు కావడం వల్ల-వాళ్ళ సహచర్యంలో పో [illegible] డిపార్టుమెంటులోని రహస్యాలు, మెలకు [illegible] బాగా తెలుసుకున్నావు. అందుకే [illegible] నెగ్గుకుంటూ వచ్చావు. ఇప్పుడు [illegible] డా అదే స్టయిల్ మెయిన్‌టెయిన్ చెయ్. జాలి, దయ, మమత-అన్నీ విడిచి పెట్టి, రాక్షసత్వం చూపించు."

"ఐ నో. థ్యేంక్యూ!" అని రిసీవరు ఫోన్ మీద పెట్టేశాడు సుభాష్.

అంతలోనే, కానిస్టేబుల్స్-జీప్‌లోంచి కింద పడిన యువకుణ్ణి తీసుకొచ్చారు. టేబిల్ మీది చాకు తీసుకున్నాడు. అతని చేతులకు, కాళ్ళకు ఉన్న కట్లు తెంచేశాడు. "స్టాండప్"



అన్నాడు బిగ్గరగా సుభాష్.

ఆ యువకుడు ఒణు కుతూ లేచి నిలుచున్నాడు.

ఆశ్చర్యం!-అచ్చం అలీషాలాగే ఉన్నాడతను!

ఒకే పోలికలో ఉన్న యిద్దరు అలీషాలను చూసేసరికి స్తంభించి పోయారు పోలీసులు.

"సి.ఐ.డీలు రకరకాల వేషాలు వేసుకుని అపరాధుల్ని వేటాడతారు. కాని, నువ్వు-ఓ సివిలియన్ వి-పోలీసు ఆఫీసరు వేషం వేసుకుని ప్రజల్ని, డిపార్టుమెంటును మోసం చేస్తావురా బద్మాష్!" అంటూ ఆగ్రహావేశాలతో అతని చెంప మీద కొట్టాడు సుభాష్.

ఆ దెబ్బకు ఆ యువకుని కుడి బుగ్గ మీది నకిలీ పులిపిరికాయ వూడిపోయింది.

ఆ దృశ్యాన్ని చూసే సరికి పోలీసువారంతా నిశ్చేష్టులయ్యారు.

టేబిల్ మీది నీళ్ళగ్లాసు అందుకున్నాడు సుభాష్. అతని ముఖం మీద నీళ్ళు చల్లాడు. రుమాలుతో అతని ముఖం తుడిచాడు. నల్ల రంగు తొలగిపోయి, ఎర్రగా తయారయింది అతని ముఖం.

"రాస్కెల్! ఎన్ని వేల గుండెలున్నాయిరా నీకు-పోలీసు డిపార్టుమెంటును మోసం చెయ్యడానికి?" అంటూ బూటు కాలితో అతని మోకాలి మీద బలంగా తన్నాడు సుభాష్.

చిన్నగా అరిచి, ప్రాణం పోయినట్లు గిజ-గిజలాడిపోయాడు ఆ యువకుడు.

"ఇడియట్ చెప్పరా? నా వేషం ఎందుకు వేసుకున్నావ్? నిజం చెప్పు, లేదా, నీ ప్రాణాలు తీసేస్తాను" అంటూ రెచ్చిపోయాడు సుభాష్. హేండ్‌స్టిక్‌తో అతని వేళ్ళ మీద కొట్టాడు.

బాధతో ఒంకర్లు తిరిగిపోయాడు ఆ యువకుడు. కాని, నోరు తెరవలేదు.

"బద్మాష్! నీ చేత నిజం ఎలా చెప్పించాలో నాకు బాగా తెలుసు. నీ ఎముకలు విరగ్గొట్టేస్తాను. శరీరం కుళ్ళబొడిచేస్తాను, ప్రాణాలు తోడేస్తాను. అలాంటి దుర్గతి కలగకుండా ఉండాలంటే నిజం చెప్పు..... ఎమ్మెల్యే దీపాదేవిని, పరిమళను ఎందుకు చంపావ్? పోలీస్ కస్టడీలో ఉన్న భీమరాజు మీద విషప్రయోగం ఎందుకు చేశావ్?. మీనాక్షి కళ్ళు పొడవడానికి కారణమేమిటి? మోహన్ తల ఎందుకు నరికావ్? వాళ్ళంతా నీ శత్రువులా?" ప్రశ్నించాడు సుభాష్.

కాని, ఆ యువకుడు మాట్లాడలేదు.

"చెప్పరా రాస్కెల్.....నువ్వు జోషీ మనిషివి. అతని తరఫున కిరాయిగూండాగా వ్యవహరిస్తూ యిన్ని హత్యలకు, అఘాయిత్యాలకు పూనుకున్నావ్. ఒక్కమాటలో నిజం చెప్పు- అవునా?"

అప్పటికీ ఆ యువకుడు సమాధానం చెప్పలేదు. నోరు తెరవలేదు.

రాక్షసునిలా అయిపోయాడు సుభాష్. కానిస్టేబుల్ చేతిలోని లాఠీ అందుకున్నాడు. "నిజం చెబుతావా, లేదా?" అంటూ అతన్ని దెబ్బ మీద దెబ్బ కొట్టనారంభించాడు.

ఆ దెబ్బల్ని భరించలేక వంకర్లు తిరిగిపోయాడు. నిలువునా కుప్పలా కూలిపోయాడు. కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ విలపించనారంభించాడు ఆ యువకుడు.

అయినా అతన్ని విడిచిపెట్టలేదు సుభాష్. "నువ్వు జోషీ మనిషివి. అతని ప్రోద్బలం వల్లనే యిన్ని దుండగాలు చేశావ్. యు ఆర్ ఎ ప్రొఫెషనల్ కిల్లర్. నిన్ను భగవంతుడు కూడా క్షమించడు" అంటూ బూటు కాలితో అతని ముఖం మీద తన్నాడు.

కెవ్వున అరిచాడు ఆ యువకుడు. ముక్కులోంచి రక్తం విరజిమ్మింది. బాధతో గిల గిల కొట్టుకుంటూ సుడులు తిరిగిపోయాడు. "దాహం....దాహం......" అన్నాడు.

లాఠీ పక్కకు విసిరాడు సుభాష్. కానిస్టేబుల్‌కి సైగ చేశాడు. అతను గ్లాసుతో నీళ్ళు తెచ్చాడు. ఆ యువకుడికి యిచ్చాడు.

గ్లాసు పట్టుకున్నాడు. శక్తిని కూడ గట్టుకున్నాడు. లేచి కూర్చున్నాడు. చటుక్కున జేబులోంచి చిన్న పొట్లం తీశాడు. నోట్లో వేసుకుని, కాగితంతో సహా నమిలేశాడు. గ్లాసులోని నీళ్ళు తాగుతూ-కరెంట్‌షాక్ తగిలినట్లు పడిపోయాడు. మరుక్షణంలోనే తల పక్కకు వాల్చేశాడు. అలీషా వేషం వేసుకున్న రెండో నకిలీ యువకుడు!

ఇదంతా కొన్ని సెకండ్లలో జరిగిపోయింది. పోలీసులంతా ఉలిక్కిపడ్డారు.

"డేమ్ డర్టీ గూస్! అతని ముఖం మీద నీళ్ళు జల్లించి చావగొట్టి, నిజం చెప్పించండి" అంటూ ఆ యువకుని దేహాన్ని కాలితో తన్నాడు సుభాష్.

"దట్సాల్ రైట్, మిస్టర్ షా! విషం తిని అతను చచ్చిపోయాడు" అన్న మాటలు గది గుమ్మం దగ్గర నుండి వినిపించాయి.

తలెత్తి అటువైపుకు చూశాడు సుభాష్.

సి.బి.ఐ. డైరెక్టర్ ఆదిత్య, ఐ.జి.మహేంద్ర, ఇన్‌స్పెక్టర్ అబ్దుల్లా గుమ్మం దగ్గర నిలబడి ఉన్నారు.

అంతవరకు తన చర్యలు వారు గమనిస్తున్నారని దృఢపరచుకున్నాడు. "సారీ సార్!" అన్నాడు సుభాష్.

"డోంట్ ఫీల్ సారీ! ఈ సంఘటన వలన నాలో ఉన్న కొన్ని అనుమానాలు తొలిగిపోయాయి. ఇంత వరకు జరిగిన హత్యలకు యితనే కారకుడని రుజువైపోయింది. కమాన్ మై గుడ్ చాప్! నీతో యింకా చాలా విషయాలు మాట్లాడాలి" అన్నాడు ఆదిత్య.

గదిలో కెళ్ళాడు సుభాష్. ఆదిత్య, మహేంద్రలు అడిగిన అనేక ప్రశ్నలకు సమయోచితంగా సమాధానాలు చెప్పాడు. వారిని తృప్తిపరచాడు. దీర్ఘంగా శ్వాస తీసుకున్నాడు-సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ అలీషాగా చలామణీ అవుతున్న సుభాష్.

## 75

కుడి చేతిమీద పచ్చబొట్టు వంక చూసుకున్నాడు.

'పంచశూలమ్' అన్న అక్షరాలను పదే-పదే చదువు కున్నాడు.

కోపంతో పళ్ళు పట-పట కొరికాడు.

పైప్‌లో పొగాకు వేసి వెలిగించాడు. గుప్-గుప్ మంటూ పొగ విడిచి పెట్టాడు.

చటుక్కున సోఫాలోంచి లేచాడు. రిసీవరు అందుకుని ఓ నెంబరు డయిల్ చేశాడు. "హలో?" అన్నాడు.

"హలో! సుభాష్ హియర్!" అవతలి నుండి వినిపించింది.

"వెల్‌డన్ మై బోయ్! చాలా బాగా డీల్ చేశావు. ఆదిత్య, ఐ.జి., అబ్దుల్లా-అంతా నోరు మూసుకున్నారు. వెల్‌డన్."

"ఆ విషయాలన్నీ మీకెలా తెలుసు?"

విలాసంగా మరో మారు పైప్ పీల్చాడు పంచశూలమ్. "ఈ ప్రపంచంలో వస్తువుల్లాగే కొందరు మనుషుల్ని కూడా కొనవచ్చు. నాకు

## 112వ ఏట మారకం

శతాధిక వృద్ధురాలైన బర్థా మె వాగెస్ కన్ను మూశారు. 112 సంవత్సరాలపాటు జీవించి ప్రపంచంలోకెల్లా వృద్ధ వ్యక్తిగా ఆమె గిన్నిస్ బుక్‌లో స్థానం సంపాదించుకున్నది.

వాగెస్ ఐవాయోలోని అకస్‌లో 1876 ఆగస్టు 3న బర్థా జన్మించారు. అలాగే మొన్న గూరిగి జీవితాన్ని ఆనందంగా గడిపిన బర్థా తన 113వ జన్మదినోత్సవాన్ని కళ్ళారా చూసుకోకుండానే అంతిమ శ్వాస విడిచారు.

జీవితంలో ఎన్నో అనుభవాలు చవిచూసిన ఈమె చివరి క్షణంలో కనుచూపు కోల్పోవటమే కాకుండా బధిరురాలైంది. ఏమైనా గిన్నిస్ బుక్‌లో ఈమె స్థానాన్ని మరొకరు పూరించే వరకు అదేటు చిరస్థాయిగా నిలిచిపోతుంది.!

అవసరమైన చోట్ల కొందరు నౌకర్లను, పోలీసులను కొని ఉంచాను. వాళ్ళ ద్వారా యిలాంటి రహస్యాలు తెలుసుకోవడం బ్రహ్మవిద్య కాదు నాకు" అన్నాడు.

"ఓ విషయం అడుగుతాను. చెబుతారా?"

"ఏమిటది?"

"పంచశూలమే జోషీ అంటోంది సోఫియా. ఇదే నిజమయితే విశాలాక్షి నాకేమవుతుంది?"

"నీ ప్రశ్నకు సమాధానం విశాలాక్షే కరెక్ట్‌గా చెప్పగలదు." అని, రిసీవరు పెట్టేశాడు. పచ్చబొట్టు వంక చూస్తూ, రెడ్ వైన్ పీల్చనారంభించాడు- పంచశూలమ్.

## 76

బూటు కాలితో గోడను తన్నాడు సుభాష్. పిడికిలి బిగించాడు. తన నెత్తిమీద తానే గుద్దుకున్నాడు. గుండుసూది తీశాడు. చూపుడు వేలిలో గుచ్చుకున్నాడు.

అతని పక్కనే నిలబడింది సోఫియా. కాని, ఏమీ మాట్లాడలేదు. సముదాయించడానికి ప్రయత్నిస్తే, అతను మరీ రెచ్చిపోతాడని ఆమెకు తెలుసు.

రిసీవరు అందుకున్నాడు సుభాష్. గురూజీ యింటి నెంబర్‌కు డయల్ చేశాడు.

"హలో! విశాలాక్షి మాట్లాడుతున్నాను" అవతలి నుండి వినిపించింది.

"గెస్ట్‌హౌస్ నుండి వాచ్‌మన్‌ని మాట్లాడుతున్నాను. మిమ్మల్ని అర్జంటుగా రమ్మన్నారు- అయ్యగారు. కారు పంపనా?" గొంతు మార్చి అన్నాడు సుభాష్.

"సరే పంపు." అంది విశాలాక్షి.

*** *** ***

డ్రైవర్‌లా వేషం వేసుకున్నాడు సుభాష్. గురూజీ బంగ్లా పోర్టికోలో కారు ఆపాడు. క్రిందకు దిగి, బంగ్లా దగ్గర కెళ్ళాడు. కాలింగ్ బెల్ నొక్కాడు.

తలుపు తెరిచింది విశాలాక్షి.

తల వంచుకుని నిలుచున్నాడు సుభాష్.

ఇంటికి తాళం వేసి, కారు దగ్గరకు నడిచింది ఆమె.

వెనకడోరు తెరిచాడు అతను. ఆమె కూర్చోగానే తలుపు మూశాడు. డ్రైవింగ్ సీట్లోకెళ్ళి కారు స్టార్ట్ చేశాడు.

గేటు మూశాడు గూర్ఖా.

*** *** ***

అటూ- యిటూ చూసింది విశాలాక్షి. కారు దారి తప్పినట్లు అనుమానం కలిగింది. వెంటనే-

"ఎక్కడికి తీసుకెళుతున్నావ్?" అ
అడిగింది.

"నరకానికి"

"ఎవరు నువ్వు?"

"నీ పాలిటి మృత్యువును."

"ఆ! కారు ఆపు."

"షటప్." అంటూ, ఏక్సిలేటర్ని అ
గంటా తొక్కాడు సుభాష్.

రెట్టించిన వేగంతో దూసుకు పోనార
భించింది కారు.

## 77

అయోమయంగా గదిలో ప్రవేశించిం
విశాలాక్షి.

"మరో రెండడుగులు ముందుకు వెయ్యి
ఆ కుర్చీలో కూర్చో. వెనక్కి తిరి
చూడొద్దు." ఆమె మెడమీద సన్నటి క
పెట్టి గర్జించాడు సుభాష్.

అతను చెప్పినట్లే చేసింది ఆమె. ఎదురుగా ఉన్న రివాల్వింగ్ కుర్చీలో కూర్చుంది
"బాబూ! నువ్వెవరివో తెలీదు. లోగడ నిన్ను
చూసినట్లు గుర్తుకూడా లేదు. ఇక్కడికి
నన్నెందుకు తీసుకువచ్చావ్?" అని అడి
గింది.

"నరకం చూపించడానికి." కోపోద్రేకా

లతో కుర్చీని తన్నాడు సుభాష్.

రెండుసార్లు గిర్రున తిరిగింది రివాల్వింగ్ కుర్చీ. అందులోంచి తూలి క్రింద పడింది విశాలాక్షి.

ఆమెకు ఎదురుగా నిలుచున్నాడు. కత్తి ఆమెకు గురిపెట్టాడు. "నాలుగు రోజులపాటు బతకదలచుకుంటే, నేనడిగే ప్రశ్నకు సమాధానం చెప్పు." అన్నాడు సుభాష్.

"ఏమిటది?"

"నా తల్లి ఎవరు?"

ఏడవబోయి, ఆపుకుంది. "నువ్వెవరివో నాకు తెలీదు. ఇహ, నీ తల్లి ఎవరో నేనెలా చెప్పగలను?" అంది విశాలాక్షి.

"జోషీగారు తెలుసా?"

మాట్లాడలేదు విశాలాక్షి.

"నాకు సమాధానం కావాలి."

"తెలుసు."

"ఆయన కొడుకును నేను. ఇప్పుడు చెప్పు- నా తల్లి ఎవరో?"

పిడుగు పడ్డట్లు అదిరిపోయింది. ఒనుకుతూ లేచి నిలుచుంది. కాని, సమాధానమివ్వలేదు విశాలాక్షి. తల వంచుకుని నిలుచుంది.

"నా తండ్రి జోషీగారి కౌగిట్లో నలిగిన ఓ దౌర్భాగ్యురాలు కన్నది నన్ను. పెళ్ళికాకుండానే పిల్లాడు పుట్టాడనే అపవాదు భరించలేక పాండిచేరిలో పారేసింది. ఎవరా పాపిష్టి మనిషి?- చెప్పు."

ఉలిక్కి పడింది విశాలాక్షి. తలెత్తి అతని ముఖంలోకి చూసింది. "బాబూ!" అంది.

"నోర్మూయ్! అనవసరమైన మాటలు వినే అలవాటు లేదునాకు. కోపంవస్తే అసలు మనిషినే కాను నేను. ఐదు సెకండ్లు టైమిస్తున్నాను- సమాధానం చెప్పు. జోషీగారి వల్ల నన్ను కన్న రాక్షసివి నువ్వేనా?"

మంచు బిందువు లాంటిది విశాలాక్షి. అతని మాటలు భరించలేక పోయింది. బాధతో కళ్ళు మూసుకుంది.

"ఒన్...టూ...త్రీ...ఫోర్..."

"బాబూ!" ఆవేదనతో, ఆరాటంతో కళ్ళు తెరుస్తూ, మళ్ళీ అరిచింది ఆమె.

"ఫైవ్..." అంటూ, కత్తితో ఆమె కుడికంటిలో పొడిచేశాడు సుభాష్!

కెవ్వున అరిచింది విశాలాక్షి. జివ్వున విరజిమ్మింది రక్తం.

కసిగా కత్తి బైటకు తీశాడు సుభాష్. "ఇప్పటికైనా చెప్పు- ఆ నికృష్టజీవివి నువ్వేనా?" అన్నాడు.

అతని ప్రశ్న వినిపించలేదు ఆమెకు. కుడి కంటిమీద చెయ్యి పెట్టుకుని గిల-గిల్లాడుతూ, సుడులు తిరిగి పోయింది.

"మరో ఐదు సెకండ్లు టైమిస్తున్నాను- చెప్పు. నీతి, నియమం, పవిత్రత లేకుండా నన్ను కన్న మృగానివి నువ్వేనా?"

అతనికి సమాధానం చెప్పే స్థితిలో లేదు ఆమె. బాధతో, ఆవేదనతో గిజ గిజలాడి పోతోంది.

మళ్ళీ ఐదు అంకెలు లెక్కపెట్టాడు సుభాష్.

"బాబూ!" అంటూ, ఏదో చెప్ప బోయి, ఎడమకన్ను తెరిచింది విశాలాక్షి.

కాని, ఆమె మాటలు వినే ఓపికలేదు అతనికి. చేతిలోని కత్తిని ఎడమ కంటిలో గుచ్చేశాడు!!

గది ప్రతిధ్వనించేలా మరో మారు బిగ్గరగా అరిచింది విశాలాక్షి.

గది నిండా రక్తం విరజిమ్మింది.

అయినా సుభాష్ ఆవేశం చల్లారలేదు. కత్తిబైటకు తీశాడు. ముక్కుమీద కొట్టాడు!

ముక్కు మొన తెగి కింద పడింది.

అరిటాకులు కోసినట్లు రెండు చెవులూ కోశాడు!!!

అప్పటికే ఆమె స్పృహ తప్పి పోయింది. జోగుతూ వెనక్కి పడిపోబోయింది.

అదే సమయంలో- ఆ గదిలోకి వచ్చాడు పంచశూలవ్. ఆమెను పొదివి పట్టుకున్నాడు. ఆమె ముఖంలోకి పరీక్షగా చూశాడు.

అంతలోనే, ప్రాణాలు విడిచి పెట్టింది విశాలాక్షి.

దీర్ఘంగా నిట్టూర్చాడు పంచశూలవ్. కొన్ని క్షణాలు కళ్లు మూసు కున్నాడు. ఆమెను చేతుల్లోకి ఎత్తుకున్నాడు. చాలా సేపటివరకు, ఆమెతోపాటు శవంలా నిలబడి పోయాడు.

విశాలాక్షి ముక్కు, కళ్ళు, చెవుల్లోంచి కారుతున్న రక్తంతో అతను తొడుక్కున్న తెల్ల టిసూట్ ఎర్రగా అయిపోయింది.

"మై బోయ్! ఆవేశపడ్డావ్. జేజేతులా- కన్నతల్లిని చంపుకున్నావ్. వెరీ వెరీ సారీ!" అన్నాడు బరువైన కంఠంతో పంచశూలవ్.

"ఐ వోంట్ ఫీల్ సారీ. అలాంటి తల్లి బతికుండటం కంటే చావడమే మేలు..." అంటూ, చేతిలోని కత్తితో బొటన వేలిమీద గుచ్చుకున్నాడు సుభాష్.

అతనిలో యింకా ఆవేశం తగ్గలేదని అర్థం చేసుకున్నాడు. "మై సన్! ఈమెను తీసుకెళుతున్నాను నేను." అని, విశాలాక్షి శవాన్ని భుజం మీద వేసుకున్నాడు. భారంగా ఆ గదిలోంచి బైటకు నడిచాడు పంచశూలవ్.

ఉలిక్కి పడ్డాడు సుభాష్.

అంతలోనే అక్కడికి వచ్చింది సోఫియా.

చేతిలోని కత్తి మూలకు విసిరేశాడు సుభాష్. "కమాన్!" అంటూ చేతులు చాపాడు.

భయపడుతూ అతని దగ్గరకు వచ్చింది సోఫియా.

ఆమె తల పట్టుకున్నాడు. తన తలకు ఢీ కొట్టుకున్నాడు.

అది మదమో, ఉన్మాదమో, కోపమో, ప్రేమాలాపనమో అర్థం కాలేదు సోఫియాకు. అయినా, అలవాటు ప్రకారం అతని మెడకు చేతులు చుట్టింది. బలంగా తన వైపు లాక్కుంది.

ఇద్దరూ కలిసి కిందపడ్డారు. రక్తపు

మడుగులో పొరల నారంభించారు!!!

*** *** *** ***

## 78

అమావాస్య.. ఆదివారం.

అగ్గిమీద కూర్చున్నట్లు ఉడికిపోతు న్నారు-జయరాజ్, గురూజీలు.

జీవితంలో ఆడిన ప్రతి ఆట వాళ్ళే గెలిచారు. ఈనాడు అపజయం, అపఖ్యాతి పొందడం వాళ్లకు యిష్టంలేదు, విజయమో, మరణమో తేల్చుకోవాలనుకున్నారు.

"రాజా! ఏమైనా సరే, పంచశూలమ్ అనే ఆ జోషీ అంతు చూడాలి. అతన్ని అంతం చెయ్యాలి." అన్నాడు గురూజీ.

"ఆ బాధ్యత టైగర్ తీసుకున్నాడుగా! చూద్దాం, యివ్వాళ ఏం చేస్తాడో?"

జయరాజ్ ఈ మాటలు అంటూ ఉండగా టెలిఫోన్ మ్రోగింది. రిసీవరు అందుకున్నాడు. " హలో! " అన్నాడు.

"టైగర్ ఈజ్ దిస్ సైడ్!" అవతలి నుండి వినిపించింది.

"మీ ఫోన్ కోసమే వెయిట్ చేస్తున్నాం. ఇవ్వాళ అమావాస్య."

"యస్... రాత్రి పది గంట లకు గోల్కొండ కోటకు పది కిలోమీటర్ల దూరంలో..."

"నమ్మమంటారా? "

"సందేహం లేదు. ఖచ్చితంగా అతని తల తెస్తాను. మీరు ఐదు కోట్లు తీసుకురా లేదో, మీ తలలు తీస్తాను."

అవతలి వైపు టెలిఫోన్ కట్ అయింది.

టైగర్ చెప్పిన మాటలు గురూజీకి వివ రించాడు జయరాజ్.

" అతను మోసం చేస్తే?" తన అను మానాన్ని తెలిపాడు గురూజీ.

"అదీ పాయింటే... ఐదు కోట్ల రూపా యలంటే మాటలు కాదు. మనకు ప్రొటెక్షన్ కావాలి."

"మదన్‌కి ఫోన్ చెయ్,అతన్ని మధ్యవ ర్తిగా ఉండమను."

గురూజీ సలహా నచ్చింది. వెంటనే మదన్ నెంబర్‌కి డయిల్ చేశాడు జయ రాజ్. అవతలి నుండి అతని కంఠం విని పించగానే " హలో! మదన్! జయరాజ్‌ని మాట్లాడుతున్నాను" అన్నాడు.

"నమస్తే. చెప్పండి. "

"టైగర్‌తో బేరం ఖాయం చేసు కున్నాం."

"వెరీ గుడ్!"

" ఈ రాత్రి పది గంటలకు-పంచశూ లమ్ తలను గోల్కొండ కోట దగ్గరకు తెచ్చి యిస్తానన్నాడు."

"వెరీ వెరీ గుడ్!"

" మీ రొకసాయం చెయ్యాలి."

"మీ వంటివారికి సేవ చెయ్యడానికే పుట్టాను నేను. ఏం చెయ్యమంటారో చెప్పండి."

"మధ్యవర్తిగా వ్యవహరించాలి మీరు?"

"దేనికి?"

"అతను మమ్మల్ని మోసం చెయ్య కుండా చూడటానికి."

"టైగర్ క్రిమినలే. కాని, మోసగాడు కాదు."

"అయినా, మిమ్మల్ని మధ్యవర్తిగా ఎన్ను కుంటున్నాము మేము. "

"ఆల్ రైట్ మీకు న్యాయం జరిగే టట్లు మాస్తాను. "

"ఎప్పుడు రాగలరు మీరు? "

"అరౌండ్ ది క్లాక్ సర్వీస్ నాది. మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాను. "

"తొమ్మిది గంటలకు రండి. "

"వస్తాను, నా సర్వీసుకు ఫీజు? "

"ఇస్తాం. ఎంత కావాలో చెప్పండి. "

"టైగర్‌కి ఎంత యిస్తున్నారు? "

"ఐదు కోట్లు.... "

"నా సర్వీస్ చార్జెస్-ఒన్ పర్సెంట్. "

"అంటే? "

"ఐదు లక్షలు. "

"ఇస్తాం. పంచశూలమ్ తల మాకు యివ్వాలి. అది కరక్టేనని మేము నిశ్చయించు కున్న తర్వాత ఐదుకోట్ల రూపాయలు టైగర్ కివ్వాలి."

"ఓ.కె. అలాగే చేస్తాను."

"ఇందులో ఏమీ మోసం జరగకూ డదు." పలికాడు జయరాజ్.

" రాజ్ సాబ్! నేను మాటంటే మాటే-కోటి రూపాయలిచ్చినా మాట తప్పను రాత్రి సరిగ్గా 9 గంటలకు ఐదు కోట్ల రూపా యలు తీసుకుని, గోల్కొండ కోట దగ్గరకు రండి. పంచశూలమ్ తల మీకు, మీ డబ్బు టైగర్‌కి మార్పిడి చేస్తాను. ఇందులో ఎవరు మోసం చేసినా, వారి తలలు తీసేస్తాను." అని, అవతలి వైపు రిసీవరు పెట్టేశాడు మదన్.

"గురూ! జయం మనదే" అన్నాడు హుషారుగా రిసీవరు ఫోన్ మీద పెడుతూ-జ యరాజ్.

## 79

అమావాస్య చీకట్లు అలుముకున్నాయి. రాత్రి ఏడు గంటలయింది.

"రెడీసాబ్! అన్నీ రెడీ!! అంతా రెడీ!!! అందరూ రెడీ, శూలమ్ సాబ్!!!" ఎగరడానికి సిద్ధంగా ఉన్న రాకెట్‌లా హుషా రుగా అన్నాడు మదన్.

బరువుగా కళ్లు తెరిచాడు పంచశూ లమ్. పైప్‌లో కొత్త పొగాకు వేశాడు. అగ్గిపుల్ల ముట్టించాడు. గట్టిగా రెండు దమ్ములు లాగాడు. సోఫాలోంచి లేచాడు. "సుభాష్ రెడీ అయ్యాడా?" అడిగాడు.

"రెడీగా ఉన్నాడు. మీదే ఆలస్యం."

"నేనూ కూడా సిద్ధంగా ఉన్నాను. ఎవ రెవరు వస్తున్నారు ?"

"మనం అనుకున్న వాళ్లంతా వస్తు న్నారు. అంతే కాదు. మనం ఎదురు చూడని వాళ్లు కూడా వస్తున్నారు."

"అబ్దుల్లా, అతని సిబ్బంది-వాళ్లేగా?"

ఆశ్చర్యపోయాడు మదన్. "మీ కెలా తెలుసు?" అడిగాడు.

### పోకిరీగాళ్లు



కె. కె. తల్వార్ తీస్తున్న 'సాహిబ్ జాదే' చిత్రంలో నటించకుండా అమీర్‌ఖాన్, చంకీ పాండేలు తప్పుకున్నారు. తల్వార్ చెప్పిన క్లైమాక్సులు ఈ పోకిరీగాళ్లకు నచ్చలేదేమో? మేం నటించమని చెప్పారట.

వీరి స్థానంలో ఆదిత్యపాంచోలి, సంజయ్‌దత్‌లను తీసుకుంటున్నాడట నిర్మాత. వీళ్లిద్దరూ గొడవలు సృష్టిస్తుంటారని విని కిడి. మరి తల్వార్ వీరితో ఎలా నెట్టుకొస్తాడోనంటున్నారు పరిశ్రమలోని వాళ్లు.

"అంతే కాదు-బి కేర్‌ఫుల్...హైద్రాబాద్‌లోని పోలీసు డిపార్టుమెంట్ మొత్తం అలర్ట్‌గా ఉంది. ఢిల్లీ నుండి సి.బి.ఐ. చీఫ్, అతని ముఖ్య అనుచరులు అపరాధుల కోసం మాటేసి కూర్చున్నారు యిక్కడ."

"దేనికి?"

"మై సన్! మీనాక్షి కళ్లు తీసేశారు. మోహన్ తల నరికేశారు. ఎమ్మెల్యే దీపాదేవిని హత్య చేశారు. పరిమళను రివాల్వర్‌తో కాల్చి,ఆమె యింటి గేటుకు వేలాడ కట్టారు. ఇన్ని చేసి కూడా అపరాధులు తెలివిగా తప్పించుకుంటున్నారు. కాని, పోలీసులు నిద్రపోలేదు, అపరాధుల్ని పట్టుకున్నంత వరకు యింటికెళ్లలేరు. భార్య పిల్లల్ని చూసుకోలేరు."

"అయితే, వాళ్లు యింటికెళ్లేదీ లేదు, భార్య పిల్లల్ని చూసుకునేదీ లేదు. ఎదురు వచ్చిన వాళ్లందర్నీ కాల్చి పారేస్తాను."

"పోలీసులతో విరోధం పెట్టుకో కూడదు. వాళ్లతో ఛాలెంజ్ చెయ్యడం మంచిది కాదు."

"వాళ్ల తాతలతో కూడా ఛాలెంజ్ చేస్తాను. తీస్తే నా ప్రాణాలు తీస్తారు. అంతకంటే వాళ్లేమీ చెయ్యలేరు."

సగర్వంగా మీసాలు దువ్వుకున్నాడు పంచశూలమ్. "ఇదే నీ నిశ్చయమా?" అడిగాడు.

"ఔను నేను మాటంటే మాటే, శూలమ్ సాబ్!"

"సరే, నీ ప్రయత్నాల్లో నువ్వు ఉండు. పది నిముషాల్లో వస్తాను."

అలావాటు ప్రకారం సలామ్‌చేసి, బైట కెళ్లిపోయాడు మదన్.

తృప్తిగా గడ్డం దువ్వుకున్నాడు పంచశూలమ్.

పక్క గది తలుపు తెరిచాడు. లోపల కెళ్లి తలుపు లాక్ చేశాడు. అది బెడ్‌రూమ్. ఓ మంచం, టీపాయ్, రెండు కూర్చీలు మాత్రం ఉన్నాయి. బాత్‌రూమ్‌లో కెళ్లాడు. లోపల వైపు గడియ వేశాడు. లైట్ ఆన్ చేశాడు.

అరచెయ్యంత చిన్న చిన్న పాల రాళ్లతో బాత్‌రూమ్ గోడలు మెరిసిపోతున్నాయి.

కుడి వైపు గోడ దగ్గర కెళ్లాడు. రెండు చేతులూ బార్లా చాపి, గోడకు ఆనించాడు. రెండు అరచేతులకు రెండు పాలరాళ్లు తగిలాయి. మోకాలు ఎత్తులో ఉన్న మరో రెండు పాలరాళ్ల మీద మోకాళ్లు ఆనించాడు. ఒకేసారి అరచేతులను, మోకాళ్లను పాలరాళ్ల మీద బలంగా నొక్కాడు.

మరుక్షణంలోనే-

ఎడమవైపు గోడలోంచి ఓ ద్వారం తెరుచుకుంది.

అవతలి వైపు వెళ్లాడు పంచశూలమ్.

అది కూడా బాత్‌రూమే. అచ్చం ముందు గదిలాగే ఉంది. ఎదుటి గోడ దగ్గర కెళ్లి చేతుల చాపాడు. రెండు పాల రాళ్ల మీద ఆనించాడు. మోకాళ్లతో క్రింది రాళ్లను నొక్కాడు.

అవతలి బాత్ రూమ్‌కి, యివతలి బాత్ రూమ్‌కు మధ్యలో-ద్వారంలా తెరుచుకున్న గోడ మూసుకు పోయింది.

బాత్ రూమ్ లోంచి అవతలి గదిలోకి నడిచాడు.

అదోక బెడ్‌రూమ్.

అక్కడి నుండి పెద్ద హాల్లోకి వచ్చాడు పంచశూలమ్.

ఆ హాలుకు ఓ చరిత్ర ఉంది.

ఆ హాల్లోనే మోహన్ తల నరికేశాడు మదన్!

ఆ హాల్లోనే వీడియోలో క్యాసెట్ పెట్టి, మోహన్ ఎలా హత్య గావింపబడినది టి.వి.లో పరిమళకు చూపించాడు పంచశూలమ్!!

ఆ హాల్లోనే పరిమళను రివాల్వర్‌తో కాల్చి చంపాడు మదన్!!!

ఆవేదనతో పంచశూలమ్ బాధ పడుతుంటే-స్పందించే హృదయం తనలోనూ ఉందని మదన్ తెలుసుకున్నది కూడా ఆ హాల్లోనే!!!

అక్కడ టివి. వీడియో, ఫ్రిజ్, టెలిఫోన్ అన్ని సౌకర్యాలూ ఉన్నాయి.

మధ్యలో రివాల్వి ంగ్ చైర్ ఉంది.

సరాసరి వెళ్లి కుర్చీలో కుర్చున్నాడు పంచశూలమ్, పైప్‌లో కొత్త పొగాకు వేశాడు. అగ్గి పుల్ల గీశాడు. గట్టిగా రెండు దమ్ములు లాగాడు.

అంతలో పక్క తలుపు తెరుచుకుంది. 20 మంది పహిల్వాన్‌లు హాల్లోకి వచ్చారు. గోడలకు ఆనుకుని నిలుచున్నారు.

"మీరు చాలా రిస్క్ తీసుకుంటున్నారు." అన్నాడు పంచశూలమ్.

"ఉస్తాద్! మేమే కాదు- వంద మంది, సంవత్సరం నుండి, మీ ఉప్పు పులుసు తింటున్నాము. రిస్కే కాదు మీ కోసం ప్రాణాలిస్తాం. మానిశ్చయంలో మార్పు లేదు."

"అడ్డొచ్చిన బాద్మాషుల్ని ఖైమాచేసి పారేస్తాం దాదా !"

"ఒక్కొక్కడి తల పుచ్చకాయల్లా తెగేసేస్తాం...."

తలోమాట అంటూ తమ నిర్ణయాలను తెలియజేశారు పహిల్వాన్‌ల వంటి ఆ గూండాలు.

మరో మారు పైప్ పీల్చాడు పంచశూలమ్, అందరివంక పరీక్షగా చూశాడు. ఓ నిశ్చయానికి వచ్చాడు. "ఆల్‌రైట్. ఆ పెట్టె తీసుకెళ్లండి." అన్నాడు- టి.వి. పక్కకు చూపిస్తూ.

అక్కడ- ఆరడుగుల పొడవు, రెండడుగుల వెడల్పు, అడుగున్నర ఎత్తు గల శవ పేటిక లాంటి పెట్టె ఉంది!!!

నలుగురు గూండాలు ఆ పెట్టెను ఎత్తుకున్నారు. వెళ్లడానికి సిద్ధమయ్యారు.

"ఒక్క విషయం గుర్తుంచుకోండి."

అందరూ ఆగారు.

"నేను చెప్పినట్లు జరగలేదో, మళ్లీ మీ ముఖాలు నాకు చూపించవద్దు." అని, కుర్చీలోంచి లేచాడు పంచశూలమ్.

(ఇంకా ఉంది)



# నెస్టమ్® బేబీ సిరియల్ – రైస్

## మీ పాపాయి యొక్క ఆదర్శప్రాయమైన తొలి ఘన ఆహారం

### వాడి చూడండి!

నెస్టమ్ బేబీ సిరియల్‌ని పాలలో కలిపినప్పుడు అది అన్నానికి గల తేలిగ్గా జీర్ణమయ్యే గుణం, పరిపూర్ణ పోషకాహారపు మంచితనం అందజేస్తుంది. 4 నెలలు వయసు వచ్చాకా పాపాయి ఆహారంలో మీరు ఘన పదార్ధాలు ప్రవేశ పెట్టేటప్పుడు, నెస్టమ్‌తో ప్రారంభించండి. బియ్యంతో తయారు చేయబడిన నెస్టమ్, తేలిగ్గా జీర్ణయం అయ్యేందుకు ప్రత్యేకంగా రూపొందించబడింది అంతేకాదు, నెస్టమ్, ఇనుము, విటమిన్‌లతో మరింత బల వర్ధకం చేయబడింది.



నెస్టమ్‌ని తయారు చేయడం ఎంతో సులువు దీనిని ముందుగా కాచిన వెచ్చటి పాలల్లో కలపండి అంతే, పాపాయికి తినిపించేందుకు ఆహారం తయారు!

నెస్టమ్ పాలు లేకుండా అందుబాటులో ఉన్న ఒకే ఒక సిరియల్. మీరు మీ పాపాయి ఆహారంలో వివిధ రుచులు తెచ్చేందుకు ముందుగా ఉడికించి యింట్లోనే తయారు చేసి మెత్తటి గుజ్జుగా చేసిన కూర ముక్కలు, పప్పు, పండ్లు నెస్టమ్‌లో కలపండి.

కేవలం రూ 9/-* కే డబ్బాలో 200 గ్రా. సంచీ




* స్థానిక పన్నులతో సహా

**ఉచితం !**
నెస్టమ్ రెసిపి బుక్ లెట్
ఈ చిరునామాకు వ్రాయండి
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం 6016
న్యూ ఢిల్లీ 110 008


Nestlé

ప్రస్తుతం ఒక్క ఆంధ్ర ప్రదేశ్‌లోనే దొరుకుతోంది

# అజ్ఞాత రచయిత

పాలడుగు వెంకటేశ్వరరావు



రెండవ కేటగిరీకే చెందినవాణ్నని నాకు నిజంగా అన్పిస్తూ్ంది' అని నవ్వాడు. నేనూ నవ్వాను. అతనికి వుషారు పొంగివచ్చింది.

'నేను మీకు తెలుసా?' అని ప్రశ్నించాడు. హఠాత్తుగా అతను నన్ను.

ట్రయిను లంకణాల బోటులాగా మెల్లగా కదిలింది. కిటికీలోంచి బయటికి చూస్తూ వున్న నన్ను మరల అదే ప్రశ్నతో వేధించాడు– అతను. తెలీదన్నాను. యధార్థంగా.

'నా పేరు సత్యప్రకాష్. ఇప్పుడయినా నేను మీకు తెలిసి వుండాలి' అన్నాడు విశ్వాసయుతంగా అతను. అతని చూపుల్లో ఇంచుక గర్వం తొంగి చూసింది.

నేను అడ్డంగా తలవూపాను. అతని చూపుల్లో నిరాశ తొంగి చూసింది వెంటనే.

'మీరు పుస్తకాలూ, మేగజీన్లూ చదువుతారా? అలా అన్పించింది నాకు మరి!' అన్నాడు.



మూర్ఛపోతారు!' అన్నాడు గర్వంగా.

'– పొన్లెండి' నవ్వాను.

'కేవలం వక్క సీరియల్ నవలని రాసి పాఠక ప్రపంచం మీదకి వదిలేత్తే ఈ సత్యప్రకాష్‌కి వచ్చే ఆదాయం సుమారు నలభయివేలు! ఎలాగని అడగరేం?'

'చెప్పండి'

'సీరియల్‌గా వచ్చినందుకు పత్రిక వాళ్ళు ఇచ్చేది పదివేలు. ఆ తర్వాత పుస్తకం ద్వారా పబ్లిషర్ల నుంచి ఇరవయి వేలు. ఇక అటు తర్వాత సినిమావాళ్ళు ఎగబడి ఇస్తామనేది పదివేలు. వెరశి నలభయి వేలు. డిమాండు అలా వుంది' అన్నాడు.

'బాగానే వుంది!' మెచ్చుకోలుగా చూస్తూ అన్నాను. అతను సంతోషించాడు.

'బాగా వుండమా, మరి! అయితే దీనికీ కొన్ని ఖర్చులుంటాయి. దాదాపు సగం వరకూ మనం ఖర్చు పెట్టాలి ఆ వివరాలు సీక్రెట్. మీరు అడగకూడదు. నేను చెప్పనూకూడదు. మరోలా భావించకండి. ఏం?' అన్నాడు సమాధానపూర్వకంగా, స్నేహంగా.

పొన్లెండి. 'ఏం అనుకోనులెండి' అన్నాను.

మధ్యలో బండి ఆగింది. సిగ్నల్ ఇవ్వనట్టుంది. ఈ పాసింజరు 'గతి' ఇంతేనేమో!

జేబులోంచి కర్చీఫు తీసి మొహం తుడుచుకున్నాడు సత్యప్రకాష్. అయినా చమట్లు ఆగటంలేదు. సంచి తెరచి అందులోంచి మాగజీన్లు, పుస్తకాలు బయటికి తీసాడు. ఒక మాగజీన్‌తో విసురుకోసాగాడు నిర్లక్ష్యంగా. ఆయాసం. అవస్థ!



చండ ప్రచండంగా చెల రేగుతూ కసిగా నిప్పులు గ్రక్కుతూ వుంది వేసవికాలం! ఆపైన పెళ్లిళ్ల సీజను. అందు వల్లనే కాబోలు- టుక్కు టుక్కు మంటూ సాగు తున్న ఆ పాసింజరు రయిలు కూడా కిటకిట లాడుతూ వుంది. అసలే నత్త నడక. ఆ పయిన సిగ్నల్సు ఇవ్వక మాటి మాటికీ ఆగిపోవ టాలు. నానా అవస్త గానూ వుంది ప్రయాణం.

వినుకొండలో అతను ఎక్కాడు. లాల్చీ, పైజామా. కళ్ళకి నల్ల అద్దాలు. చిరునవ్వులు చిందించే మొహం. అతని భుజాన, సంచి వేళ్ళాడుతూ వుంది. ఆ సంచి నిండా ఏవో పుస్తకాలు, మాగజీన్సు. అతను కూర్చోవటానికి ఎక్కడయినా చోటు దొరుకుతుందేమోనని నాల్గు వయిపులా కలియ జూస్తున్నాడు.

'ఇట్లా వచ్చి కూర్చోండి'- నా ప్రక్కన చోటు చేసి ఆహ్వానించాను అతన్ని.

చిరునవ్వులు వెదజల్లుతూ వచ్చి కూర్చుని 'థాంక్సు' అన్నాడు. గిరిజాల జుట్టు సవరించుకున్నాడు.

'అయ్యా! ఈ మానవ ప్రకృతి చిత్రాతి విచిత్రం. వక్కొక్కరిని చూస్తే వుత్త పుణ్యానికే మొత్త బుద్ధవుతుంది. మరి ఇంకొకరిని చూస్తే ప్రేమతో భుజాల మీదికి ఎక్కించుకో బుద్ధవుతుంది. ఇప్పుడు నా మీద ఇట్లాగ మీరు ప్రకటించిన సుహృద్భావాన్నిబట్టి నేను చెపుతాను.' అన్నాను. అతను విజయసూచకంగా హసించాడు.

'అయితే మీకు తప్పకుండా సత్యప్రకాష్ అన్న పేరు బాగా పరిచయ మయివుండాలే! నవ్లెన్సు, హారర్, మర్డర్సు, ఫైట్సు, రేప్సు- మొదలయిన మసాలాలు బాగా దట్టించి, ఈ నాటి తెలుగు పాఠక ప్రపంచాన్ని అనేక నవలా సీరియల్స్‌తో వుర్రూత లూగిస్తున్న ప్రఖ్యాత రచయిత సత్యప్రకాష్! అతని సీరియల్స్ ప్రముఖ పత్రిక లన్నిటిలో నూ పుంఖాను పుంఖంగా వస్తూ వున్నాయ్. ఆ సత్యప్రకాష్‌నే, నేను.' అన్నాడు గర్వంగా. నేను నవ్వాను. అతని వయిపు ఆదర పూర్వకంగా చూసాను. అది గమనించాడు. అతను జేబులోంచి సిగరెట్టు పెట్టె తీసి నాకు ఒక సిగరెట్ 'ఆఫర్' చేయబోయాడు. థాంక్యు. అలవాటులేదు అన్నాను. అతను సిగరెట్ వెలిగించి గుప్పు గుప్పున పొగవదిలాడు. తృప్తిగా చూసాడు.

'ఈనాడు తెలుగులో ప్రఖ్యాతి పొంది, బాగా డిమాండ్ వున్న అతి కొద్ది మంది రచయితల్లో సత్యప్రకాష్ వకడు! సత్యప్రకాష్ గురించి, పుస్తకాలు చదివే అలవాటున్న మీకు తెలియదంటే, అది మీరు చాలా విచారించాల్సిన విషయం' అన్నాడు ఖండితంగా.

నేను తెల్ల మొహం వేసాను. మొహం మీద గుద్దినట్టు మాట్లాడుతున్నాడు.

'అల్లా తెల్ల మొహం వేయకండి! వక్క నవల రాస్తే సత్యప్రకాష్‌కి వచ్చే ఆదాయం ఎంతో మీకు తెలుసా' అన్నాడు సూటిగా నా కళ్లల్లోకి చూస్తూ.

'తెలీదు' అన్నాను నా అజ్ఞానాన్ని వప్పుకుంటూ.

'అసలు ఆ సంగతి తెలిస్తే మీరు



తప్పేదిలేదు. బల్లమీద చెల్లా చెదురుగా పడివున్న ఆ పుస్తకాల మీద పడింది నాదృష్టి.

'ఏమిటి అల్లా చూస్తున్నారూ?' అన్నాడు నా చూపుని గమనించి సత్యప్రకాష్.

'ఏంలేదు' అన్నాను, నవ్వి.

'మీరు ఎందుకు నవ్వుతున్నారో నాకు తెల్సు' అన్నాడు.

'ఈ పుస్తకాలన్నీ ఒక తరం ముందు వచ్చి పేరు పొందినవి. అన్నాడు. మళ్ళీ తనే.

'అయితే- ఈనాడు వీటి మొహం చూసేది ఎవరు? వీటి నిండా ఏముంది? సైకాలజీ. సెంటిమెంట్సూ, త్యాగాలూ, కన్నీళ్ళూ- బోలెడంత బరువు! ఎవరిక్కావాలండీ అసలు ఈ బరువులు? ఈనాటి పాఠకులకి ఇవి రుచించటంలేదు. అందుకే ఆ రచయితలు తెర వెనక్కి వెళ్ళిపోతున్నారు. మిరతగవచ్చును సాహిత్యానికి ఒక పరమార్థం వుండాలి గదా- అని. పాఠకుణ్ని రంజింప జెయ్యటమే ఆ పరమార్థం! పేరుకి పేరూ, డబ్బుకి డబ్బూ రచయిత అనే వాడికి అంతకంటె ఇంకేం కావాలి?!' అన్నాడు నిర్ధారణగా.

నేను నవ్వాను. మళ్ళీ.

'నాకు అర్థమయ్యింది లెండి మీ నవ్వు! మరి ప్రఖ్యాతి పొందిన సత్యప్రకాష్ వంటి రచయితలు, ఈ నాటికి కూడా ఈ పుస్తకాల్ని బుజాన మోసుకుని తిరుగుతూ, చదువుతూ వున్నారు గదా!- అనిగదా మీ నవ్వుకి అర్థం! అందుకు సమాధానం వుంది నా దగ్గర. రచనకి టెక్నిక్ అని ఒకటి వుంటుంది లెండి. ఆ టెక్నిక్‌లు ఈ పుస్తకాల్లో ఎన్నో వున్నాయి. వాటి కోసమే నాలాంటి వాళ్ళు వీటిని మరీ మరీ చదవటం. అంతేగాని వీటిల్లో వున్న 'బరువు' ని బుజాలకి ఎత్తుకుందామని కాదు' విజయ చిహ్నంగా నవ్వాడు సత్యప్రకాష్. నిర్లక్ష్యంగా తల ఎగురవేసాడు.

నేను మౌనాన్ని ఆశ్రయించాను.

సిగ్నల్ ఇచ్చినట్లున్నారు. ట్రయిను మళ్ళీ కదిలింది, జెర్రిపోతులాగా, నిదానంగా.

'గతం వర్తమానానికి పునాది. వర్తమానం భవిష్యత్తుకి ఫవుండేషన్. అందువలన ఈనాటి ప్రఖ్యాత రచయితలు గతంలో వచ్చిన పుస్తకాలలోనించి, అవసరమయిన అంశాల్ని ఎన్నుకుని స్వీకరించటంలో అనవుచిత్యం లేదు. అలా అని ఆ పాత చింతకాయ పచ్చడె- మహాగొప్పదని అంగీకరించినట్లు కాదు' అన్నాడు.

-పైగా ఈ పాత రచయితలకి బోల్డు గర్వం! ఐ హేట్ దెమ్' అని ప్రకటించాడు.

'-ఫరెగ్జాంపుల్. ఈ పుస్తకం చూడండి. దీని రచయిత ఆ రోజుల్లో ఎంతో కొంత పేరు ప్రఖ్యాతులు గడించాడు-' అని ఒక పుస్తకం చేతుల్లోకి తీసుకుని నాకు చూపించాడు. దాదాపు శిథిలావస్థలో వుంది ఆ పుస్తకం.

ఆ పుస్తకం చూసి నా కళ్ళు మెరిసాయి! నాలో వుత్సుకత తొంగి చూసింది. 'ఇది వచ్చి నిజం! గ్లేమర్ అన్నది శాశ్వతం కాదు. ఏ రంగంలో నయినా గ్లేమర్ కేవలం తాత్కాలికమే.

ఆ గ్రహింపు లేనప్పుడే కళ్ళు నెత్తి మీదికి వచ్చేది! నేను కేవలం పాఠకుడిగా వున్న ఆ రోజుల్లో నేను ఈ పుస్తకాన్ని ఈ రచయితనీ ఎంతో అభిమానించి

# అజ్ఞాత రచయిత

ఆరాధించాను. ఈ రచయితకి ఎన్నో వుత్తరాలు రాసాను. కాని- దొంగ పాలమీద నీళ్ళు చల్లినట్లు, క్రూరంగా ప్రవర్తించి, ఈ రచయిత నాలో ఎంతో నిరుత్సాహాన్నీ మరెంతో వేదననీ మిగిల్చాడు. నేను ఎంతో ఆరాధించిన అభిమాన రచయితే, ఆ రోజుల్లో అట్లా ప్రవర్తించి నాకు ద్రోహం చేసాడు'- అన్నాడు సత్యప్రకాష్ విచారంగా. అతని కళ్ళు ఎర్రగా అయినయ్. అతని నిట్టూర్పులు వాడిగా వేడిగా వున్నాయ్. అతని మాటలు పరుషంగా వున్నాయ్.

'చూడండి! ఎంత గొప్ప వ్యక్తి అయినాసరే- పెద్దవాళ్ళమన్న గర్వం తగదు. చిన్నవాళ్ళు అని చిన్న చూపు చూడటం క్షంతవ్యంగాదు. ఉదాహరణకి నన్ను చూడండి. పెద్దవాడి నయ్యానని నాకు గర్వంలేదు. అభిమానుల్ని ఆప్యాయంగా పలకరిస్తాను. నా సహాయం కోరివచ్చిన వర్ధమాన రచయితల్ని ఎన్నో విధాలుగా ప్రోత్సహిస్తాను. రచన మీద ఒక స్కూలు పెట్టి ఎందరో కుర్రవాళ్ళని రచయితలుగా తీర్చిదిద్దుతున్నాను అన్నాడు.

'ఇంతకీ' ఆ రచయిత మీకు చేసిన అన్యాయం ఏమిటి?' అని అడిగాను. నాకు అతని మాటలకి సిగ్గుగానూ, అసహ్యంగానూ వుంది. అవమానంగానూ అన్పించింది!

అతను కోపంగా చూసాడు.

'-అయ్యా నేను మీ అభిమాన పాఠకుడినే గాక వర్ధమాన విరు రచయితని కూడాను. నా రచనలు కొన్ని పంపుతున్నాను. చదివి మీ అభిప్రాయం చెప్పండి'- అని ఆ పెద్ద మనిషికి అప్పుడు నా రచనలు కొన్ని పంపాను. పది రోజుల్లో నా రచనలు తిప్పి పంపుతూ వుత్తరం రాసాడు. సత్యప్రకాష్ ఆయాసం వచ్చి ఆగాడు. రోషంగా బుసలు కొట్టాడు.

-' అతను ఏం రాసాడో తెలుసా? నీ రచనలు ఏమి బాగా లేవు. నీవు ఇంకా పుస్తకాలు చదవాలి. అవగాహన పెంపొందించుకోవాలి. టెక్నిక్సు దేజిక్కించుకోవాలి. అంత వరకూ నీవు రచనలు చెయ్యటం మానేస్తే అందరికి మంచిది. అని రాసాడు. మొహం మీద నిర్దయగా గుద్దాడు. ఇది అన్యాయంగాదా?!

నేను తల దించుకున్నాను!

'నా రచనలు అంత ఛండాలంగా వున్నయ్యా! తను రాసినవి అంత గొప్పగా వెలిగిపోతున్నాయని అంత గర్వమా?! బుద్ధి జ్ఞానం వున్న మనిషి అసలు అంత పచ్చిగా రాస్తాడా? నాకు కోపం వచ్చి, బూతులు దిట్టూ వుత్తరం రాసాను. అంతే. అక్కడితో అతనికీ నాకూ సంబంధం కట్ అయ్యింది' అన్నాడు సత్యప్రకాష్ ఆవేశంగా.

నా మొహం ఎర్రగా అయింది! నాలో ఇంకా ఒక సందేహం మిగిలే వుంది!

'అటువంటి దుర్మార్గుడు రాసిన ఈ పుస్తకం ఇంకా నీతలాగా మీ వెంట వుండటమే ఆశ్చర్యంగా వుంది, సత్యప్రకాష్‌గారూ!' అన్నాను, సందేహ నివృత్తి కోసం ఎదురు చూస్తూ. సత్యప్రకాష్ కసిగా నవ్వాడు.

'గురువుగారూ! ఒక రహస్యం చెపుతాను. ఎవరితో అనకండి. అతను ఒక దుర్మార్గుడనటంలో సందేహంలేదు. కానీ, సార్' ఆ దుర్మార్గుడు రాసిన ఈ పుస్తకం పుంచి చూసారా?! ఇది చాలా గొప్ప పుస్తకం అన్న మాట వాస్తవం అండి! చిరకాలాలపాటు నిలిచే పుస్తకం ఇది. దీన్ని అందుకే వదిలి పెట్టలేకుండా వున్నాను. మళ్ళీ మళ్ళీ చదువుకుని- దీన్నించి ఏదో ఏదో నేర్చుకోవాలని ప్రయత్నిస్తున్నాను. ఇది కేవలం నా స్వార్థం. అంతేగానీ- అతని మీద అభిమానం మాత్రం కాదు' అన్నాడు, ఆరాధనగా. ఆ మాటల్లో స్పర్థ వుంది!

నా గుండెలు వుద్వేగంతో పుప్పొంగాయ్!

ట్రయిను స్టేషన్లో ఆగుతూ వుంది. నేను దిగాల్సింది ఆ స్టేషనే!

'థాంక్సు సత్యప్రకాష్‌గారూ!'అన్నాను. తెలిసో తెలియకో మీకు నా వలన ఏమైనా కష్టం కలిగితే క్షమించండి. వున్న మాట వున్నట్లుగా నిర్మొహమాటంగా చెప్పటం నాకు నిజంగా మొదట్నుండీ వున్న ఒక దురలవాటు-' అంటూ లేచాను. అతను తెల్లబోయాడు!

'అయ్యో! ఇంత సేపూ నేనే బడబడా వాగాను. నాకు మీ పరిచయం లేదు. ఎంతో ఓపిగ్గా ఇంత సేపూ నా మాటల్ని భరించారు. థాంక్సు ఇంతకీ మీ పరిచయం...!' సత్యప్రకాష్ అంటున్నాడు- నా వెనకాల్నే 'ఇంత త్వరగా మీరు దిగిపోతారనుకోలేదు'

'బాబూ నేనెవర్నో చెప్పి మరొక్కసారి మీ మనస్సుకు కష్టం కలిగించటం నాకు ఇష్టం లేదండి. దుర్మార్గుడయిన ఒక అజ్ఞాత రచయితగానే నన్ను వుండపోనీండి'- అని ట్రయిను దిగి వెనక్కి చూడకుండా అడుగులు వేసాను. ●

# బాబోయ్!... దెయ్యాలకథల పోటీ!

## ఆంధ్రసచిత్రవారపత్రిక

# రూ. 3000 బహుమతులు!

ఈసారి దీపావళికి-కొత్తరకం కథల పోటీ పెడుతున్నాం!

మూడే కథలు మూడే బహుమతులు !

| |
|---|
| మొదటి బహుమతి రు. 1300లు. అక్షరాల పదమూడు వందల రూపాయలు |
| రెండవ బహుమతి రు. 1000 లు. వెయ్యి రూపాయలు అక్షరాలా |
| మూడవ బహుమతి రు. 700లు. అక్షరాల ఆరున్నొక్క వందల రూపాయలు. |

సూచనలు నిబంధనలు గట్రా :

తేట తెనుగులో తెనుగుదేశ వాతావరణంలో

*1) ఉత్కంఠ భరితంగా 2) చమత్కారయుతంగా 3) కొసవిరుపో తుదిమెరుపో ఉండేలాగా*

*ఆరు అరఠావులకి తగ్గకుండా పన్నెండు అరఠావులకి దాటకుండా " కథ" అల్లాలి!*

* మూఢనమ్మకాలు గాఢనమ్మకాలు అనే తర్కవితర్కమేల? కథ లక్షణాలున్న చదువుతున్నంతసేపు వెనక్కు తిరక్కుండా చదివించగల కథలు రాయండి!

* ఈ కొత్తరకం కథల పోటీ మీ ఉపజ్ఞకి ఊహకి అనుభవానికి కూడా ఒక సవాల్‌గా భావించండి తప్ప దెయ్యాలున్నాయా? లేవా? అన్న 'రీసెర్చి' అనవసరంగా మొదలెట్టకండి!

* మీరంతా టాలెంటున్న రచయితలు. అటా? యిటా? అన్న సమస్య లేకుండా ఒకే 'యిటు' ఆంధ్రసచిత్ర వారపత్రికకి పంపగల కథలు మీచేత రాయించాలనే మా యీ ప్రయత్నం! విజయీభవ అంటూ బయలుదేరండి! కవరు మీద 'దెయ్యాల కథల పోటీ కోసం' అని వ్రాయండి !

షరాలన్నీ మామూలే: కథ కాపీ కారాదు. ప్రచారం ప్రసారం ప్రచురణ అయినది కారాదు. పూర్తి చిరునామా తప్పక యిచ్చునది, హామీ పత్రం పెట్టునది అయివుండాలి. మరువకండి.

-ఎడిటర్
ఆంధ్రసచిత్రవారపత్రిక

కథలు పంపవలసిన చిరునామా: ఎడిటర్, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగర్, విజయవాడ-520 003.

**ముగింపు తేదీ : 4 అక్టోబరు 1989**

# మాటకారుల పేజీ

## రెండక్షరాల మాట!

**చాలా మంది పాఠకులు తమ రెండక్షరాల మాటలు పంపించారు. కాని యీ మాట చూడండి.**

### "సెక్స్"

మాటకారులైన పాఠకులు పంపిన 'మాట'లు ఇక్కడ వేస్తున్నాము. పదనివారు మూడక్షరాల 'మాట' ప్రయత్నించండి. వందలాది కార్డులలో యీ క్రిందివి ఎంపిక చేయడం తతిమ్మావి వదిలివేయడానికి కారణాలు రెండు. (1) చోటు (2) అశ్లీలమైన మాటలు రాయడం-చాలా మంది మేమిచ్చిన "క్లూ"లు అమ్మ "ప్రేమ" తిరిగి రాశారు. ఇది మాటకారులతో ముఖాముఖి. అందరికి థాంక్స్. -ఎడిటర్

### హలో!

బహుమతి వచ్చే శీర్షికల కోసం అద్దెకు తీసుకుని చదువుతాను.

-జి.శోభా (తిరుపతి)

### ముద్దు

ఆంధ్రసచిత్రవార పత్రిక నేను ఎప్పుడూ 'కొని' చదువుతాను. నా అభిమాన పత్రికలలో ఆహ్లాదకరమైన సీరియల్స్ నాకు బాగా నచ్చుతాయి. ముఖ్యంగా "ఈ వారం ప్రత్యేకం" అని ఏ వారానికి ఆ వారం వస్తున్న ఎన్నో విషయాలను, ఆసక్తిదాయకంగా చూస్తాను.

-బి.లక్ష్మీప్రసాద్, (హైదరాబాద్)

### పాము

ఈ మాట వినగానే పదుగురు కుతూహలంగా చూస్తారనేది నిజం. ఇకపోతే నేను ఆంధ్రపత్రిక వీక్లీ అన్ని శీర్షికల కోసం 'కొని చదువుతాను.

-పల్లె వెంకటేశ్వరరావు (హెచ్.ముత్యాలంపాడు)

### బాధ

నేను ఎక్కువగా ఆంధ్రసచిత్ర వార పత్రికలోని 'సంపాదకీయం' శీర్షిక ఎక్కువ మక్కువతో చదువుతాను.

-కె.సత్యనారాయణ (పెనుగొండ)

### తేలు

నేను ఆంధ్రపత్రిక వీక్లీ లైబ్రరీలో చదువుతాను. ప్రతిశీర్షిక నాకిష్టమే.

-బి.వెంకటేశ్వరరావు (వెంగలేరు)

### పోస్ట్

నేను ఆంధ్రసచిత్రవారపత్రిక 'తాజా కాలమ్' శీర్షిక కోసం 'కొని' చదువుతున్నాను.

-శేషుకొత్తపల్లి (ఖమ్మం)

### ఓటు

ముఖ్యంగా 'తాజాకాలమ్', 'టిట్-ఫర్-టాట్'ల కొరకు పత్రికను 'కొని' చదువుతాము.

-డి.జ్వాలా నరసింహారావు (నూజివీడు)

### ఆశ

నేను అన్ని శీర్షికల కోసం ఆంధ్రసచిత్ర వార పత్రిక 'కొని' చదువుచున్నాను.

-గొట్టాపు దుర్గారావు (గోపాలపురం)

### జనం

ఆంధ్ర పత్రిక వీక్లీలో వచ్చే శీర్షిక ప్రతిది పుస్తకం 'కొని' చదువుతాను.

-కె.సుబ్బలక్ష్మి (కందుకూరు)

### సిగ్గు

ఆంధ్రసచిత్ర వార పత్రిక 'సాహితి పజిల్' శీర్షికకై ఎదురుచూసి, మార్కెట్‌లోకి రాగానే 'కొని' ఉత్సాహంగా చదువుకుంటాను.

-స్టూడియో మణి (నంద్యాల)

### కట్నం

ఆంధ్రసచిత్ర వార పత్రిక ప్రత్యేకించి ఒక శీర్షిక కోసం మాత్రమే చదవను. ధారావాహిక నవలలు తప్పించి, మిగిలిన అన్ని కథలు, శీర్షికలు, ముఖ్యంగా 'తాజాకాలమ్' చదువుతాను. ఆఫీసులో కొంతమందిమి కలిసి నడుపుకుంటున్న 'సర్క్యులేషన్' గ్రంథాలయం ద్వారా చదువుతాను.

-పి.జగన్నాథరావు (విశాఖపట్నం)

### డబ్బు

వారపత్రికను 'టిట్-ఫర్-టాట్', 'ఫోటో వ్యాఖ్య పోటీ' కోసం అద్దెకు తెచ్చుకుని చదువుతాను.

-ఎం.గోవిందరావు (విజయనగరం)

### ప్రియ

ఆంధ్రసచిత్ర వార పత్రికను 'యువతా! కవితా!' శీర్షిక కోసం 'కొని' చదువుతున్నాను.

-సి.వెంకటేషఫణి (ఎమ్మిగనూర్)

### బిల్లు

యువతా! కవితా! శీర్షిక కోసం మా అంటీ వాళ్ళింట్లో చదువుతాను.

-పి.శ్రీనివాస చౌదరి (మండువవారిపాలెం)

### బొమ్మ

జీవితకాలం విలువ వుండే కార్టూన్స్ కోసం 'కొని' చదువుతా!

-ఎం.పి.శకుంతలా కళ్యాణి (విశాఖపట్నం)

### అయ్యో

వీక్లీని అద్దెకు అప్పుడప్పుడు 'కొని' చదువుతాను. 'టిట్-ఫర్-టాట్' కోసం.

-కె.రామారావు (హైదరాబాద్)

### ఓయ్

ప్రముఖుల ఇంటర్వ్యూల కోసం అద్దెకు తీసుకొని చదువుతాను.

-జి.రాధ (తిరుపతి)

### ప్రియ

ఆంధ్రసచిత్రవార పత్రికలోని ప్రతి శీర్షిక చదవడం నా హాబీ. వీక్లీని 'కొని' చదువుతాను. నేను మెచ్చేవి 'టిట్-ఫర్-టాట్', 'ప్రశ్నావళి'

-న్యాయపతి రమేష్ బాబు (హైదరాబాద్)

### అత్త

యువతా! కవితా! శీర్షిక కోసం పత్రికను 'కొని' చదువుతాను.

-డి.విజయభాస్కర్ (చీరాల)

### ఒడి

'తాజాకాలమ్' కోసం వీక్లీని 'కొని' చదువుతాను.

-జి.శారద (సికింద్రాబాద్) ●

రుచి మిన్న అన్నిటి కన్నా










# స్వస్తిక్స్

ఇన్‌స్టంట్ గులాబ్ జామున్ మిక్స్

మేము తయారు చేసే ఇన్‌స్టంట్ పదార్థాలను వాడండి.

KAN ADS (B)



# అవే కళ్ళు



డాక్టర్ రమాకాంత్ ఆపరేషన్ను ముగించుకొని మధ్యాహ్నం ఒంటిగంటకు నివాస గృహంలో అడుగు పెట్టాడు. ఆ రోజు చేసినన్ని ఆపరేషన్లు ఏనాడు చేయలేదేమో! అందులో ఒకటి చాలా పెద్దది. మృత్యువు తన కబంధ హస్తాలతో బిగించి రోగిని లాక్కో పోతూంటే తన శక్తినంతటినీ కూడగట్టు కొని హోరా హోరీగా మృత్యు దేవతతో పోరాడి, రోగి ప్రాణం కాపాడాడు. అది అతనికి ఘన విజయం; అతనికే కాదు! వైద్య శాస్త్రానికే ఘన విజయం! ఓ ముందంజ!

అతని హృదయం సంతృప్తితో నిండి పోయింది. అందువల్లనే పడిన శ్రమ మరచి ఉల్లాసంగా యిల్లు చేరుకున్నాడు.

అతను కళాపిపాసి. నవీన పద్ధతులలో సర్వ సౌకర్యాలతో రమణీయంగా నిర్మించుకొన్నాడా భవనం. తల్లీ, తండ్రీ స్వగ్రామంలోనే వుంటూ వున్నారు. అంత యింట్లోనూ అతనొక్కడే! వంట మనిషి; నౌకర్లూ అతని కనుసన్నల్లో పనులు జరుపుకు పోతున్నారు. పరిశుభ్రమైన ఆ ప్రశాంత గృహంలో ప్రవేశించగానే అలసి వున్న శరీరం సహజంగా విశ్రాంతి కోరింది.

అతని దృష్టి హాలులో వున్న ఓ స్త్రీమూర్తి ఛాయా చిత్రం మీద వాలింది. ఏదో ఓ అతీతమైన శక్తి అతని హృదయ కవాటం తెరిచింది. హృదయ మందిరంలో స్థిర నివాసం ఏర్పరుచుకున్న ఆ స్త్రీమూర్తిని మనో నేత్రాలతో చూడసాగాడు!....

హృదయం బరువెక్కింది! ఆలోచన మంచ గించింది! ఆరోజు అతనికి విశ్రాంతి కరువైపోయింది. డ్రస్సు మార్చుకోకుండానే పడక కుర్చీలో వాలి పోయాడు. నౌకరు పంకా వదిలాడు. వంటమనిషి భోజనం అంతా టేబులుమీద వుంచి వడ్డన చేయటానికి తయారుగా వున్నాడు.

డాక్టరు యీ లోకంలో లేడు! ఆలోచిస్తూ మెల్లగా రెప్పలు వాల్చుకున్నాడు. అతని హృదయంలో ఏదో అశాంతి బయలుదేరి పైకి రావటం మొదలు పెట్టింది. అతని ఆలోచనలు పరి పరి విధాల పోయాయి– జీవిత లక్ష్య మేమిటి? ఈ ప్రశ్న అతని మెదడులో విశృంఖల విహారం చేసింది.

ఈ విషయంలో యితరుల ఉద్దేశం ఎలా వున్నా తన నమ్మిక మటుకు జీవితాన్ని సౌఖ్యానందాలతో అనుభవిస్తూ, శక్తికొద్దీ మానవసేవ చేయాలనే. ఈ లక్ష్యంలో తను విఫల మనోరథుడైనట్లు అతనికి అర్థమైంది. ఆ రోజు అది మరీ అనుభవ పూర్వకంగా తెలియ వచ్చింది. అతని హృదయం అసంతృప్తితో నిండి పోయింది. అగాధంలో పడిపోయినట్లు బాధ కలిగింది. ఈ జన్మలో శాంతి సౌఖ్యాలు పొందే అవకాశాలు కోల్పోయాననుకున్నాడు. 'విధి' తనను ఎదురు నిల్చింది. తను పీడస్వప్నంలా యీ జీవితం గడపవల్సిందే! ఈ ఆలోచనరాగానే పరితాపం, దుఃఖం అతని హృదయాన్ని కబళించి వంత పెట్టుచేయ మొదలు పెట్టాయి.

డాక్టరు యీ స్థితిలో వున్నాడు. ఇంతలో అతని నర్సు భయాందోళనలు వ్యక్తం చేస్తూ వచ్చి, కంపిత హృదయంతో, "డాక్టరు బాబూ!.... డాక్టరు బాబూ!" అంటూ అతనిని లేప ప్రయత్నించింది. ఎంతో శ్రమ మీద అతను కనురెప్పలు విప్పాడు.

"ఎవరో ఆఫీసర్, సార్!.... కారు యాక్సిడెంట్!... బలమైన దెబ్బలు తగిలాయి!.... స్పృహలేదు!... ఆపరేషన్ టేబుల్ మీద వుంచాం, సార్!"

ఆమె చెప్పింది. అతను విన్నాడు.

ఆమె ఆందోళనగాని, రోగి అపాయ స్థితిగాని అతనిని కదిలించలేక పోయాయి. మీదు మిక్కిలి శూన్యంలోకి చూస్తూ ఆలోచనలో పడిపోయాడు!

రోగి శరీరానికి బలమైన గాయాలు తగిలాయి!... కాని తన హృదయమే తూట్లు పడిపోయింది!... అతనికి స్పృహలేదు! బాధాలేదు!..., తనకో! బాధ! జీవితాంతం బాధ!.... ఆ మైకంలో అతను చచ్చి శాంతి పొందగలడు!.... తను చావలేడు! బాధ నుంచి విముక్తి పొందలేడు!.... అతను అదృష్ట వంతుడు!.... తనో దురదృష్టవంతుడు. – డాక్టరు ఆలోచనలు యిలా అల్లుకొని పోయాయి.

నర్సుపడుతున్న ఆదుర్దా అతను గమనించలేదు. రోగి బాధను తన బాధగా ఎంచే యీ డాక్టరు, మానవ సేవే మాధవసేవగా తలిచే యీ డాక్టరు, రోగి ఆపరేషన్ టేబుల్ మీద మృత్యుదేవతతో పోరాడు తుంటే తనకేమీ పట్టనట్టు యిలా చైతన్య రహితంగా వుండిపోవడం, ఆమెను ఆశ్చర్యపరచ టమే కాదు, భయాక్రాంతురాల్ని చేసింది. ఇంతలో రోగి తాలూకు మనుష్యులొచ్చి డాక్టర్ని తొందర చేయసాగారు. డాక్టరు మాట్లాడకుండా లేచి, అదే ఆవరణలో వున్న తన ఆసుపత్రిలోనికి అడుగు పెట్టాడు.

రోగి పేరు, వూరు, హోదా అన్నీ తెలుసు కొన్నాడు.... అతనికి యీ కేసులో ఓ విధమైన ఆసక్తి కలిగింది. రోగి పేరు ప్రభాకర్. ఓ సంస్థలో ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. నాగార్జునసాగర్‌లో ప్రస్తుతం ఒంటరిగా వుంటున్నాడు. అతని భార్య పుట్టిన రాజమండ్రి వెళ్లింది. అతను ఓ ప్రత్యేక పనిమీద విజయవాడ వస్తూ బ్యారేజి వద్ద యీ ఆపదలో చిక్కున్నాడు.

డాక్టరు రమాకాంత్ సుప్రసిద్ధ సర్జన్. అంచేత గవర్నమెంటు ఆసుపత్రికి తీసుకొని పోకుండా రోగిని యిచ్చటికి తీసుకొచ్చారు.

డాక్టరు రోగి ముఖంలోకి పరీక్షగా చూచాడు. ఎప్పుడో చూచిన జ్ఞాపకం..... చూచిన కొద్దీ అతనిలో ఎన్నో మార్పులు రా మొదలు పెట్టాయి. భూతకాలంలోనికి మూడడుగులు వేశాడు. అతని హృదయం క్రోధంతో నిండి పోయింది! మంచి చెడ్డలకు గల తారతమ్యం మరచి పోయాడు! అతని హృదయం మీద ఓ విధమైన పశుత్వం ఆధిపత్యం వహించింది!

ఇతను – ఈరోగి – తన సౌఖ్యానికి అడ్డు పడ్డాడు! తన జీవిత సర్వస్వం నాశనం చేసింది యితనే! తను బ్రతికి, బ్రతకని వాని స్థితికి వచ్చింది యీతని వల్లే! ఇతను తనకు పంటయింటి కుందేలివ్వడు! ఇతనిని తను క్షమించలేడు! ఇతని పాలిట యముడు తను! ఇతనిని, అంతం చెయ్యవల్సిందే!

ఓ క్షణం పాటు ఆలోచించాడు. సిరంజి తీసుకొని తన ప్రైవేటు గదిలోనికెళ్ళి మందు నింపుకొచ్చాడు!

కాజ వెంకట అనంతపద్మనాభరావు

ఇంజక్షన్ యిచ్చేముందు ఓ సారి రోగి ముఖంలోకి చూచాడు.... అలానే చూస్తూ వుండిపోయాడు కొద్దిసేపు!

రోగి ముఖం నిర్మలంగా ప్రశాంతంగా వుంది... అతనికి ఆశ్చర్యం కలిగింది. రోగి ముఖం క్రమేపీ మాయం కావటం మొదలు పెట్టింది! ఆ స్థానే ఓ దివ్యతేజస్సు ఉద్భవిస్తున్నట్లు గోచరమైంది! అతను అలానే యీ అద్భుతాన్ని వేయికళ్లతో చూడసాగాడు.... ఆ తేజస్సు ఓ స్త్రీరూపం దాల్చింది! ఆమె ముఖపద్మం అతనికి సుపరిచితమైనదే! వెన్నెలలోని చల్లదనం, ప్రాతఃకాలంలోని ప్రశాంతతా, చిగురాకులోని మార్దవం, మాతృమూర్తిలోని త్యాగశీలం– ఓ! ఒకటేమిటి? – ప్రపంచాన్నే పునీతం చేయగల ఓ దివ్యతేజస్సు ఆ చూపులో నిల్చి, అతనికి దైవత్వం ప్రసాదించటానికి చేయిచాచి, రా, రమ్మని ఆహ్వానించింది! ఆ సువిశాల నయనాలకే, ఆ ప్రేమ పూరిత వీక్షణాలకే అతను యిన్ని రోజులు దూరమై, జీవిత మాధుర్యాన్ని కోల్పోయాడు.

అతనికిది ఓ అపూర్వ విచిత్రానుభూతి. త్వరిత గతిలో అతను మార్పు చెందాడు! ఇంత వరకు అతనిని ఆవేశించిన పశుత్వం మాయమైంది! అతను తిరిగి మనిషిగా మారాడు! ఆక్షణంలో పరిస్థితి అంతా అవగాహనము చేసుకున్నాడు.... తను చేయ సంకల్పించింది ఘోర పాతకం!.... శరీరం నిలువునా వణికింది! చేతిలోని సిరంజి క్రిందపడి పగిలిపోయింది! అతని కేదో మైకం క్రమ్మినట్లైంది. వివశుడై వాలిపోయాడు! నర్సు తదితరులు అతన్ని పట్టుకొని మెల్లగా కుర్చీలో కూర్చో పెట్టారు. ముఖాన్ని చల్ల నీటితో తుడిచారు. త్వరలోనే అతను స్వస్థత పొందాడు.

అతనికి జ్ఞానోదయమైంది! వైద్యుడు దైవాంశసంభూతుడు. అతిపవిత్రమైంది అతని వృత్తి. అతడు అజాత శత్రువు. ప్రతి ప్రాణితో అతనిప్రాణం ముడిపడివుంది. ప్రాణరక్షణే అతని కర్తవ్యం.



అతడు తన విధినిర్వహణలో అమరత్వం పొందుతాడు.

తను చేయబోయిన అతి నీచమైన పనికి సిగ్గుపడ్డాడు రమాకాంత్. పశ్చాత్తాపంతో అతని హృదయం మిక్కిలి, బాధపడ్డది..... బాధ అన్నివేళలా చెడ్డదికాదు. కొన్ని సందర్భాలలో సంజీవిగా పనిచేస్తుంది. అతని హృదయం తేలికపడ్డది.

నిండుహృదయంతో దృఢవిశ్వాసంతో తన విధిని నిర్వర్తించాడు. పది రోజులు ఆ రోగిని తన ఆసుపత్రిలో – ప్రత్యేక సదుపాయాలతో – వుంచుకొని కంటికి రెప్పలాగా సేవ చేశాడు. రోగి పూర్తి ఆరోగ్యం

పొందాడు. డాక్టరు ఆనందానికి అవధులు లేవు. సేవకు ప్రతిఫలం పుచ్చుకోకుండా ప్రాణ స్నేహితుడుగా రోగిని సాగనంపాడు.

ఈ సంఘటన అతని జీవితంలో ఓ బ్రహ్మాండమైన మార్పు తెచ్చింది. మోడుబారిన అతని జీవితం చిగురించ సాగింది. అతనికి యిన్ని రోజులు దూరమైన –. ఆకర్షణ శక్తిగల ఆ నేత్రాలు. నరకాన్నే స్వర్గలోకంగా మార్చగల ఆ నిండైన చిరునవ్వు. అతని బంధుకోటిలో ఓ కన్యయందు కొంత వరకు చూడగలిగాడు. ఆమె సహచర్యం ఆపేక్షించి ఆమెను తన జీవిత భాగస్వామిగా చేసుకున్నాడు. అతని దాంపత్య జీవితం పుష్పించి కాయలు కాయ మొదలు పెట్టింది. అతను తన జీవిత లక్ష్యం తృప్తిగా నెరవేర్చు కుంటూ పోసాగాడు.

కాలవాహినిలో యిరవై నాల్గు సంవత్సరాలు మరుగున పడిపోయినై. వైద్య వృత్తిలో అతను ఘననీయమైన అనుభవం పొందాడు. నిస్వార్థంగా ప్రజాసేవ చేయటం వల్లి పేరు ప్రతిష్టలు పెరిగాయి. తనయుడు కూడ పెద్ద సర్జెన్ అయి ఆయనకు చేదోడు వాదోడుగా నిల్చాడు.

అపాయ స్థితిలో వున్న తన కూతురు రమని ఓ రోజు ప్రభాకర్ డాక్టరు రమాకాంత్ ఆసుపత్రికి తీసుకొచ్చాడు. అతనికి యీ డాక్టరు మీద ఎనలేని గురి. ఎలాగైనా ఆమెను బ్రతికించమని ప్రాధేయపడ్డాడు.

రమాకాంత్ హృదయానికి ఆకర్షణీయమైన విచిత్రానుభూతి కలిగింది. చిన్నప్పుడు యీమె తల్లి రాధకూడ సరీగా యిలాగే వుండేది! అదే మోము! అవే పెదవులు! అవే నేత్రాలు! ... చిరునవ్వుకూడ అదే!.... నేత్రాలు దివ్యకాంతులీనుతున్నాయి! ఇరవై ఏడు సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనలు ఆక్షణంలో జరుగుతున్నట్లు అతనికి అనుభూతి కలిగింది. ఆ మధుర స్మృతులు అతనిని యిరవై సంవత్సరాల చిన్నవాణ్ణిగా చేసినై.

రమ బాధతో మూలిగింది. డాక్టరు తక్షణం సహజ స్థితిలోకి వచ్చాడు. తన ధర్మాన్ని నెరవేర్చ సాగాడు. అభయమిచ్చి రమను ఆపరేషన్ థియేటర్‌కు తీసుకొని వెళ్లాడు. మేజర్ ఆపరేషన్! ప్రేగు మడత పడ్డది! ఎన్నో చిక్కులు అధికమించి తన కుమారుడు డాక్టరు రాధాకృష్ణ సహకారంతో విజయవంతంగా ఆపరేషన్ ముగించాడు డాక్టరు రమాకాంత్.

..... రమకు మైకంపోయి స్పృహ వచ్చింది. బాధారహితమైన మోముతో, కంపిత హృదయంతో వున్న, తండ్రిని చూచి మందహాసం చేసింది. తండ్రి హృదయం ఆనందంతో ద్రవించిపోయింది. ఆనందబాష్పాలు అతని నేత్రాల నుండిజారినై. ఆమె నయనాలు చెమ్మగిల్లాయి.

రమ గుంటూరు గరల్స్ కాలేజిలో బి. ఎ. చదువుతూంది. ప్రిన్సిపాల్ నుండి రమ జబ్బు విషయమై ప్రభాకర్‌కు ఫోనువచ్చింది. అంత పెద్ద ప్రభుత్వ ఆసుపత్రి గుంటూరులో వున్నా ఆమెను డాక్టరు రమాకాంత్ వద్దకే తీసుకొచ్చాడు.

రమకు అన్ని వసతులున్న ప్రత్యేకమైన గదియిచ్చారు. హమేషా ఆమెను కనిపెట్టుకొని వుండేందుకు, ఓ నర్సును కూడ ఏర్పాటు చేశాడు డాక్టరు రమాకాంత్.

మరునాడుదయం డాక్టరు రమాకాంత్ కొడుకుతో పాటు, ఇన్ పేషన్ట్సును చూస్తూ రమగదికొచ్చాడు. ప్రభాకర్ డాక్టర్లను సగౌరవంగా ఆహ్వానించాడు. రమను పరీక్షించారు డాక్టర్లు. ఎలాటి ఒడుదుడుకులు లేకుండా ఆరోగ్యం పొందుతున్నందుకు మిక్కిలి సంతోషం వెలిబుచ్చి ఆమెను అభినందించారు. అతని అమృతహస్త మహిమని, ప్రభాకర్ మెచ్చుకొన్నాడు.

ఇంతలో రమ తల ప్రక్క నుంచున్న స్త్రీమూర్తిని ఓ మారు రమాకాంత్ తలెత్తి చూచాడు. ఆమె అతనిని చూస్తూనేవుంది. ఇద్దరి వీక్షణాలు ఏకమయ్యాయి. సభ్యతా, అసభ్యతా మరిచిపోయి ఓ నిముషం యిద్దరూ అలానే వుండిపోయారు. వారి హృదయాంతరాళాలలో కలిగే అనుభూతులు, వారి ముఖాలలో కొంతవరకు నాట్యమాడాయి. వారి నేత్రాలు ప్రేమ పాశాలు పేనాయి. వాటి కనుగుణంగా పెదవులు చలించాయి. ఒకరి భావాలు మరొకరికి స్పష్టంగా అర్థమౌతున్నట్లు వారి ముఖభంగిమలే చెప్పాయి. హృదయాలు భాషించుకొన్నాయి. ఆ సంభాషణ జరిపేశక్తి ఏ భాషకూ లేదు, ఒక్క వారిచూపులకు తప్ప!

ఈ అపురూప సంఘటన డాక్టరు రాధాకృష్ణ, ప్రభాకర్ ఆసక్తితో కనిపెట్టకుండా వుండలేకపొయ్యారు. రమ కూడ కొంత వరకు ఆశ్చర్యపడ్డది.

సభ్యత రమాకాంతాన్ని మేల్కొలిపింది. వెంటనే గది విడచి బయటికి నడిచాడు. తండ్రిని వెంబడించాడు తనయుడు.

రాధ కన్నుల నుండి ఆనందధారలు కారాయి. కుతూహలంతో తన వంకే చూస్తున్న భర్తనుద్దేశించి ఆమె అంది.

"డాక్టర్ రమాకాంత్ ఎవరోకాదు! మన బంధువు! అప్తుడు! నా పసుపు కుంకం నిలపెట్టిన మహనీయుడు! అంతేకాదు! మన రమకు ప్రాణదాత! మనకు దైవ సమానుడు! నాకు సోదరుడు లేనిలోటు అతను తీర్చగలడని ఆశించాను. కాని అతను నన్ను అపార్థం చేసుకొని యిన్నాళ్లూ నాకు దూరమైనాడు. మీకు అతని మీద సదభిప్రాయం కలిగింది. పూర్వం జరిగిన సంఘటన జ్ఞప్తికి తెస్తే మీకు అతనిమీద వున్న అభిప్రాయం మారుతుందేమోనని చెప్పడానికి సాహసించలేదు."

"అవునవును! ... మొదటి రోజులలో యితని గురించి ఏదో చెప్పినట్లు జ్ఞాపకం..... నిన్ను వివాహం చేసుకోవాలని కదూ అనుకున్నాడు?"

"ఔను!"

"అంత మాత్రాన అతను చెడ్డవాడు ఎలా అవుతాడు?.... మంచివాడు! అంచేతే మనలను యిలా కాపాడుతూ వచ్చాడు."

డాక్టరు యందు తనకుగల విశ్వాసాన్ని, కృతజ్ఞతను హృదయ పూర్వకంగా ప్రకటించాడు ప్రభాకర్.

రమ దాదాపు మూడు వారాలు ఆసుపత్రిలో వుంది. కాని రమాకాంత్ మళ్లీ ఆగదిలో అడుగు పెట్టలేదు! రాధాకృష్ణ రమను ట్రీట్ చేశాడు. రాధ తన దగ్గర బంధువుల యింట్లో వుంటూ, ఆసుపత్రికి వస్తూవుండేది. ప్రభాకర్ డ్యూటీలోనే వుంటూ

## ఆంధ్ర సచిత్ర వార పత్రిక మాటకారుల పేజీ

మూడక్షరాల మాట లున్నాయి ముచ్చటగా. ఇవి మనల్ని పీడిస్తాయి. ఉదాహరణకి 'ఆకలి' - ఇలాంటి మాట ఒక్కటి కార్డుమీద రాసి మీ పేరు, చిరునామా రాసి పంపండి. ఎడిటర్‌కి నచ్చిన మాటలు మీ పేరూ, వూరుతో వేస్తాము! దీంతో పాటే అదే కార్డుమీద "వీక్లీ"ని మీరు కొనా? ప్రక్కింటగైకొనా? అద్దెకు తీసుకొనా? లైబ్రరీలోనా? ఎట్లు సంపాదించెదరు? అన్న ప్రశ్నకి 'వారం'లోగా జవాబు రాయాలి సుమా!

- మీ ఎడిటర్

అప్పుడప్పుడు విజయవాడ వచ్చి రమను చూచి డాక్టర్లతో మాట్లాడి పోతుండేవాడు

రాధాకృష్ణ రమను ఆప్యాయంగా పలకరిస్తూ ఆమె అవసరాలకు ఏలోటూ రాకుండా చూస్తున్నాడు రమ అతనియందు కృతజ్ఞతా భావం కనబరుస్తూ వుండేది రాధ అతని మీద ప్రీతిని పెంపొంద జేసుకుంది ఆకర్షణీయమైన అంద చందాలతో పాటు నవనీత హృదయం కూడ వున్నందున అతనిని లోలోన అభినందించుకొంది తన కుమారుడే బ్రతికుంటే యీ వయస్సులోనే వుండేవాడని జ్ఞాపకం వచ్చినపుడల్లా విచారపడేది

రమకు పూర్తి ఆరోగ్యం చేకూరింది ఆమెను ఆసుపత్రి నుండి విడుదల చేశారు ఆరోజు ప్రభాకర్ కృతజ్ఞత తెలపటానికి డాక్టర్ రమాకాంత్ వద్దకు వెళ్ళాడు డాక్టరు మిక్కిలి స్నేహభావంతో ప్రభాకరాన్ని ఆయన కుటుంబాన్ని రాత్రి విందుకు ఆహ్వానించాడు ప్రభాకర్ కాదనలేకపోయాడు

ఆ రాత్రి రెండు కుటుంబాలవారు మైత్రితో కలసి మెలసి విందారగించారు హృదయాలు యిచ్చి పుచ్చుకున్నారు అంచరు హాలులో కూర్చుని మాట్లాడుకోవటం ప్రారంభించారు

డాక్టరుకు ఎలా కృతజ్ఞత తెలపాలో ప్రభాకర్‌కు తెలియలేదు శక్తినంతా కూడగట్టుకొని యిలా అన్నాడు

డాక్టరుగారూ! మా కుటుంబం అంతా మీకు ఋణపడి వున్నాము ఎన్ని జన్మలెత్తినా మీ ఋణం తీర్చుకోలేము! నాదొక ప్రార్థన

అంత పెద్ద మాటెందుకు? చెప్పండి!

మీరు దీన్ని స్వీకరించాలి అంటూ రెండు వేల రూపాయల చెక్కు బహూకరించాడు ప్రభాకర్

రమాకాంత్ కాదనలేదు చెక్కు అందుకున్నాడు దానిని టేబుల్ మీద వుంచి ఓ పర్యాయం ప్రభాకర్ వంకా రాధ వంకా అందరివంకా కలయ చూచాడు అతని మోములో పలు మార్పులు రాసాగాయి ఆవేదనతో అతని హృదయం క్రుంగిపోతున్నట్టు అతని నేత్రాలు సాక్ష్య మిస్తున్నాయి

ప్రభాకర్! ఈక్షణం నా జీవితంలో ముఖ్యమైంది అంతేకాదు! పవిత్రమైంది కూడ! మీ ముగ్గురి హృదయాలు అర్థం చేసుకున్నాను అవి నిష్కల్మష మైనవి మానవత్వాన్ని దాటి దేవత్వాన్ని అందు కుంటున్నాయి ప్రేమ కిరణాలు వెదజల్లే మీ ముఖార విందాలే అందుకు నిదర్శనం

మీరు నాకు ఋణపడి వున్నారని నమ్ముతున్నారు విషయాలు పూర్తిగా తెలియక మీరు అలా తలచి వుండొచ్చు నిజానికి నేనే మీకు ఋణపడి వున్నాను ముఖ్యంగా రాధకు! దానవుడుగా వున్న నన్ను మానవుణ్ణిగా మార్చిందామె!

ఇరవై నాల్గు సంవత్సరాల నుండి నా హృదయంలో ఓ అగ్ని పర్వతాన్ని దాచుకున్నాను! ఇక దాన్ని నేను భరించలేను! అది పరిపక్వమైంది! దాన్ని బ్రద్దలు కొట్టితేనే గాని నా హృదయానికి శాంతి వుండదు

అందరు ఆసక్తితో వింటున్నారు

రాజమండ్రిలో రాధ యిల్లు మా యిల్లు దాపులో వుండేవి ఒవిదంగా బంధువులం కావటం చేత రెండు కుటుంబాలూ కలసిమెలసి వుండేవి రాధా నేను ఎంతో చనువుగా ఉండేవాళ్ళం ఆమెలో — ఆ నేత్రాలలో ఎదో ఓ గొప్ప ఆకర్షణవుంది! ఆమె చూపులో అనిర్వచనీయమైన ఏదో మహత్తర శక్తి వుంది! ఆమె అంటే నాకు యిష్టం ఆమెను మోహించలేదు కామించలేదు ప్రేమించాను నా జీవితం ఉల్లాసభరితంగా వర్ధిల్లాలని ఆకాంక్షించాను ఆమె సహచర్యంలేకపోతే నా జీవితం ఎడారిలాగా మారిపోతుందని భయపడ్డాను అంచేత ఆమెను వివాహమాడాలని నిశ్చయించుకొన్నాను

డాక్టరు కొంచెం ఆగి మళ్ళీ మొదలుపెట్టాడు

నా జీవిత గాధ ఓ కథావస్తువుకు ఉపయోగపడేదిగా వుంటుందనుకోలేదు! నా ఆశలు అడియాశలైనాయి! నేను వైజాగ్‌లో యం బి బి యస్ ఆఖరు సంవత్సరంలో వున్నాను ఈసారి శలవులకు వచ్చినపుడు నా కోర్కె ఆమెకు తెలియజేయాలని నిర్ణయించుకొన్నా విధి నాకు ప్రతికూలమైంది ఆమెనుండి పిడుగులాంటి ఉత్తరం వచ్చింది! తన పెళ్ళికి తప్పకుండా రమ్మని వ్రాసింది నా హృదయం వేయి ముక్కలైంది! ఆమెమీద విపరీతమైన కోపం వచ్చింది వెళ్ళవద్దనుకుంటూ ఆగలేక ఆఖరు క్షణాలలో రాజమండ్రి బయలుదేరాను అప్పటికే ఆమెకు పెళ్ళిపోయింది! నేనొచ్చానని తెల్సి కాబోలు పసుపుబట్టలతోనే ఆమె మా యింటికొచ్చి నా పాదాలను కళ్ళకద్దుకొని నా ఆశీర్వాదంకోసం వేచివుంది! నేను ఉగ్రుడనైపోయాను! రాధా! అని భయంకరంగా అరిచాను భీతహరిణిలా వణుకుతూ లేచి నా కళ్ళలోకి చూచింది నన్ను మోసంచేశావు! ఎప్పుడూ నావదానవనుకున్నా! కఠోరంగా పలికాను

రాధ ఆశ్చర్యపోయింది! జాలి విచారం ఆమె మోములో తాండవించాయి బావా నేనూ ఒకరికోసం ఒకరు పుట్టాం మా వివాహం దైవసన్నిధిలో ఏనాడో జరిగిపోయింది! ఇపుడు జరిగింది కేవలం ఓ తంతు మాత్రమే! నాకు అందరు వున్నారు ఒక్క సోదరుడు తప్ప అది నీవల్ల తీరుతుందనుకున్నా నన్ను క్షమించి ఆశీర్వదించు అన్నయ్యా! అంటూ మళ్ళీ నా పాదాలు తాకింది నా మనోనేత్రాలకు బయర్లుకమ్మాయి ఆమెను అర్థం చేసుకొనే స్థితిలో లేను ఆమెమీద పగబూనాను నీవు ఎలా సుఖంగా వుంటావో నే చూస్తా! కర్కశంగా బెదిరించి ఆ రాత్రే వైజాగ్ వెళ్ళా

రాధ కళ్ళవెంట జలజల నీరుకారింది ఇరవైఐదు సంవత్సరాలక్రితం జరిగిన సంఘటన యిప్పుడు తనముందు జరుగుతున్నట్లనిపించిందామెకు

రాదను చూచి డాక్టరు చలించాడు అశ్రువులతో

# పెద్దల చమత్కారాలు

## గాడిద నవ్వు

ఒకసారి ఒక జంతు ప్రదర్శనశాలలోకి కొందరు సందర్శకులు వెళ్ళారు అక్కడ కొన్ని జంతువులతో పాటు గాడిద కూడా వుంది ఆ గాడిద వున్నట్టుండి ఒక్కసారిగా నవ్వటం ప్రారంభించింది జంతుశాలకు వచ్చిన సందర్శకులు ఆశ్చర్యపడి ఆ గాడిద అలా ఎందుకు నవ్వుతోందని అక్కడి కాపలా దారుని అడిగారు నిన్న మీకు మల్లె నే ఇక్కడికి కొందరు సందర్శకులు వచ్చి కొన్ని చలోక్తులు విసిరి వెళ్ళారు గాడిదకు ఆ చలోక్తులు ఇప్పుడు అర్థమై వుంటాయి అన్నాడు కాపలాదారుడు

## రామాయణం – భారతం

శివరామకృష్ణ చేతంలో పది రోజుల నుంచి రామాయణం వింటున్న ఓ పెద్ద మనిషి ఒక రోజు భార్యను పిలిచి దశరధుడికి మల్లే నాకూ ముగ్గురు భార్యలుండి నలుగురు కొడుకులుంటే ఎంత



బాగుండు అనిపిస్తోంది అన్నాడు వెంటనే భార్య ఏమాత్రం తడుముకోకుండా అప్పనంతే సంకరమఠంలో ఈ మధ్య భారతం వింటున్నానేమో ద్రౌపదికి మల్లే ఐదుగురు భర్తలున్నా లేని ఒన్నె ఒన్నెనా అని నాకూ అనిపిస్తోంది అంది

మరుక్షణం మొగుడు చుట్టుప్రక్కల కనిపిస్తే ఒట్టు

## అనువాద జోక్

ప్రెసిడెంట్ ఆఫ్ ది వార్ విడోస్ అసోసియేషన్ శ్రీమతి పకుద్దీన్ అలీ అహ్మద్ ప్రెజెంటెడ్ ఎ ఫ్లాగ్ టుది ప్రైమ్ మినిస్టర్ శ్రీమతి గాంధి అండ్ కలెక్టెడ్ డొనేషన్ ఆఫ్ టెన్ థవుజండ్ రుపీస్– అన్న ఆంగ్ల వాక్యానికి ఒక ప్రబుద్ధుడి తెలుగు తర్జుమా చిత్తగించండి

యుద్ధ విధవల సంఘం అధ్యక్షురాలు శ్రీమతి పక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రధాన మంత్రి శ్రీమతి గాంధీకి జండా తగిలించి పదివేల రూపాయలు వసూలు చేసారు

–ప్రయాగ

అతని నేత్రాలు నిండిపోయాయి మాట పెగల్లేదు ఎంతో ప్రయత్నంమీద మళ్ళీ చెప్పటం మొదలు పెట్టాడు

దైవలీలలు అర్థంకావు! తుపాను వచ్చేముందు కొన్ని సూచనలు కనిపిస్తాయి అలానే – నాకు బాగా జ్ఞాపకంవుంది ఇరవై నాల్గు సంవత్సరాల క్రితం – ప్రభాకర్! మీరు కారు ప్రమాదంలో స్పృహకోల్పోయి నావద్దకు వచ్చిన రోజున నేను చాల అలసి యింటికి వచ్చాను అశాంతి నన్ను ఆవరించింది ఆలోచించాను స్త్రీ పురుషుల కలయికవల్లే ప్రకృతి శోభిల్లుతుంది నేను ఆ అదృష్టానికి నోచుకోలేదు! హృదయం హృదయంతో కలిసి ఆప్యాయతతో స్వాగతమిచ్చే అర్ధాంగి నాకు కరువైపోయింది ఎన్నడూ పడనంత బాధ పడ్డాను ఆ సమయంలో! రాధ నా జీవితం సర్వ నాశనం చేసిన రాధ – ఆ రాధ భర్త మీరని తెల్సింది! నాలో కరడుకట్టుకొని పోయిన క్రూరత్వం ఒక్కసారిగా విజృంభించింది పగ! ప్రతీకారం! ఇదే ఆలోచన అతి నీచమైన రాక్షసుడిగా మారిపోయాను

ఇక మాట్లాడలేకపోయాడు ఓ క్షణం ఆగి తరువాత జరిగిన విషయాలు పూసగుచ్చినట్లు చెప్పి అందర్నీ ఆశ్చర్య భయానకాలలో ముంచెత్తాడు

రాధ ముమ్మూర్తులా భారత స్త్రీ ఆమెలోని దైవత్వం నన్ను పునీతుణ్ణి చేసింది! తన కథ పూర్తి చేశాడు డాక్టరు

రాధ అందుకుంది

అన్నయ్యా! నివురుకప్పి నీలో దాగివున్న అమృతహృదయం యిలా బహిర్గతమైంది అంతే! నా నోములు పలించాయి నా జన్మ తరించింది దైవసమానుడైన నీబోటి అన్నను పొందగలిగాను నేను అదృష్టవంతురాల్ని!

ఈ దృశ్యానికి అందరి హృదయాలు కరిగి నేత్రాల నుండి ఆనందవాహిని ఉరకలువేసింది

అన్నయ్యా! మీ బావ కోర్కె మన్నించి కానుక స్వీకరించు రాధ ప్రాధేయపడ్డది

చెల్లీ! కానుకలిచ్చే వంతు నాదమ్మా! నీవు మా యింటి ఆడబిడ్డవు ఐనా నీ కోర్కె కాదనలేను బావగారు! ఏమిస్తారు? కొంటెగా చూస్తూ పలికాడు డాక్టరు

నేను దన్యుణ్ణి బావగారు! నా సర్వస్వం

డాక్టరు అందుకు యిలా అన్నాడు

రమ సరిగా చిన్నప్పటి రాధలా వుంది అవే పోలికలు! అవే కళ్ళు చిరునవ్వు కూడ సరిగా అదే! ఆ చిరునవ్వు కాంతులు మా గృహాన్ని నింపాలి మీ అభ్యంతరం లేకపోతే ఆమె యీ యింటికి కోడలుగా వచ్చి మాకు కూతురులేని కొరత తీర్చాలి

మేము కోరవల్సింది మీరే కోరారు మా కుటుంబానికి యిలాటి అదృష్టం పడుతుందని మేము కలలోగూడ వూహించలేకపోయాం మేము సర్వదా మీ కుటుంబానికి కృతజ్ఞులం ప్రభాకర్ హృదయపూర్వకంగా పలికాడు

రాధాకృష్ణ చిలిపిగా రమవంక చూచాడు సిగ్గు బరువుతో రమ తల వాల్చుకుంది రమాకాంత్ భార్య ముచ్చటపడి రమ నుదురు మురిపెంతో ముద్దాడింది

ఆ గృహం ఆనందనిలయమైంది ●

## హిందీచిత్రంలో ద్రోణాచార్యుడు

మహాభారతంలో ద్రోణాచార్యగా నటిస్తున్న సురేంద్రపాల్ ఖుదాగవా లో నటిస్తున్నాడట ఈ చిత్రంలో హీరోగా అమితాబచ్చన్ నటిస్తుండగా హీరోయిన్‌గా నటిస్తున్న శ్రీదేవి ద్విపాత్రాభినయం చేస్తోందట

శక్తికపూర్ ఈ చిత్రంలో విలన్‌పాత్రను పోషిస్తున్నాడట శక్తికపూర్‌ను ఈ చిత్రం నుంచి తొలగించివేయగలిగితే పాల్‌కు మంచి అవకాశం ఈ చిత్రంలో లభించగలదని ఆశిస్తున్నారట చాలామంది మరి ఆ అవకాశాన్ని పాల్ పట్టేస్తాడో లేదో!

# గిడుగు పిడుగుగారు ప్రాతః స్మరణీయులు!

- హెచ్. రమేష్‌బాబు

"భాష ప్రజల పరమైతే తమ బ్రతుకులు బ్రద్దలవుతాయనే నెపంతో గ్రాంధిక వాదులు వ్యావహారిక భాషావాదాన్ని త్రోసిపుచ్చుతున్నారు సామాన్యులకు అర్థంకాని భాష నిరుపయోగమని" పిడుగులా గ్రాంధిక భాషావాదులపై గర్జించిన మహనీయుడు గిడుగు రామమూర్తి పంతులుగారు

1863 ఆగస్ట్ 29న విశాఖపట్టణం జిల్లా "పర్వతాలపేట"లో జన్మించిన గిడుగువారు ప్రాధమిక విద్యను అక్కడే అభ్యసించారు 1880లో పర్లాకిమిడి రాజుగారి పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టారు 1895లో రాజుగారి పాఠశాల కాలేజిగా మారడంతో 1896లో బి ఏ ప్రైవేటుగా ఉత్తీర్ణుడై అక్కడే చరిత్రోపన్యాసకుడుగా 1911 దాక పనిచేసి ఉద్యోగ విరమణ చేశారు

పంతులుగారు 1910 మే నెలలో విశాఖపట్టణం ఉపాధ్యాయ మహాసభలో వ్యవహారిక భాషా ప్రాధాన్యతను గురించి తొలిసారిగా దీర్ఘోపన్యాసం చేసినారు.

## సత్కారాలు

పంతులుగారు నివసించే పర్లాకిమిడి చుట్టూ ఉన్న ఏజెన్సీ ప్రాంతంలోని అనాగరికులైన సవర జాతీయుల జీవన విధానంలో సవరల ఆచార వ్యవహారాలు తెలుసుకుని 'తెలుగు- సవర నిఘంటువు', 'సవరకథలు', 'సవర వాచకం' వంటి గ్రంథాలను ఆయన రచించారు వీటిని ఆనాటి మదరాసు ప్రభుత్వం ప్రచురించి సవరల భాషాభివృద్ధికి చేసిన కృషికి గుర్తింపుగా 1911లో గిడుగువారిని 'మెరిట్ ఆఫ్ సర్టిఫికేట్' ద్వారా 1913లో 'రాయ్ సాహెబ్' 'కళా ప్రపూర్ణ' బిరుదులతో సత్కరించింది

సవరభాషాభివృద్ధికై వారి జీవన విధానాలు మెరుగుపరచడానికై చేసిన కృషి ఒక ఎత్తు కాగా వ్యవహారిక భాషాభివృద్ధికై చేసిన ఉద్యమం మరో ఎత్తు

ఆయన వ్యావహారిక భాషోద్యమం ప్రారంభించిన మొదటి రోజుల్లోనే 1911లో విద్యా విధానంలో కొన్ని మార్పులు జరిగి స్కూల్ ఫైనల్ 'ఇంటర్మీడియెట్' పాఠ్యాంశాలలో తెలుగు వ్యాస రచనకు వీలుకల్పించి పరీక్షలలో గ్రాంధికంలోనైనా, వాడుక భాషలోనైనా వ్రాయవచ్చని 'గ్రీకు మిత్రులు' అనే గ్రంథాన్ని పాఠ్య పుస్తకంగా నిర్ణయించారు

## ఆటంకాలు

'ఆంధ్ర సాహిత్య పరిషత్' ఆయన ఉద్యమానికి అడ్డుగోడయై నిలిచినా ఆత్మవిశ్వాసంతో ఉద్యమాన్ని ఉధృతం చేశారు ఆయన భాషా తత్వాన్ని కూలంకషంగా పరిశీలించిన పండిత ప్రకాంతుడు శిష్టా వ్యావహారికంలో గ్రంథ రచన సాగించాలని, భాషలోని శబ్దర్థాలు పరిణామం చెందుతాయని గ్రాంధికవాదులు ఈ మార్పును స్వీకరించాలని అభిప్రాయపడ్డారు. 1913లో "ఎ మెమొరాండమ్ ఆన్ మాడర్న్ తెలుగు " అనే పుస్తకాన్ని ప్రచురించారు.

1916లో కొవ్వూరులో ఆంధ్ర సారస్వత వార్షికోత్సవసభలో గిడుగు వారికృషిని వీరేశ లింగం పంతులుగారు ప్రశంసించారు కూడా ఆ సంవత్సరంలోనే 'వర్తమానాంధ్ర భాషా ప్రవక్త సమాజం' స్థాపించబడి గిడుగువారు అధ్యక్షులైనారు ఫలితంగా వ్యావహారిక భాషావాదులకు ఒక వేదిక లభించినట్లయింది 1919లో పర్లాకిమిడి నుండి 'తెలుగు' అనే పత్రికను తన సంపాదకత్వంలో ఒక ఏడాదిపాటు నడిపి ఆంధ్ర వచన రచనా మార్గాన్ని వాడుక భాషవైపు మళ్ళించారు

1931-36 మధ్య కాలంలో సవర భాష వ్యాకరణం, ఇంగ్లీషు-సవర, సవర-ఇంగ్లీషు నిఘంటువు వెలువరించి 1934లో ప్రభుత్వంచే 'కైజర్-ఇ-హింద్' స్వర్ణపతకంతో ఆయన సన్మానింపబడ్డారు

సుమారు మూడు దశాబ్దాలపాటు తెలుగు భాషకు ఎనలేని సేవచేసి భాషా విప్లవకారుడుగా కీర్తింపబడిన గిడుగు రామమూర్తి పంతులుగారు 1940 జనవరి 24న కన్నుమూశారు నేడు తెలుగు భాష సామాన్యుడికి సైతం అర్థమయ్యే విధంగా వాడుక భాషలో విజ్ఞానాన్ని పంచిపెడుతున్నదంటే అది గిడుగు వారి కృషి ఫలితమే!



# ప్రశ్నావళి
## -కె. రామలక్ష్మి

**ఎ ఎస్ రామారావు సికంద్రాబాదు**

మీరు సోమరిపోతు తనాన్నెలా నిర్వచిస్తారు రామలక్ష్మగారూ'

★ ఏదో పనిలేక పోవడం- సోమరిపోతు తనమూ కాదు విశ్రాంతి కాదు రావుగారూ కాళీ మెదడు చాలా బాధపడే మెదడు మరిచి పోకండి అందుకే మెదడుకి మేత అవసరం- లేకుంటే అది- దురూహలకి ఆలవం అవుతుంది- (కుళ్ళు నీటిగుంటలో పురుగులు చెరడం సహజం కదా') అంతేకాదు- సోమరితనం నత్త నడకలు నడుస్తూండగానే లేమి ఉరకలూ పరుగులూ తీస్తూ- తోసుకు వస్తుంది (అందుకే కబోలు- బుర్రకి పదునెట్టు లేకుంటే పాపపు వూహలు వస్తాయని హెచ్చరించేవాడు మా పెద మామయ్య కాని ఆయనెప్పుడూ హాయిగా నిశ్చింతగా వుండేవాడు')

**ఎ కె జోసెఫ్, నందికొట్కూరు**

రచయితలు తమ రచనల ద్వారా సమాజాన్ని నేటి ఆదునిక కాలంలో ఎవిదంగా ప్రబావితం చేయకల్గు తున్నారు?

★ ముందు వారు ప్రబావితులవు తున్నారు కదా? సమాజం కూడా కావాలా? అని అడుగుతారు నేటి రచయితలు కీర్తి కనకం వీటికి మించిన ప్రబావితం చేయగలవింకేముంటాయి? అని అడిగినా- నేను ఆశ్చర్యపడను

**ఎ శ్రీధరాచారి జ్యోషి, అయిజ**

పత్రికలు మానె కనీసం నోటుపుస్తకాలపైనైనా గ్లామరస్ సినీతారలను పక్కకు నెట్టి నెహ్రూ సరోజిని నాయుడు వంటి ప్రముఖుల చిత్రాలను ప్రచురించవచ్చు గదా వారి ఉద్దేశ్యం?

★ నేటి బాలురు- రేపటి యువకులు- అని నోటుపుస్తక విక్రేతలకి తెలియదా ఏమిటి?' అయినా పెద్దలనెందుకు- కవర్ల మీద వేసి- మీసాలెట్టి గెడ్డాలెట్టి నా నా రాతలూ రాసి అపభ్రంశం చేయడం? కొందరు పత్రికల ముఖ చిత్రాలపై చూపే కళాబిలాష మీరెప్పుడూ చూడరా?

నేటి సీరియల్స్ అన్నీ సినిమాలుగా వెలువడు తున్నాయి మీరేమంటారు?

★ అవి సినిమా సీన్లే సినిమాలో నిముషం రెండు నిముషాల సీను- ఓ వారం లాగించేయవచ్చు' అందుకే సినిమా తీసేయడం పూర్తి అయినా ఒకొక్కప్పుడు సీరియల్ ముగించడానికి యిబ్బంది పడుతున్నారు' అయినా- ఏ రాయి అయితేనేంసార్ పళ్ళూడగొట్టుకుందుకు?

**జి వి రామవేంద్రరావు, మచిలీపట్నం**

మీ మీద మీ అబిప్రాయం ఏమిటి?

★ నా మీద నాకు అబిప్రాయం లేదుగాని- నమ్మకం వుంది అది చాలదా హాయిగా బ్రతకడానికి?'

ఈ ప్రశ్నావళి ఎప్పటి నుంచి నిర్వహిస్తున్నారు?

★ 63-64లో ప్రారంబించానేమో జ్ఞాపకం లేదు

**టి గౌరికుమారి, పొందూరు**

ఓర్పు అంటే ఏమిటి?

★ ఎవరి దృష్టిలో?'

ఓర్పుకి సహనానికి తేడా ఏమిటి?

★ ఓర్పు లక్షణం సహనం అలవాటు

ఈనాటి అమ్మాయిలకి ఓర్పు సహనం ఎంతవరకు వుంది?

★ అవసరానికి మించి వుంది అందుకే- వారికి అన్ని కష్టాలు'తరతరాలుగా పాతుకుపోయిన వీటి కష్టడి నుంచి తప్పించుకోడం- అంత సులబం కాదు ఓసారి నేర్చిన మెదడు- అవి ఓ పట్టాన మరిచిపోలేదు కద'

**ఎ బాబీరామం, విశాఖపట్నం**

న్యూస్ ప్రింట్ కొరత వల్ల ప్రశ్నావళికి యిబ్బంది రాకూడదని కోరిక మీరేమంటారు?

★ అంత కష్టం వస్తే అడపాదడపా రాస్తా- మరేం మునిగి పోదు సార్ గాబరా పడిపోకండి గాబరా పడే తత్వం కాదునాది

**పి సత్యనారాయణ, వరంగల్**

ఆర్ టి సి బస్సుల్లో స్త్రీల కొరకు సీట్లు కేటాయించడం చూస్తుంటే వాళ్ళు అబలలె అని నిరూపిస్తున్నట్లుగా అనిపిస్తుంది నాకు మరి మీకు?

★ ఈ పురుషులు స్త్రీ పట్ల ఎంత నీచంగా ప్రవర్తించక పోతే- యిలాంటి ఏర్పాట్లు చేస్తారు? అనిపిస్తుంది చిన్న చిన్న సభ్యతలకు సహితం స్వస్తి చెప్పి జుగుప్సా కరంగా ప్రవర్తించే- నాటి మనిషిని - ఏమనాలి అనిపిస్తుంది

**టి రవిందర్ రెడ్డి, వరంగల్**

ఉద్యోగం చేస్తూ ఇంట్లో వంట చేసే స్త్రీని ఆదర్శ బావాలు గల వ్యక్తిగా వూహించాలా?

★ వంట చేసుకోవడం ఉద్యోగం చేయడం తప్పు కాదు కాని ఈ రెండూ చూస్తూ ఉద్యోగం వల్ల ఆర్థిక స్వామతనీ వంటవల్ల తృప్తినీ కూడా పొందలేకుండా వున్న వేలాది స్త్రీల ఆదర్శం గురించి కాస్త ఆలోచించవలసిన - సమయం యిది

**గోడబ రమేష్ పట్నాయక్, రాయగడ**

మత కలహాలకి మూల కారకులు ఎవరు?

★ అయా మత పెద్దలూ రాజకీయ వేత్తలూ- తమతమ పబ్బం గడుపు కొందుకు - చిల్లర కలహాలు లేవతీస్తారు

**పి చాముండేశ్వరి, శ్రీకాకుళం**

మా అబిమాన కలువబాలలో మీ సీరియల్ నన్ను వెళ్ళిపోనీరా రియల్లీ పెంటాస్టిక్ ఈ నవలలో ప్రతి పాత్రనూ సజీవ శిల్పంగా తీర్చి దిద్దిన మీకు అబినందనలు

★ అయ్య బాబోయ్ ఒక బాగం చదవగానే - యిలా రాసేస్తే నాకు బయం సోదరీ పూర్తిగా చదివి ఉత్తరాలు రాస్తే సంతోషం నేను - ప్రతి పంక్తి అబినందనలు బరించలేను' నేనంత గొప్ప రచయిత్రిననీ నేను అనుకోవడం లేదు నాకు తెలిసిన నేననుబవించిన నా వూహకు అందిన పరిశీలనలను మాత్రమే నేను పిక్షన్‌గా రాయకల్గాను యిప్పటి దాకా అలాగే యిదీ- ఇది ఓ తల్లి మోష విని చెప్పండి సంతోషిస్తా ●

## "ప్రశ్నావళి" పాఠకులకు

★ మీ ప్రశ్నలు కార్డుమీదే రాసి వాటిని ఎడిటర్ ఆం స వా ప ' గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి -పైన ప్రశ్నావళి అని వ్రాయాలి

★ ఒకరు రెండు ప్రశ్నలకన్నా ఎక్కువ పంపరాదు పూర్తి చిరునామా వుండాలి

★ నలుగురూ సరదాగా చదువుకొనే విదమైన ప్రశ్నలు ఒకటి లేదా రెండు మాత్రం చాలు' మీ పేరు, వూరూ పత్రికలో వేస్తామని మరిచిపోకండి మారుపేర్లు తగవుగాక తగవు' ఎడిటర్‌దే తుది నిర్ణయం

-ఎడిటర్

సీరియల్

# వజ్రసంకల్పం

## సాతవాహన

(గత సంచిక తరువాయి)

చిన్నోడు కాపాడమంటూ పెట్టిన కేక అంత కోలాహలంలో కూడా వినిపించింది వాళ్ళకు

"ఆగండి! వోరిదా గొంతు?" అరిచాడు సింగన్నదొర

"సిన్నోడిదై వుండాల!" సమాధానంగా ఎవరో అరిచారు

వెంటనే పులిగాండ్రించిన శబ్దం, దాని వెంటనే ఎవరో భీకరంగా చేసిన సింహనాదం వినిపించాయి

సింగన్నదొర చకితుడైపోయాడు

> పసిపాప క్రం తగిలబడుతుంటే,
> పాపం క్రౌర్యం విరిగబడుతుంటే,
> తిరగబడుతుంది మానవమస్తిష్కం!
> పుట్టుకొస్తుంది వజ్రసంకల్పం!!

అతనేదో చెప్పబోతుండగానే మరోసారి పులిగాండ్రించిన శబ్దం, మరోసారి ఆ సింహనాదం వినిపించాయి

ఈసారి ఆ సింహనాదానికి సింగన్నదొర గుండెఝల్లుమంది

"పదండి! ఏం జరుగుతాందో సూద్దాం!" అరిచాడతను

మళ్ళీ కోలాహలం చేసుకుంటూ ఆ శబ్దం వినిపించిన వైపుకు అందరూ పరిగెత్తారు

మరోసారి సింహనాదం వినిపించింది దగ్గర్లో ! చాలా దగ్గర్లో ! క్షణాల్లో చేరుకున్నారా ప్రదేశాన్ని

చేరుకుంటూనే పిడుగుపాటుకు గురైన వాళ్ళలా అదిరిపడి ఎక్కడివాళ్ళక్కడ ఆగిపోయారు అందరి కాళ్ళూ నేలకంటుకుపోయాయి మహాశ్చర్యంతో అందరినోళ్ళూ తెరుచుకున్నాయి

ఆ క్షణంలో వాళ్ళు చూసిన మహాద్భుత దృశ్యం జీవితంలో ఎప్పుడూ చూడనిది!

కల్లో కూడా వూహించలేనిది!

ఎవరికి వాళ్ళు మహాశ్చర్యానికి గురై కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయారు!

***

పులి తనమీదికి లంఘిస్తూనే ఆ వజ్రకాయుడు కల్లోకూడా చిన్నోడు వూహించలేని సాహసం చేశాడు

పులిగాల్లోకి లేచిందో లేదో తారాజువ్వలా ముందుకు దూసుకుపోయాడు

ఇంతవరకూ సాగిన కథ-10 • విశ్వదరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిలో బావి త్రవ్వుతుండగా అపురూపమైన వజ్రం దొరుకుతుంది అతని దాయాది అయిన వజ్రపాణి విశ్వదరవర్మ కొడుకు రాజేంద్రవర్మను, అతని కుటుంబాన్ని దారుణంగా చంపి ఆ వజ్రాన్ని కాజేస్తాడు విశ్వదరవర్మ చిన్నకొడుకు నరేంద్రవర్మపై హత్యా నేరం మోపబడి ఉరిశిక్షపడుతుంది నరేంద్రవర్మ భార్య కౌసల్య మగబిడ్డను ప్రసవిస్తుంది మనవడు పుట్టిన ఆనందంలో విశ్వదరవర్మ ధైర్యం పుంజుకొని వజ్రపాణి అంతం చూస్తానని బెదిరిస్తాడు ఒక గూడెంలోని చిన్నోడు- మరో గూడెంలోని సిన్నమ్మ ప్రేమించుకుంటారు ఒకనాడడవిలో సరసాల్లో వున్న ఈ జంటను పులి చంపబోగా వజ్రకాయుడొకడు అడ్డుపడతాడు

ఆ మరుక్షణం పులితో సమానంగా ఆకాశంలో కెగిరాడు

పులి గాల్లో వుండగానే కండలు తిరిగిన అతని చెయ్యి పైకిలేచింది

ఉత్తర క్షణంలో పులితోక అతని ఉక్కు పిడికిలిలో చిక్కిపోయింది

అతని కాళ్ళు తిరిగి నేలమీద ఆనేసరికి పులి భయంకరమైన ఆర్తనాదం చేస్తోంది

భయం !

అద్భుతం !!

మహాశ్చర్యం !!!

చిన్నోడు వూపిరి పీల్చుకోవడం మర్చిపోయాడు

సరిగ్గా అదే సమయంలో గూడెం ప్రజలు అక్కడికి చేరుకున్నారు

రాగానే వాళ్ళకెదురైన దృశ్యం !

ఎదురుగా మేరుపర్వత శిఖరంలా కనిపిస్తున్న ఓ వజ్రకాయుడు!

మానవ రక్తం రుచిమరిగిన బ్రహ్మాండమైన పెద్దపులిని అవలీలగా రెండు చేతుల్తోనూ తోకపట్టుకుని గాలిలో గిరగిరా తిప్పేస్తున్నాడతను!

అతని చేతుల్లో చిక్కుకుని ప్రాణాలకోసం భయానకంగా అరుస్తోంది పెద్దపులి!

ఎక్కడి వాళ్ళక్కడ శిలాప్రతిమల్లా నిలబడిపోయి చూస్తుండగానే అతను పులిని అలాగే గిరగిరా తిప్పుకుంటూ వెళ్ళి ఎదురుగా వున్న, మర్రిచెట్టు మొదలుకేసి భీమబలంతో ఫెడీమని మోదాడు

అంతే! పెద్దపులి చివరిసారిగా మహావికృతమైన ఆర్తనాదం చేసింది

అంతటి మర్రిచెట్టు ఒక్కసారిగా వూగిపోయింది

చెట్టుపై నుంచి ఎండుటాకులు జలజలా రాలిపోవడం మొదలెట్టాయి

పెద్దపులి తల ఫెటేల్మని పగిలింది

దాని శరీరంలోని ఎముకలు నజ్జునజ్జయిపోయాయి

ఒక్కవూపులో అతను దాన్ని దూరంగా విసిరికొట్టాడు

పెద్దశబ్దంతో నేలమీద కూలిపోయేవేళకు అది పెద్దపులికాదు-పెద్దపులి మృతకళేబరం!

ఆ కళేబరాన్ని విసిరేస్తూనే ఆ వజ్రకాయుడు విజయోత్సాహం పట్టలేక ఒక్కపెట్టున సింహనాదం చేశాడు

గుండెలు జలదరించేలా అతను చేసిన సింహనాదానికి గూడెం ప్రజలు నిలువెల్లా కంపించిపోయారు

ఎక్కడి వాళ్ళక్కడ ఆయుధాలు పారేసి ఎవరో తెలియని ఆ అజ్ఞాతవ్యక్తిముందు హాహాకారాలు చేస్తూ ఒక్కుమ్మడిగా మోకరిల్లారు

"కాపాడు పులిరాజా !"

"కాపాడు కాపాడు !"

ఆ వజ్రకాయుడ్ని పులిరాజుగా సంబోధిస్తూ వాళ్ళు చేసిన హాహాకారాలతో ఆ అడవంతా ప్రతిధ్వనించినట్లైంది

వాళ్ళు తిరిగి లేచి చూసేసరికి అతనక్కడలేడు

అతను వెళ్ళిపోయిన మార్గాన్ని సూచిస్తూ చెట్లకొమ్మలు ఇంకా వూగుతూనే వున్నాయి

గూడెం ప్రజలు ఒకరిమొహం ఒకరు చూసుకున్నారు

గుర్తుతెలియని ఆ వజ్రకాయుడు ఎలా ప్రత్యక్షమయ్యాడో అలాగే అదృశ్యమైపోయాడు!

ఎవరా—పులిరాజు?

***

బ్రహ్మాండమైన ఆ కొండరాయి మీద నుంచి ఒక్కగెంతులో కిందికి దూకాడతను

ఆ కొండరాయి కవతల నోరు తెరుచుకు చూస్తూన్న గుహ వెన్నలవెలుగులో భయంగొలుపుతోంది

ఎత్తైన బండరాళ్ళకవతల దాగిపోయి వుండడం వల్ల ఆ గుహ కొంచెం దూరం నుంచి చూసేవాళ్ళెవరికీ కనిపించదు

తెలియని వాళ్ళెవరైనా అక్కడికొస్తారా అన్నది సందేహమే

ఘోరమైన నిర్మానుష్య ప్రదేశమది

పూర్తిగా కొండప్రాంతం

ఎటుచూసినా భయంకరమైన శిలలు

పొరపాటున ఎవరైనా ఆ ప్రదేశంలో ఒంటరిగా చిక్కుబడిపోతే ఆ శిలల గాంభీర్యం చూసి కళ్ళు తిరిగిపోవలసిందే

అడివిదాటి అతనా ప్రదేశం చేరుకునే వేళకు రాత్రి బాగా పొద్దుపోయింది

వెన్నెల వేళ గుహదగ్గరికి తిరిగొచ్చాడు

అయినా అతనా ప్రదేశం చేరుకోవడానికి వెన్నెలతో పనిలేదు చీకట్లోకూడా నిర్భయంగా ఆ నిర్మానుష్య ప్రదేశంలో ఒంటరిగా సంచరించగలడు

వెన్నెల అతని వజ్రకాయం మీదపడి తళతళా మెరుస్తోంది

బండరాయిమీదనుంచి దూకగానే అతను ఠక్కున ఆగిపోయాడు

ఆమడ దూరంనుంచే ప్రమాదాన్ని పసిగట్టగల అతని సిక్స్త్ సెన్స్ అతన్నేదో హెచ్చరించింది

చప్పున నేలమీదకి వంగి పరీక్షగా చూశాడు

కొండరాళ్ళమధ్య అక్కడక్కడా తన ఇష్టానుసారం పెరిగిన రెల్లు నలిగినట్లుగా తోచింది

అతను వూపిరి బిగబట్టి నెమ్మదిగా లేచి నిలబడ్డాడు

తనకంటే ముందే అక్కడికెవరో వచ్చారు

నడుముకు వేలాడుతున్న కత్తి సర్రున బయటికి లాగి ఎలాంటి ప్రమాదాన్నయినా ఎదుర్కొనేందుకు సిద్ధపడుతూ జాగ్రత్తగా ముందుకు నడిచాడు

అక్కడ్నించి చూస్తే గుహలోపలంతా చీకటిగా కనిపిస్తోంది

అతని శరీరంలోని కండరాలన్నీ ఎక్కడికక్కడ బిగుసుకున్నాయి



కళ్ళు నిశితంగా చుట్టుప్రక్కల పరిసరాలను గమనిస్తున్నాయి

సరిగ్గా గుహాలోపలికి అడుగు పెడుతుండగా జరిగిపోయింది

ఎలాంటి హెచ్చరిక లేకుండా గుహాలోపల్నుంచి వసురుగా ముందుకు దూసుకొచ్చేశారు వాళ్ళు

ఒకరు కాదు ఇద్దరుకాదు - నలుగురు బ్రహ్మరాక్షసుల్లాంటి వస్తాదులు

వెన్నెల్లో వాళ్ళ శరీరాలు నల్లగా మెరుస్తున్నాయి

చూడగానే అడవి దున్నలు గుర్తుకొస్తాయి-కొమ్ములే తక్కువ!

ఒక్కొక్కడి చేతిల్లో బరువైన ఇనపగుళ్ళు. కట్టిన పొడవాటి సంకెళ్ళు యమపాశాల్లా కనిపిస్తున్నాయి

వాళ్ళలో మొదటివాడు బయటికి దూసుకొస్తూ ఇనపగుండు గిరగిరా తిప్పకుంటూ వచ్చి అతనిమీద విసురుగా ప్రయోగించాడు

అతని ఛాతీని బలంగా తాకిందా ఇనపగుండు

పెద్దగా శబ్దం వినిపించింది

ఉక్కును ఉక్కు ఢీకొన్న శబ్దం!

సామాన్యుడెవరికైనా ఆ ఇనుపగుండు దెబ్బ తగిలినట్లైతే భళ్ళున రక్తం కక్కుకునేవాడు

కానీ, అతనా దెబ్బను ఎంతమాత్రం ఖాతరు చెయ్యలేదు

మొదటి దెబ్బ ఎప్పుడైతే అతని శరీరం మీద పడ్డదో ఆ మరుక్షణం మిగతా ముగ్గురూ ఒకేసారి ఇనపగుండ్లతో అతనిమీద దాడిచేశారు

కొండమీదనుంచి బండరాళ్ళు దొర్లిపడుతున్నట్టుగా శబ్దం!

అతనెంత మాత్రం లెక్కచెయ్యలేదు

ఎడమచెయ్యి ముందుకు చాచి తనవైపుగా దూసుకొస్తున్న ఓ ఇనపగుండు సంకెలను ఒడిసిపట్టుకుంటూ అదే వూపున ఒక్కగుంజు గుంజాడు

ఆ వూపుకు తట్టుకోలేక ఓ అడవి దున్న అతని మీదికి తూలిపోయాడు

అంతే!

అమాంతం అతన్ని రెండు చేతుల్తోనూ అవలీలగా పైకెత్తేశాడతను

ఎత్తుతూనే ఎదురుగా వున్న ముగ్గురి మీదికి విసిరి పారేశాడు

వెర్రికేక పెట్టుకుంటూ తన ముగ్గురు సహచరుల మీదికి వెళ్ళిపడ్డాడా అడివి దున్న

# గోరింటాకు

సుసాంప్రదాయాలకు నిలయమైన మన భారతదేశంలో- మహిళలకు గోరింటాకు ప్రీతి పాత్రమైన అలంకరణ సాధనం మహిళలు, సౌభాగ్య చిహ్నముగా భావించి మక్కువతో చూడముచ్చటయిన రీతిలో, అందమైన తమ అరచేతులకు అలంకరించుకునే 'గోరింట' ఒక అలంకరణప్రాయమైనదిగానే కాక అనేక విశిష్టతలను సంతరించుకున్న ఒక ప్రాముఖ్యతా వస్తువుగా దాని వివరాలను మనము తెలుసుకోవలసియుంది

## చరిత్ర - విశిష్టత

మన భారతదేశ వనితల వరప్రసాదం గోరింట ప్రకృతి మనకు ప్రసాదించిన కొన్ని వరాలలో ఒక గొప్ప వనమూలికగా కూడా గోరింటను చెప్పవచ్చు ఆయుర్వేద పితామహుడు శుశ్రుతుడు మొదటగా దీని విశిష్టతను మొత్తం గోరింట ఆకు మాత్రమే ఉపయుక్తమైనదిగా కాక దాని చెట్టుయొక్క ప్రతి భాగము ఆయుర్వేదపరంగా ఎన్నో విలువలను కల్గియున్నట్లు గ్రహించి దాని ఉపయుక్తములను లోకమునకు చాటిచెప్పియున్నారు గోరింట ఆడవారికి అలంకరణ ప్రాయమైనదైతే, అటు మొగవారికి కూడా అనేక విధములుగా ఆరోగ్యమును యిచ్చునదిగా మనకు తెలియుచున్నది గోరింట చెట్టులోని ఒక్కొక్క భాగం ఒక్కొక్క విలువను కల్గియున్నట్లు శాస్త్రజ్ఞులు వారి పరిశోధనలలో తేల్చిచెప్పియున్నారు ఆ విధంగా గోరింట పంటినొప్పిని నివారించేదిగా, అటు కొన్ని మందుల తయారులో ఒక భాగంగా, యింకో విధంగా హైర్‌డైస్ తయారులలో కూడా ప్రాముఖ్యత కల్గియుండి అనేక సుగుణాలను కల్గియున్న అతిముఖ్యమైన వనమూలికగా గోరింట విరాజిలుతున్నది మనదేశ వనితాలోకపు సౌభాగ్యపరమైన అలంకరణ చిహ్నంగా కూడా ప్రఖ్యాతి చెందియున్నది అటువంటి గోరింటను మన వనితాలోకం ఎట్లా తమ చేతులకు అలంకరించుకోవాలి మొదలగునవి యిప్పుడు తెలుసుకుందాము

## అలంకరణ

మన జీవన సంస్కృతిలోని అరువది నాలుగు కళలలో స్త్రీలు తమ అరచేతులకు, అరికాళ్ళకు గోరింట అలంకరించుకోవటం కూడా ఒక ప్రధాన కళ అని చెప్పక తప్పదు స్త్రీల కోమల సుకుమారమైన అరచేతులకు ఈ గోరింట పెట్టుకున్నప్పుడు ఎంత అందాన్ని, కంటికింపైన రంగును, కలిగిస్తుందో మనం చూస్తున్నప్పుడె తెలుస్తుంది



# Sonia గోరింటాకు




MOISTURE PROOF(POLY PACK)

Phone - 63751




ఎర్రగా పండి, మంచి ఆకృతులలో మహిళలు అలంకరించుకున్నప్పుడు వారి అందం రెట్టింపు యినుమడించి, మంచి సౌందర్యవతులుగా అగుట మనము చూస్తూ ఉంటాము-

ప్రపంచంలో గోరింట వాడకం ప్రాచీన కాలము నుండి వచ్చుచున్నది సుమారు 5 వేల సంవత్సరములకు పూర్వమే 'మమిస్' యొక్క చేతివ్రేళ్ళు, గోళ్ళు, కేశములు గోరింటతో అలంకరింపబడియున్నట్లు చరిత్రమబట్టి తెల్సుకున్నాము 12వ శతాబ్దంలో మొగలాయి చక్రవర్తుల కాలం నుండి కూడా దీని వాడకం మరీ ప్రాచుర్యం పొందిందనడంలో సందేహంలేదు రాజస్థానీలు, రాజపుత్రులు, గుజరాతీలు, ముస్లింలు, హిందువులు, ఒకరేమిటి దీనిని ఎంతో మక్కువతో కోరుకుని మరీ పెట్టుకుంటారు ఆ విధంగా తమ సౌభాగ్య, సౌందర్యాలను యినుమడింపచేసుకుంటున్నారు ముఖ్యంగా రాజస్థానీలు, గుజరాతీలు, దీనిని అలంకరించుకోవటంలో కొత్త ఒరవడులను సృష్టిస్తూ మొత్తం దేశప్రజలకు దీనిమీద మక్కువ కలిగేలా వారు రకరకాల డిజైన్సును సృష్టించి, ఎక్కువ సౌందర్యాని యిచ్చేదిగా దీనిని తీర్చిదిద్దారు-

వాడే విధము

ముందుగా గోరింటాకు పొడి తీసుకుని అందులో 2 చుక్కలు నిమ్మకాయరసం కలిపి- కొద్దిగా టీ లేదా కాఫీ డికాషన్ నీళ్లు కలిపి, మిశ్రమం చేయాలి ఈ మిశ్రమాన్ని కనీసం ఒకగంట నానపెట్టాలి. ఆ తర్వాత దీనిని ప్లాస్టిక్‌తో తయారైన ఒక కోన్‌లో వేసి దానిలో ఈ మిశ్రమం వేసి క్రిందిభాగం నుండి ఒకచిన్న రంధ్రం చేయాలి ఇది మీకు మార్కెట్‌లో సులువుగా దొరుకుతోంది దీనిని, మీరు ఇంట్లో వాడే ప్లాస్టిక్ పాలసంచితో తయారు చేసుకోవచ్చు కోన్‌లో గోరింటను పొడి మిశ్రమం వేసిన తర్వాత పై నుండి ప్రెస్ చేసుకుపోతే ఇక మీ ఇష్టం ఎలాంటి డిజైన్ ఐనా తేలికే. ఇలా వేసిన తర్వాత దీనిని చక్కగా పండటానికి సుమారు 2 గంటల వరకు ఆరనివ్వండి. గోరింట అరిచేతి నుండి రాలిపోకుండా వుండుటకు నిమ్మకాయరసం మరియు చక్కెరతో చేసిన మిశ్రమాన్ని కొద్ది దూదితో ముంచి గోరింటపైన అద్దండి! పూర్తిగా ఆరిన పిదప పదునులేని కత్తితో గీకి గోరింటను తీసివేయండి! గోరింటను తొలిగించి చేతులకు ఆవనూనె వ్రాయండి! రంగు బాగా ఎర్రగా కావాలనుకుంటే సుమారు 4 గం దాకా చేతులు నీళ్లల్లో తడవకూడదు!

-సోహన్ కొఠారి

## వజ్రసంకల్పం నేపథ్యంలో...

# ఆధునిక ఆభరణాలు ఎలా తయారవుతాయి?

వజ్రాల తయారీకి వేలాది సంవత్సరాల చరిత్ర ఉంది కాలానుగుణంగా ఈ తయారీలో క్రొత్త క్రొత్త విధానాలు ఎప్పటికప్పుడువస్తూనే ఉన్నాయి భారతదేశంలో వీటితయారీ ఎక్కువగా చేతులలోనే జరిగిపోతుంటుంది వజ్రాలను కట్ చేయటం, మెరుగులు దిద్దడం, పాలిష్ చేయడం, ఆభరణాలుగా మలచడం అన్నీ చేతుల్లోనే జరిగిపోతుంటాయి పాశ్చాత్య దేశాల్లో



వీటి తయారీ ఎక్కువగా యంత్రాలపైనే జరిగిపోతుంటుంది. అతి కొద్ది చోట్ల మాత్రం ప్రత్యేకమైన డిజైన్ల తయారీకి కొన్ని జ్యూయెలరీ గృహాలున్నాయి

యూరప్‌లా పారిశ్రామిక విప్లవం రాక పూర్వం వజ్రాలు చేతి పని ద్వారానే తయారయ్యేవి పారిశ్రామిక విప్లవం రావడంతో ఒకేసారి పెద్దపెద్ద సంఖ్యలలో వజ్రాలను ముక్కలు ముక్కలుగా చేసి అమ్మడంతో మధ్యతరగతి వారికి కూడా ఈ వజ్రాలు అందుబాటులోకి రావడం ప్రారంభమైంది కొంతమంది ఉత్పత్తిదారులు ఇలా చిన్నచిన్న ముక్కలుగాచేసిన వజ్రాలను ఎటువంటి పాలిష్ లేకుండానే ఇతర కంపెనీలకు అమ్మితే వాళ్లు పాలిష్ చేసి నగల దుకాణాలకు అమ్ముతుంటారు కొన్ని యంత్రాలలోని రోలర్లు ఆభరణాలపై డిజైన్లు ముద్రిస్తాయి

చేతితో తయారయిన ఆభరణానికి మైనంతో మూసనుతయారుచేసి, ఆ మూసలో కరిగిన లోహాన్ని నింపి, తరువాత మైనాన్ని తీసివేస్తే మనం ధరించే ఆభరణం లభ్యమవుతుంది ప్రస్తుతం చాలా ఆభరణాలు ఇలా మూసల ద్వారానే తయారవుతున్నాయి

## వజ్రసంకల్పం

పెద్దబండరాయి వచ్చి మీద పడ్డట్టయ్యింది

పెద్దగా అరుచుకుంటూ నలుగురూ కుప్పకూలిపోయారు

మరుక్షణం ప్రళయకాల రుద్రుడైపోయాడతను

తన చేతికొచ్చిన ఇనపగుండు గిరగిరా తిప్పుతూ సింహనాదం చేస్తూ వాళ్ళమీద కొదమసింహంలా విరుచుకు పడబోయాడు

"శభాష్ శక్తీ! శభాష్!"

వెనుకనుంచి ఖంగుమంటూ వినిపించిన కంఠస్వరానికి వులిక్కిపడుతూ గిరుక్కున అటు తిరిగి చూశాడు

చీకటి నిండిపోయిన గుహలోంచి ఓ వృద్ధుడు కాంతి పుంజంలా అతని ముందుకొచ్చి నిలబడ్డాడు

"ఆ నలుగుర్నీ వదిలేయ్ శక్తీ! నీ శక్తి పరీక్షించడానికి నేనేర్పాటు చేసిన మనుషులు వాళ్ళు!"

ఆయన్ని చూస్తూనే అతని చేతిలోని ఇనపగుండు జారిపోయింది

"బాబా!"

చప్పున వెళ్ళి ఆయనకు పాదాభివందనం చేశాడు

ఆయన పొంగిపోతూ అతని భుజాలు పట్టుకు లేవదీసి బలంగా కౌగిలించుకున్నాడు

"నా సంకల్పం నెరవేరే రోజు వచ్చేసింది శక్తీ!" సగర్వంగా అన్నాడాయన "ఇన్నాళ్లకు , ఇన్నేళ్ళకు నేను ప్రయోగించబోయే వజ్రాయుధం సిద్ధం చేయగలిగాను దేనికోసం ఇన్నాళ్ళూ నేను నిరంతరం శ్రమించానో - దేనికోసం ఇన్నేళ్ళుగా నిరంతరం నిన్ను సానపట్టానో - ఆ శ్రమకు ఫలితం ఈరోజు నా కళ్లెదుట స్పష్టంగా గోచరిస్తోంది!"

ఆ వృద్ధుడిలో అంతటి వుద్వేగం చూడడం అతనికదే మొదటిసారి!

తన వైపతను విస్మయంగా చూడడం గమనించి ఆయన మందహాసం చేశాడు

ఆ విస్మయానికి సమాధానం తన గుండె లోతుల్లో నిక్షిప్తమైవుంది

దాన్ని వెలికితీసే సమయమింకా రాలేదు

అవును!

ఇంకా ఆ సమయం రాలేదు!

మరోసారి మందహాసం చేశాడా వృద్ధుడు

ఆయన తెల్లని బారాటి గడ్డం విజయాన్ని ఆవాహన చేస్తున్న దానిలా గాలిలో పైకిలేస్తూ రెపరెప లాడుతోంది

(ఇంకా ఉంది)



పరుగులెత్తించే పనులతో సతమతమవుతూంటే,
కాని తలనొప్పి కూడా పట్టుకుంటే...






AUG
SL. NO.
LANGUAGE
DATE

# మేరేజ్డ్!

ఆరుపల్లి గోవింద రాజులు




పది దినాలు క్యాంపు తరువాత ఆ దినమే ఆఫీసులో అడుగుపెట్టిన సత్యమూర్తికి సీట్లో హెడ్‌క్లార్కు వేంకటాచలంగారు లేకపోవడంతో ఎదురుగా కనబడుతున్న మనోహర్‌తో "మన హెడ్డుగార్కి ఇంకా టైం కానట్లుంది" పొడిగానే అన్నాడు

మనోహర్ చూస్తున్న ఫైలుని పక్కకుపెట్టి ప్రశ్నార్థకంగా మొఖంపెట్టి

"ఓహ్.... మీకు అసలు విషయం తెలియదుకదూ! అవును ఎలా తెలుస్తుంది? కర్నూలు నుండి ఈ ఊరు వచ్చి ఆరు నెలలైంది ఈ ఆరు నెలల్లో దిరిదాపు అరవైసార్లయినా మీరు క్యాంపులకి వెళ్ళివుంటారు ఇహ ఈ ఆఫీసులో ప్యూను దగ్గరనుండి ఆఫీసరువరకూ తెలుసుకోవాలంటే, ఎంతైనా వుంది!" ఉపోద్ఘాతం మొదలు పెట్టడంతో సత్యమూర్తికి చిరాకుకలిగి "గురూ! అసలు విషయం బైటపెట్టకుండానే నన్ను కూర్చోబెట్టి మరీ వాయించేస్తున్నావు!" అన్నాడు

"అయితే ఏ౦ ఈ దినం ఆయన ఇరవై ఒకటో మేరేజ్ డే! జరుపుకుంటున్న సందర్భంగా మనందర్ని పార్టీకి ఆహ్వానించారు తలా పాతిక వేసుకున్నాం మీ వాటా దివాకర్ కలిపేసాడు సాయంత్రం అందరం కలసివెళ్దాం!" అని తన పనిపాటల్లో నిమగ్నమైపోయాడు

సత్యమూర్తికి కళ్ళెదుట అర్జెంటు ఫైల్సు కనబడుతున్నప్పటికీ, మనసుని వాటిమీద లగ్నంచేయలేకపోయాడు తనలో ఏదో తెలియని అసూయ, ఆ క్షంట తన వివాహపు తొలివలపుల తలపులు గుర్తుకు వచ్చి తిరిగి మనోహర్‌తో "గురూ! మనలో మనమాట ఆయనకు ఓ ఏభై ఉండవూ?" ప్రశ్న వేశాడు

"రాంగ్ నెంబర్ గురూ! అరవై దరిదాపు "

ఆ! గతుక్కుమన్నాడు సత్యమూర్తి తిరిగి మరి ఈ వయసులో ఆయనకు సందిగ్ధంగానే అన్నాడు

మనోహర్ పకాలున నవ్వి! "గురూ! ఇందులో తప్పేముందీ! మనిషి వయసులో ఎంత ముందుకు వెళుతుంటే అంత చాపల్యం, మదుర అనుభూతిని పొందగలడు! మీకు తెలియదులా వుంది ఈ ఆఫీసులో ఇంచుమించు అందరం మేరేజ్ డేని పాటించే వాళ్ళమే! చివరకి ప్యూన్ నూకరాజు కూడా తన మేరేజ్ డేకి ఆహ్వానిస్తుంటాడు! – ఇదీ విషయం! అవును ఇంతకీ మీ విషయం !" నసిగాడు ముసిముసిగా నవ్వుతూ

సత్యమూర్తి మొఖం వికసించి పక్కున నవ్వి "అబ్బే నాకు అలాంటి అలవాట్లు లేవు!" కాస్త సిగ్గుగానే అన్నాడు

మనోహర్ ఆశ్చర్యపోయి "అరె! అలా సిగ్గు పడిపోతావేమిటి? ముసలైపోయావా? ముతకైపోయావా? ఒక్క ఎంట్రుక కూడా నెరవలేదు ముప్పై దాటావన్నా ఎవరూ నమ్మరు మారే ప్రపంచంతో బాటు మనం కూడా మారుతుండాలి గురూ! లేకపోతే ఈ సమాజం వరి వాజమ్మ అంటుంది ఈ పర్యాయం మీరు కూడా మేరేజ్‌డే పార్టీ ఇచ్చి తీరాల్సిందే!" ఖచ్చితంగా అనేశాడు

* * * *

మనోహర్ మాటలు సత్యమూర్తికి హితబోధన అయినట్లయి ఎన్నడూలేని ఉత్సాహం చోటుచేసుకొని మల్లెపూలు పొట్లాంతో ఇల్లు చేరాడు

ప్రతిదినం ఆఫీసునుండి తోటకూర కాడలా ఇల్లుచేరే సత్యమూర్తి ఆ దినం గడపలో కాలు పెడుతూనే శైలూ!' అని కేకవేసాడు ఎన్నడూ అటువంటి కేకకి అలవాటుపడని శైలజకు వినబడి, గతుక్కుమని చేతిలో వంటసామానులు పక్కకుపెట్టి బయటకు పరుగుతీసింది ఎదురుగ కనబడిన బర్త ప్రతిబింబంలో ఏదో కళ, మాటల్లో చిలిపితనం ఉషారు కొట్టొచ్చినట్లు ప్రస్ఫుటమై చిరునవ్వుతో "ఏవిటో విశేషం శ్రీవారు మొఖం మెర్క్యురీబల్బులా వెలిగిపోతోంది ' అంది కళ్ళెగరవేస్తూ

సత్యమూర్తి భార్య ప్రశ్నకు జవాబునైనా చెప్పకుండా "ఆఁ! శైలూ పిల్లలేరీ? ' అన్నాడు

శైలజ గతుక్కుమంది ప్రైవేటుకు వెళ్ళారు! ఏం?" అంది బర్త వేసిన ప్రశ్న అర్ధంగాక

సత్యమూర్తి సంచిలో మల్లెపూలు పొట్లాం తీసి "ఇవి పెట్టుకో! ' అంటూనే 'బలంకొద్దీ తన బాహుబందాల్లో బిగించేసాడు ఆ బిగువుకి తన బిగువైన వక్షోజాలు నలిగిపోయినట్లయి అబ్బా! ఏవిటా సరసం వదలండి పిల్లలు వచ్చే వేళయింది!" విడిపించుకోవడానికి ప్రయత్నిస్తూ అంది

సత్యమూర్తికి కంపరమెత్తినట్లయి "చ! ఊర్కో! మంచి మూడ్ పాడు చేసావు! ఎప్పుడూ పిల్లలూ పీచూ అంటావే తప్ప నా విరహాన్ని అర్ధంచేసుకోవు! అసలు పట్టించుకోవు!" కాస్త ఆవేశంగానే అన్నాడు

ఆ! అదేమరి! పట్టించుకోకుండానే ము గ్గు రు" పక్కున నవ్వింది

తిరిగి సత్యమూర్తి శైలజను దగ్గరగా తీసుకొని 'నీకు గుర్తుందా? వచ్చేనెల ఆరో తేదీన మన మేరేజ్‌డే!" అన్నాడు

"అయితే ఏవిటంటారూ? – పేపర్లో వేయించుకుందామా?" పరిహాసంగా అంది

"అఁహ! అంతవరకూ వెళ్ళవద్దు కాస్త గ్రాండుగా దట్‌మీన్స్ మా ఆఫీసువాళ్ళందరికీ ఓ చిన్న పార్టీ " సగంలో నే ఆపివేసాడు

## అమెరికన్ చిత్రానికి నౌషద్ సంగీతం

ప్రముఖ సంగీత దర్శకుడు నౌషద్ ఆలీ సంగీతమంటే యిష్టపడేవారు చాలామందే వున్నారు

ఇటీవల ఒక మళయాళ చిత్రానికి ఈయన సంగీత దర్శకత్వం వహించారట నౌషద్ ట్యూన్స్ ఆకట్టుకున్న అమెరికా నిర్మాత ఒకరు తను తీయబోయే ట్రయల్స్ ఆఫ్ టియర్స్ అమెరికన్ చిత్రానికి సంగీతం అందించమని కోరాడట నౌషద్ ఆ చిత్రానికి తనదైన స్వంత బాణీలను అందించేందుకు కృషి చేస్తున్నాడట

శైలజ మరొకసారిగా గతుక్కుమని "ఏమండీ మీకు ఒంట్లో బాగున్నదికదండీ?" అంది

"అదుగో ఏయ్ దొంగా జోక్‌తో దాటేయకు! నీకూ జరిపించుకోవాలనేవున్నది కదూ" అన్నాడు

"లేకపోతే ఏమిటండీ! మీరు అంటున్నమాటలు? పెళ్ళయి పదమూడు యేరేజ్‌డేలు దాటిపోయాక ఈ వయసులో పుట్టుకొచ్చిందేవిటీ? పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు వారిని కాస్త దృష్టిలో పెట్టుకొని ప్రవర్తిస్తుండండి' అంది నవ్వు పెదవిని దాటనీయకుండా మునిపంటితో నొక్కిపెడ్తూ

సత్యమూర్తి షర్టు విప్పుతూ "శైలూ! మా ఆఫీసులో హెడ్‌గార్కి ఏభై ఏళ్ళు దాటాయి!పైగా ఆయనకు మనమలు కూడా ఉన్నారట!అలాంటి వ్యక్తి ఈ దినం తన ఇరవై ఒకటో మేరేజ్‌డే జరుపుకుంటున్నపుడు లేనిది వయసులో వున్న మనం జరుపుకోవడంలో వింతేముందీ! నువ్వు ఇన్ని దినాలు లేని సంబరం ఇప్పుడెందుకువచ్చిందీ! — అన్నమాటల్లో వాస్తవం లేకపోలేదు! కాని శైలూ అప్పటి మన ఆర్థికపరిస్థితి, సంసారిక ఇబ్బందులు, ఉద్యోగంలో అంతస్థు నీకు తెలియనివి కావు!ఇప్పుడు ఏదో స్థిరపడ్డాం గనుక నా కెందుకో ఈసారి మేరేజ్‌డే జరుపుకోవాలని చాలా ఉబలాటంగా వుంది పైగా మా ఆఫీసులో అందరూ మేరేజ్‌డేలని గ్రాండుగా జరుపుకునేవారని ఈ దినమే తెలిసింది నువ్వు అనవసరంగా కలవరపడిపోకు! సింపుల్లో సింపుల్‌గా అంటే పిల్లలకు కూడా పొక్కనీయకుండా జరుపుకుందాం" అన్నాడు

శైలు భర్తని ఒక్కసారిగా నిరుత్సాహపరచడం ఇష్టలేక చూద్దాం' అంది

నెలదినాలు గిర్రున తిరిగాయి

ఆదినం ఐదో తారీకు రేపు సత్యమూర్తి కలలుగంటున్న మేరేజ్‌డే! అందుకే అన్నాడు ఆదినం ఆఫీసుకు వెళ్తూ శైలజతో "ఆఫీసు నుండి వచ్చిన వెంటనే మార్కెట్టుకు వెళ్దాం!రేపటికోసం నీకు పట్టుచీర!" అంటూనే ఆమె పెదవుల్ని చూపుడువేలుతో రాసాడు

శైలజ గుండెలు గుబేలుమని "అయ్యో రాతా!ఇదేం ఊహించని సమస్య వచ్చిందండీ! కిరణ్‌కి బూట్లు చిరిగిపోయావని రోజూ స్కూలుకు వెళ్ళనంటూ ఒకటే మరాం చేస్తుంటే సర్దుకుపొమ్మని నచ్చచెప్పుకు పస్తున్నాను దివ్యకి ఉన్నవి రెండేరెండు

## నాదేశం – నేను

క్యాపిటలిజమ్ ఒకవైపు
కమ్యూనిజమ్ ఒకవైపు
మధ్య నలుగుతోంది నాదేశం!
ఉన్నవాళ్ళు ఒకవైపు
లేనివాళ్ళు ఒకవైపు
మధ్య నలుగుతున్నా నేను!
నాదేశంలో ప్రజాస్వామ్యం వుంది
నాలో మధ్యతరగతి బ్రతుకుంది!

— కె సురేంద్రనాథ్

జతల బట్టలు అసి ఇంకేదో అనబోతుండగా సత్యమూర్తి మద్యలో నే త్రుంచివేయాలనుకొని 'అబ్బా శైలూ!నువ్వు నన్ను మరీ నిరుత్సాహపరిచేస్తున్నావు! పోని అవన్ని వాళ్ళకి కొనిపెడతాను నువ్వు ఈ విషయంలో ఇప్పటికైనా రాజీపడు! మనకి ఎలాగూ రెండు గదులు ఉండనే వున్నవి" మాటలు పూర్తికాకుండానే పిల్లల కాళ్ళ బూట్లు చప్పుడు విని గుప్‌చుప్ అయిపోయారిద్దరూ!

* * * * *

ఆ దినం సత్యమూర్తి ఆఫీసు నుండి ఇల్లు చేరగానే భార్య పిల్లల ని తీసుకొని మార్కెట్టుకి వెళ్ళి కావలసినవన్ని కొన్నాడు

ఒక్క సత్యమూర్తి తప్ప అందరూ నిద్రాదేవి ఒడిలో జారుకున్నారు సత్యమూర్తి ఆలోచిస్తున్న కొలది తన శైలజ ప్రతిబింబం తన కళ్ళెదుట మయూరిలా నాట్యం చేయసాగింది అభిసారిక కన్నెలా కవ్వించసాగింది ఆ ఆలోచనలు తనని పిచ్చివాడిని చేసాయి ఎంత వేగరం తెల్లవారుతుంది తన శైలు అందచందాలు ఎలా జుర్రుకోవాలి'— అన్న ఆలోచనలతో అర్థరాత్రి గడిచింది ఎప్పో ఒంటిగంట ప్రాంతంలో నిద్రపట్టింది అంతే! తిరిగి నాలుగు గంటలకు తనని ఎవరో తట్టినట్టు తెలివొచ్చింది

తను కళ్ళు విప్పి చూసేసరికి శైలజ గుండెల మీద పైట చెదిరి ఉండడంతో ఎక్కడలేని ఉద్రేకం పుట్టుకొచ్చింది ఆమె బిగి సడలని యవ్వనపు ఒంపు సొంపులు, మత్తుగా అమాయకత్వంగా వున్న ఆమె మోము తేనెలూరే పెదవులు! సత్యమూర్తిని మరింత పిచ్చివాడిగా చేసి కోరికను మరింత బలపరచాయి మెల్లగా నుదుటిపై ముద్దు పెట్టుకొని గుండెలు మీద చేయివేసి తన వైపుకు త్రిప్పుకున్నాడు

గాఢ నిద్రలో నున్న శైలజ ఆ స్పర్శకు ఊ— అని మత్తుగా మూలిగి తనని పెనవేసుకుంది సత్యమూర్తి శరీరంలో ప్రకంపన మొదలైంది అణువణువు కోరికతో ప్రజర్విల్లసాగి పెదవుల మీద ముద్దు పెట్టుకున్నాడు అప్పుడే శైలజకు ఒక్కసారిగా మెలకువ వచ్చి ' పిల్లలు ఏవిటా అల్లరి – విసుక్కొని కళ్ళు మూసుకుంది

ప్లీజ్ శైలూ కాదనకు! బ్రతిమాలాడు

కోపంగా చూసింది భర్త అమాయక మొఖం తన విసుగుదలని మెస్మరిజంలా మాయం చేసింది

భార్య బుంగమూతిని గమనించి తన వైపుకు త్రిప్పుకోబోయిన సత్యమూర్తి చేయి తగిలి ప్రక్కను ఎల్లలు కదలడం ప్రారంభించడంతో కాస్త దూరంగా

జరగక తప్పలేదు

తెల్లవారింది

సత్యమూర్తి అన్నింటిని ముగించుకొని ట్రిమ్‌గా ముస్తాబై భార్యకు ఒంట్లో బాగులేని కారణంగా శెలవు కావాలంటూ దరఖాస్తు వ్రాసి ఎదురింటి వామనరావుకు పంపించాడు

మార్కెట్టుకు వెళ్తూ 'ఇదుగో శైలూ వంటలన్నీ గ్రాండుగా ఉండాలి మరి! నేను అలా మార్కెట్టుకు వెళ్ళి రాత్రి మనకు కావలసిన సామానులు తీసుకు వస్తాను" – కసి కసిగా చూస్తూ అన్నాడు

సత్యమూర్తి మార్కెట్టులో ఒక వైపు సామానులు కొంటూ మరో వైపు రాత్రి గది ఏలా అలంకరించుకోవాలి! పిల్లలకి నచ్చ జెప్పి పెందలకడనే వాళ్ళని ఎలా నిద్రలో ముంచాలి అని ఆలోచిస్తున్నాడు ఈలోగా ఇంట్లో అడపాదడపా పనిపాట్లు చేసే చంద్రం హడావిడిగా సైకిలు దిగి "అయ్యగారూ! అమ్మగారు మిమ్మల్ని ఈ సామానులు అర్జెంటుగా తెమ్మన్నారు ఇదుగోండి చీటి" అని కాగితం అందించాడు ఆ! చెప్పడం మరచిపోయాను నాకు ఓ పాతిక దమ్‌సప్పు బుడ్లు కూడా తెమ్మన్నారండి"– అంటూనే తుర్రుమన్నాడు

సత్యమూర్తి అవాక్కయిపోయాడు ఏమిటీ దమ్‌సప్ బుడ్లా? అవి కూడా పాతికా? ఎందుకూ ఎవరి కోసం ? ఈ లిస్టులో చూస్తే కనకాంబరం మల్లెపూలు విదేశీ సెంటు బాటిలు లడ్డూలు అరటిపండ్లు తెల్లచీర ఆకులు వక్కలు పసుపు కుంకం కనబడుతున్నవి క్షణం ఆలోచించి అమ్మదొంగా ఆ మాత్రం పసిగట్టలేని అసమర్థుడు ననుకున్నావా? మేరేజ్‌డే అంటే ఎం ఇష్టం లేనట్లు నటించి నన్ను ఒక్కసారి సస్పెన్సులో ముంచెత్తేయాలనుకొని ఇవన్ని తెమ్మని పంపించావా? నీ తలపులు వలపులు నాకు తెలియవా ఏమిటి? ఊహల్లో తేలిపోతూనే మార్కెట్టు చేసి తిరుగుముఖం పట్టాడు

సత్యమూర్తి సామానులుతో బారంగా గడపలో అడుగుపెట్టేసరికి వచ్చేపోయే అమ్మలక్కలతో చాలా హడావిడిగా వుంది మూర్తిలో ఏదో కీడు సంకించి ఆందోళన చోటు చేసుకో బోతుండగా తన శైలజ నీలం రంగు పట్టుచీరతో ప్రత్యక్షమై అబ్బా! ఏవిటండీ ఇంత ఆలస్యం చేసారు అంటూనే చేతిలో సామానులు అందుకొని ముసి ముసిగా నవ్వుతూ మన దివ్య రజస్వల అయ్యింది అదీ హడావిడి" అంటూనే లోనికి వెళ్ళిపోయింది

సత్యమూర్తి గుండెల్లో బాంబు ప్రేలినట్లయి ఆ దినం తన "మేరేజ్‌డే" అన్న ఆలోచన పటాపంచలై ఇహకూతురు మేరేజ్ ఎలా? చేయగలుగుతానో! – అన్న ఆలోచనలో మునిగిపోయాడు ●

సీరియల్

# శత్రుసంహారం

లల్లాదేవి

(గత సంచిక తరువాయి)

కర్ఫ్యూ విధించిన కాళరాత్రి ఇంకా తెల్లా రలేదు

వేకువఝాము అయింది సమయం మూడు గంటలు దాటింది పోలీస్ కంట్రోలు రూంలో టెలిప్రింటర్‌లు టకటకలాడుతు న్నాయి వైర్‌లెస్‌లు ఆపరేటర్లని పదేపదే పిలుస్తూ గీజ్‌మంటున్నాయి

కారిడార్‌లో బూట్లు టకటక! సిటి పోలీస్ కమీషనర్ ఇంకా తన గదిలో కూర్చుని ఉన్నారు అదృష్టవశాత్తు కరెంట్ ఫెయిల్ కాలేదు కనిపించినవారందరిమీద మండిపడు తున్నారు కమీషనర్!

"మీకు సిగ్గులేదు మానం అభిమానం లేవు మన ఎ ఎస్ పి ని చంపి దుస్తులు మనకి పంపించారు వాటితోపాటుగా గాజులు, పసుపు, కుంకుమ పంపించారు ఇంకా ఏం చేస్తే మీకు పౌరుషం వస్తుంది ఇంతవరకు ఒక్కరిని కూడ అరెస్టు చేయ లేకపోయాం

రేపు హోంశాఖ ఉన్నతాధికారులు ప్రశ్నిస్తే సిగ్గుతో తలదించుకోవాలి ఒక ఎ ఎస్ పి మరణంతో ఆగిందా? లేదు

నగరం నాలుగు మూలాలా తగలబడు తోంది భాగ్య నగరం భస్మ నగరంగా మారిపోయింది ఈ బూడిద కుప్పలమీద, శవాలమీద పోలీసులు అసమర్థులు అని శాస నాలు వ్రాయిస్తారా?

రక్తం ప్రవహించిన రోడ్లమీద పోలీ సులు చేతకానివారు అనిచరిత్రాక్షరాలు చెక్కి స్తారా?" అని అందరిమీద మండి పడుతు న్నారు కమీషనర్! ఒకవంక మిలిటెంట్స్ విసిరిన ఛాలెంజ్!

మరో వంక కమీషనర్‌గారి తిట్లు! తలలు వాచిపోతున్నాయి ఎ ఎస్ పి ని చంపిందికాక మారణ హోమం సృష్టించారు వారిని అరెస్టు చేయలేకపోతే దేశ వ్యాప్తంగా ఇంత తలవొంపులే!

నగరం నాలుగుమూలల నించి హత్యలు దహన కాండలు దోపిడీల గురించి వార్తలు వస్తు న్నాయి సంఘటనలు వందల సంఖ్యలో జరు గుతున్నాయి గుండెలు జలదరించే వార్తలు!

తెల్లవారితే నగరం గుండె పగులుతుంది ప్రజా జీవితం ఏమవుతుందో తెలియని పరి స్థితి ఏర్పడుతోంది అలాంటి సమయంలో నగర పోలీసు కమీషనర్ గొంతు చించుకుని మాట్లాడుతున్నారు

కుర్చీలో కూర్చుని చేయగలిగింది కన్పిం చలేదు నగరంలో ఫలానా చోట ఇంతమంది గాంగ్‌మాస్టర్స్ ఉన్నారనే వివరం తెలియదు వారిదగ్గర ఎలాంటి ఆయుధాలు ఉన్నాయో వివరాలు అందలేదు

అసలు వారి వ్యూహం ఏమిటో అయో మయంగా ఉంది ఏమి తెలియకుండా తాను స్వయంగా బయటకుపోవటం మంచిదికాదు క్రిందికి దిగివచ్చి మళ్ళీ పచార్లు ప్రారంభిం చాడు

డిపార్టుమెంటుకి సంబంధించని ఒక వాన్ లోపలకి దూసుకు రావటం కన్పిం చింది అక్కడే నిలిచిపోయి చూస్తున్నారు కమీషనర్

వాన్‌లోనించి క్రిందికి దిగి వచ్చాడు రాహుల్! నర్సులు కూడ బిలబిలమంటూ తలుపులు తెరుచుకుని క్రిందికి దిగారు ఎదు రుగ్గా పోలీసు కంట్రోలు రూం, నగర పోలీసు ప్రధాన అధికారి కనిపించటంతో హాయిగా ఊపిరి పీల్చుకుని స్థిమితపడ్డారు

నగర పోలీసు కమీషనర్ కనుసైగ చేయ టంతో ఒక అధికారి ముందుకు వచ్చాడు

"ఎవరు మీరంతా? ఎందుకొచ్చారు?" అని అడిగాడు

"వీరంతా నర్సులు! డ్యూటీ నించి తిరిగి వస్తూ దారిలో కర్ఫ్యూ విధించిన ప్రాంతా లలో చిక్కుకుపోయారు సాయం చేయ మంటే నేను తీసుకువచ్చాను" బదులు చెప్పాడు రాహుల్ కమీషనర్ యువకుడుగా అతడు చేసిన సాహసాన్ని అభినందించాడు చేయి అందించి కరచాలనం చేశాడు

"మీలాంటి యువకులు కూడ యిలాంటి సమయాలలో పోలీసులకి సహకరించాలి" అన్నాడు సంతోషంగా

అధికారి నర్సుల గురించి వివరాలు తెలు సుకున్నాడు వారు చేరవలసిన ప్రాంతాలను అడిగి వ్రాసుకున్నాడు

సమయం యిప్పుడు నాలుగు గంటల యింది మరో రెండు గంటల తరువాత ప్రశాంత పరిస్థితులు నెలకొంటాయి అప్పుడు

ఇంతవరకూ సాగిన కథ-11 పరమవీరచక్ర అవార్డు అందుకున్న మహేష్‌చంద్ర కొడుకు రాహుల్ వైమానిక దళంలో పైలెట్‌గా చేరుతాడు తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణిస్తారు కుమార్తె సుషమ్మ దగ్గరున్న ఎలక్ట్రానిక్ ఇండికేటర్ వంటి పరికరం వల్లనే సంపత్ మాస్టారి కుటుంబం విచ్చిన్నమైందని తెలుసుకున్న రాహుల్ తన కుటుంబ సభ్యుల మరణానికి సంబందించిన వివరాలను సేకరిస్తుంటాడు కారవెల్లీ విమాన ప్రమాదానికి సంబందించి క్రూబాక్స్‌లోని ఇండికేటర్‌ను దొంగిలించిన అలయన్స్ సంస్థపై కన్ను వేసిన ఎ ఎస్ పి కారంత్ హత్యకు గురవుతాడు హంతకుల కోసం పోలీసులు వేట ప్రారంబిస్తారు అలయన్స్ సంస్థ అదిపతి దేవీప్రసాద్ ఆదేశంపై పీయూష కిడ్నాప్ చేసన నర్సులను రాహుల్ రక్షిస్తాడు

మీరు తిరిగి మీ యిళ్లకి చేరుకోవటం శ్రేయస్కరం" అంటూవారికి సలహా యిచ్చాడు

గాలిలో దీపంలా కాకుండా ఒక క్షేమకరమయిన చోటుకు చేరుకున్నందుకు వారంతా చాలతృప్తితో ఉన్నారు పోలీసు అధికారి మాటకు అంగీకారాన్ని తెలియజేశారు రెండు గంటలు కాదు ఒకరోజంతా ఉన్నా పోలీసు కంట్రోలు రూంలో ఎలాంటి భయం ఉండదని భావించారు

కమీషనర్ రాహుల్‌ని తన వెంటలోనికి తీసుకుపోయాడు

"మీ వివరాలు చెప్పండి " అని ప్రశ్నించాడు ఆసక్తిగా!

"నా పేరు రాహుల్! ఫ్లయిట్ లెఫ్టినెంట్‌గా ఉన్నాను ఐ ఎ ఎఫ్ లో! శలవుమీద వచ్చాను వేసూ కర్ఫ్యూ విధించిన సెంటర్స్‌లో చిక్కిపోయాను ఇలా బయటపడగలిగాం" అంటూ వివరించాడు రాహుల్

"కాని చాల ప్రమాదకరమయిన సెంటర్స్ దాటి వచ్చారు దారిలో మీకు ఎలాంటి అనుభవాలు ఎదురయ్యాయి?" కమీషనర్ అడిగాడు

"సర్! మీతో చెప్పవలసింది చాల ఉంది నేను చూచినంత మేర నగరం స్మశానంలా తయారయింది ఇళ్ళు సమాధుల్లా ఉన్నాయి కాని వీధులకు వీధులు తగలబడిపోతున్నాయి హత్యలు దోపిడీలు విశృంఖలంగా జరుగుతున్నాయి

ఇదంతా సమయం దొరికింది కాబట్టి స్వార్ధపరులు యాధృచ్ఛికంగా జరుపుతున్న దమనకాండ కాదు ముందుగా పథకం వేసి చేస్తున్నదే!

ఒకచోటన నేను ఎ ఎస్ పి చనిపోవటం గురించి విన్నాను ఎ ఎస్ పి శవాన్ని తీసుకుపోయే ముందు కారులో చూచాను! వీటన్నిటితో సంబంధం ఉన్న ఒక వ్యక్తిని నేను గుర్తించగలను" అన్నాడు రాహుల్

కమీషనర్ దవడ కండరాలు బిగుసుకున్నాయి

"ఇప్పుడా వ్యక్తి ఎక్కడున్నాడో మీరు చూపగలరా? మా అధికారిని చంపి ఇంత మారణ హోమాన్ని సృష్టించినవారిని మేము క్షమించి ఊరుకోం మా డిపార్టుమెంటుతో మీరు సహకరించండి" అని అడిగాడు

"ష్యూర్! ఆ చోటు నాకు తెలుసు ఆ మురా నాయకుడు ఇప్పుడు ఒక వీధి లోనే చాల హత్యలు చేశాడు ఇళ్ళు లూటీ చేశాడు దోచుకున్నదంతా సంచులకు ఎత్తించి జీపులో పెట్టించాడు ఇంచుమించుగా ఆ వీధిలో యిళ్లన్నీ తగలబడుతున్నాయి తగినంత బలగంతో బయలుదేరితే వారిని పట్టుకో వచ్చు"







## భానుప్రియకి అవార్డు

అందాల నటి కుమారి భానుప్రియను ఆంధ్రప్రదేశ్ సినీ గోయెర్స్ అసోసియేషన్ ఈ ఏడాది ఉత్తమ నటిగా ఎంపిక చేసింది.

ప్రతి ఏడాది మాదిరిగానే ఈ ఏడాది ఈ అసోసియేషన్ తమ 19 వ వార్షిక అవార్డులను ప్రకటించింది.

ఉత్తమ నటుడిగా చిరంజీవిని, ఉత్తమ గాయకుడిగా ఎస్. పి. బాలసుబ్రమణ్యంను ఎంపిక చేశారు.

కాగా 36 వ ఫిలింఫేర్ అవార్డులలో భాగంగా నటి సుహాసినిని ఉత్తమనటిగా ఎంపిక చేశారు. కన్నడ చిత్రం 'సుప్రభాత్'లో నటనకు గుర్తింపుగా ఆమెకు ఈ అవార్డు లభించింది.

అంటూ పరిస్థితిని వివరించాడు రాహుల్.

వెంటనే కమిషనర్ అధికారులను పిలిచి కంట్రోల్ రూంలో ఉన్న బలగం వివరాలు తీసుకున్నాడు. అందరిని వెంటనే ఆయుధాలతో బయలుదేరమని ఆదేశించాడు. కంట్రోల్ రూం ఒక్కసారి చైతన్యం పుంజుకుంది. ఏమీచేయలేమనుకుని దిగాలు పడిపోయిన డిపార్టుమెంటువారు ప్రతీకారం తీర్చుకునే అవకాశం ఉందని విన్నాక జూలు విదిల్చి లేచిన సింహాల్లా విజృంభించారు.

వారంతా బూట్లు కరకర లాడించుకుంటూ వాహనాల్లోకి చేరిపోయారు. ఈలోగా కమీషనర్ ఫైర్ డిపార్టుమెంటుకి ఫోన్‌చేసి ఫైరింజన్లు రావలసినచోటు చెప్పాడు. అంతా సిద్ధమయింది.

కమీషనర్, రాహుల్ వచ్చి ముందు సీట్లో కూర్చున్నారు.

వారివాహనంతోపాటు వాహనాలన్నీ కదిలాయి.

"యూ బాస్టర్డ్! నువ్వు సాగించిన పైశాచికానికి తగిన శాస్తిచేయిస్తాను. నీ తప్పులన్నింటికి చాలినన్ని శిక్షలు ఈ రాజ్యాంగంలో లేకపోయినా తగినంత క్రూరమయిన శిక్ష పడేలా చేస్తాను" రాహుల్ మనసు వాహనాలకన్నా ముందు పరుగెడుతోంది.

* ** * ** *

అందరూ రోడ్డుమీదకి చేరుకున్నారు. ఇంకా లూటీ కార్యక్రమంలో మిగిలి ఉన్న వారిని కూడ పిలిపించాడు యిబ్రహీం!

అందరూ వచ్చి తిరుగు ప్రయాణానికి సిద్ధంగా ఉన్నారు. పడిన కష్టానికి తగినంత ప్రతిఫలం దొరుకుతున్నందుకు వారికెంతో ఆనందంగా ఉంది.

"వీధి చివర నిలిపివున్న వాన్ ఎవరో తీసుకుపోయారు. అంటే మన ఉనికి శత్రువులకు తెలిసి పోయిందన్నమాట! ఇప్పుడు సమయం కూడా నాలుగు గంటలవుతోంది. తెల్లారితే ఏం జరుగుతుందో తెలియదు, బహుశా పారామిలిటరీ దళాల వైఫల్యాన్ని సాకుగా తీసుకుని మిలిటరీ వస్తుందని అనుకోవాలి. అలా జరిగితే మనం మరింత జాగ్రత్తగా ఉండాలి. వెంటనే వెళ్ళిపోవటం మంచిదను కుంటాను" అని తన సలహా అందించింది పీయూష! యిబ్రహీం అందుకు ఒప్పుకున్నాడు.

అందరూ జీపులో ఎక్కి కూర్చున్నారు. పీయూష డ్రయివింగ్ తీసుకుంది.

"అంతా బాగానే జరిగింది. ఒక్క పని మాత్రం మిగిలిపోయింది" అన్నాడు యిబ్రహీం ఆమె ప్రక్కనే కూర్చుంటూ!

"మళ్ళీ ఎవరి కొంపలకు ఎసరు పెట్టావు?" - పీయూష యాక్సిలేటర్ త్రొక్కింది.

"మన బాస్ దేవిప్రసాద్‌ని సంతోష పరిచేందుకు ఒక మంచి అవకాశం. నేను ఒకపని చేయాలను కుంటున్నాను."

"ఆ ఘనకార్యం ఏమిటో చెప్పు" అంది పీయూష!

—"కారవెల్లి విమాన ప్రమాదంలో పరిశీలనకి పంపిన ఇండికేటర్ దొంగిలించ బడింది కదా! దాని మూలంగా దేవి ప్రసాద్‌గారి అలయన్స్‌సంస్థ చాల గొప్ప ప్రమాదంలో పడింది. బహుశా ఆ యిండికేటర్ పడకూడని వారి చేతిలో పడి రిపోర్టులు ప్రతికూలంగా వస్తే సంస్థ ఉనికి అనుమానంలో పడుతుంది. బాస్ పైకి ఎంత గంభీరంగా ధైర్యంగా ఉన్నా ఆయన మనసుని ఈ విషయం పట్టి పీడిస్తోంది. నువ్వు గ్రహించే ఉంటావు".

" అవును గ్రహించాను, ఈ విషయంలో మనం అర్జంటుగా చేయగలిగింది ఏమయినా ఉందా?"

"ఈ అవకాశాన్ని మనం పూర్తిగా ఉపయోగించు కోవాలి. ఈ కర్ఫ్యూరాత్రిని మనం మన ప్రయోజనానికి వాడుకోవాలి. మరో గంటన్నర వరకూ తెల్లవారదుకదా! ఈ సమయం చాలను కుంటాను."

"ఏంచేద్దా మంటావు?" అని అడిగింది పీయూష! అతను మరో ఘోరం తలపెట్టాడు. పథకం ఏమిటో అర్థంకాలేదు.

"ఆరోజు చనిపోయిన ఇద్దరూ కాక కారులోంచి మరో పాప తప్పించుకు పోయింది కదా! ఆ రహస్యం అక్కడే ఉండాలి" అన్నాడు ఇబ్రహీం. పీయూష విరగబడి నవ్వింది.

"కర్ఫ్యూ పుణ్యమా అని ఈరోజు నువ్వు త్రాగేందుకయినా వీలుకాలేదు కదా ఇబ్రహీం' బాగా డబ్బు, బంగారం లూఠీ చేయగలిగావు. ఆ మత్తులో మాటాడుతున్నావా? కొన్ని సంవత్సరాలుగా మనసుని తొలిచేస్తున్న సమస్య నీ నాలుగో భార్య. ఆమెను వొదిలించుకోగలిగాననే తిమ్మిరిలో మాటాడుతున్నావా?

అయిదు సంవత్సరాలుకూడ నిండని పసిపాప ఏమిటి? కోట్ల రూపాయల విలువచేసే ఇండికేటర్‌ని దాచటమేమిటి? వొంటిమీద తెలివి వుందా నీకసలు? ఇడియట్!

అనవసరపు ఆలోచనలు మాని ఇంటికి' వెళ్ళి రెస్ట్‌తీసుకో" అందామె. కాని యిబ్రహీం సమాధానపడలేదు.

"తప్పిపోయిన పాప మళ్లీ దొరికిందా?" అని అడిగాడు.

"నేను ఎంక్వయిరీ చేశాను, పాప దొరికింది. యాక్సిడెంట్‌లో బయటపడిన పాప అయోమయంలో పడి చాల దూరం నడుచుకుంటూ పోయింది. ఆ తరువాత వాళ్ళు పోలీస్ రిపోర్టు యిచ్చారు. వాళ్ళూ వెదికారు. ఎలాగైతేనేం దొరికింది. కాని ఆ పాపదగ్గర యిండికేటర్ ఉందని ఎలా అనుకుంటున్నావు?

యూఫూల్! నీ అంత తెలివిమాలిన మూర్ఖుడు ఈ ప్రపంచంలో మరొకడు

ఉండదు, మర్చిపో!" అందామె

అంతగా నోరు చేసుకుని చెప్పినా అతడు సమాధాన పడలేదు

"ఆ పాపదగ్గర యిండికేటర్ ఉండదని నువ్వు ఎలా నిర్ణయించ గలుగుతున్నావు?" అని ఎదురుప్రశ్న వేశాడు

"అవును, అంత ఖరీదయిన వస్తువు, క్రొత్తవారికి చిత్రంగా అనిపించే వస్తువు దొరికితే ఎవరికీ తెలియకుండా ఉంటుందా?"

"దేర్ యూ ఆర్! అది చిత్రమయిన వస్తువే! ఏదో పనికిరాని వస్తువు అని ఒక మూల విసిరి ఉండవచ్చు కదా! అలా జరిగినా అది ఆ యింటిలోనే ఉండి ఉండాలి ఫాలో అవుతున్నావా?"

"అర్థమయింది దురాశవల్ల నీ ఆలోచనలు పెడదారి పట్టాయని ఆ పాప తండ్రి పైలట్! అతన్ని నేను హెచ్చరించాను ఫోన్‌లో! అలాంటి వస్తువు అతని కంటపడిన సూచనలేవీ నాకు కన్పించ లేదు ఇంకా అక్కడ ప్రయత్నించాల్సిందేమీ లేదని పిస్తోంది" అప్పటివరకూ అతని దుశ్చర్యలు చూచి విసిగిపోయిన పీయూష మరో దురాగతానికి పునాది లేకుండా చేయాలనుకుంది

అతని మనసు ఆ వైపుకి పోకుండా ఆపాలనుకుంది తన అభిప్రాయాన్ని చాల ఖండితంగా చెప్పిందామె

అయినా ఆ మొండివాడి మనసు మార లేదు

"ఆ యిల్లు ఎక్కడో నీకు తెలుసుకదా?" అన్నాడు ఒక నిర్ణయానికి వచ్చి

"తెలుసు! శంకర్ కృప కాంప్లెక్స్ అయిదోనంబరు బ్లాకులో వారుంటున్నారు ఇక్కడికి చాలదూరం ఇరవై నిమిషాలు ప్రయాణం చాల చౌకులు దాటాలి పారా మిలటరీ దళాలు పొంచి ఉన్నాయి" అందామె అతన్ని నిరుత్సాహ పరచాలని ఆఖరు ప్రయత్నం చేస్తూ!

"శంకర్ కృప కాంప్లెక్స్ నాకు బాగా తెలుసు! ఇక్కడనించి మెయిన్‌లోకి వెళ్ళకుండా ఒక అడ్డదారి ఉంది నేను చెప్పిన దారిన పోనివ్వు"-అంటూ సూచనలు అందించటం ప్రారంభించాడు ఇబ్రహీం!

ఇక తప్పనిసరి కార్యక్రమం అయింది అతను చూపిన సందులు గొందులు అన్ని దాటుకుంటూ డ్రయివ్ చేసిందామె అతను చెప్పిన విధంగానే పది నిముషాల్లో ఆ చోటుకి చేరుకున్నారు

ఆ ప్రాంతాలలో దాడులు తక్కువగానే ఉన్నా శంకర్ కృప కాంప్లెక్స్ భయంబడిలో నిద్రపోతున్న దానిలా నిశ్శబ్దంగా ఉంది నిశ్శబ్దంగా ఉండటమంటే వారంతా నిద్రపోయారని కాదు

జీపు శబ్దం వింటూనే కొన్ని కిటికీల అద్దాల వెనుక దీపాలు వెలిగాయి కొన్ని తలుపులు కొంచెంగా తెరుచుకున్నాయి వచ్చింది ఎవరో తెలుసుకునే ఆసక్తితో కొందరు తలలు బయట పెట్టి చూస్తున్నారు

తెల్లవారు ఝాము వరకు ప్రశాంతంగా జరిగిపోయింది ఎలాగో! మరో గంటలో ఉదయరేఖలు విరుస్తాయనగా ఆ కాంప్లెక్స్ మీద ఏదో సైతాన్‌నీడ పరుచుకొంటోందని వారంతా గ్రహించారు

కొద్దిగా అలజడి ప్రారంభం కావటంతో జీపుని ఒకవైపుకి లాగి నిలిపి వేసింది పీయూష! క్రిందికి దిగాడు యిబ్రహీం

"ఏ క్షణంలో అయినా వేం తిరిగి రావచ్చు ఎక్కువ సమయం కూడ లేదు కదా! [illegible] సేపటిలో మేం తిరిగి వస్తాం, వెంటనే వెళ్ళిపోదాం" అంటూ అనుచరుల వంక చూచాడు వారు సిద్ధమయ్యారు

మేఘంలా పటాలం ముందుకు కదిలింది అక్కడనించి అయిదో నంబర్‌బ్లాకు దగ్గరకు

నడిచేందుకు నిమిషం సమయం తీసుకుంది ఆ సమయాన్ని చేయవలసిన పనిగురించి వివరించేందుకు వినియోగించాడు యిబ్రహీం!

అయిదోనంబర్ బ్లాకు చేరుకోగానే అందరూ చీలిపోయారు

ఇంటిని చుట్టుముట్టారు వీధివాకిలి దగ్గర వారు తలుపులు బాదటం ప్రారంభించారు సుషుమ్నని డొక్కలో పొదువుకుని నిద్రపోతున్న తన్వి త్రుళ్ళిపడిలేచింది

ఈలోగా వెనుక వాకిలి బాదుతున్న చప్పుడు అయింది కిటికీలకు అమర్చిన గ్రిల్స్ లోంచి యినుప రాడ్స్ లోపలికి తొంగిచూచినాయి తన్వి నిలువెల్ల నీరుకారిపోయింది

కొందరు కిటికీ ఊచలు వంచుతున్నారు కొందరు తలుపులు బలవంతంగా తెరిచే ప్రయత్నాలు చేస్తున్నారు

అందరూ గొంతులు చింపుకుని అరుస్తున్నారు "తియ్! తలుపులు అరనిముషంలో తలుపులు తెరవకపోతే అందరూ చనిపోతారు మీ ప్రాణాలు కాపాడుకోవాలంటే తక్షణం తలుపులు తియ్యాలి! తియ్ తలుపులు! తియ్!" మళ్ళీ తలుపులమీద బాదటం! యినుప రాడ్స్‌తో కొయ్యతలుపుల్ని బాదటం, భయపెట్టటం కోసం భీభత్సం చేస్తున్నారు ఒకడు గ్రిల్‌కి సైకిల్ ఛెయిన్ మెలివేసి ఒలంగా లాగాడు గ్రిల్స్ కదిలాయి

మరొకడు యినుప రాడ్ వేసి దాన్ని కదిలించాడు ఇంకొంచెం వంగింది నలుగురు బుల్లెట్ ఛెయిన్ పట్టి లాగేశారు చట్రం ఊడి వారి చేతుల్లోకి వెళ్లిపోయింది

ఇదంతా చూచి కొయ్యబొమ్మలా మంచం మీదే బిగిసిపోయింది తన్వి! బావకూడా సాయంత్రమనగా యిల్లు వదిలిపోయాడు ఇంత వరకూ తిరిగిరాలేదు

పాపని అప్పగించిపోయాడు చనిపోవటం ఖాయమ్! తన సంగతి వేరు? బావకి మిగిలిన ఒక్కగానొక్క జీవితాశ ఈ పాప! దక్కుతుందా అతనికి? ఏమో?

మనసు పనిచేస్తోంది కాని కాళ్లు చేతులూ మొద్దుల్లా బిగిసిపోయాయి ఊపిరి కూడా అందనంత గుండెదడ! మిక్కీమౌస్‌ని గుండెలకి ఆనించుకుని పాప నిద్రపోతోంది మొద్దునిద్ర!

ఇంకా లేవలేదు మెళుకువ వస్తే భయపడి ఏడుస్తుంది మొద్దునిద్ర పోవడమే మంచిది అయింది పరిపరి విధాలుగా వెర్రి ఆలోచనలు చేస్తూంది తన్వి

ఈలోగా గ్రిల్ వూడిపోయిన కిటికీ లోంచి ఒకడు లోనికి ప్రవేశించాడు ముందు వెనుక ఇంకా తలుపులు బాదుతూనే వున్నారు అతడు మెరుపులా పరుగెత్తి రెండు తలుపులు తీశాడు

సైతాను దళం ఇంటిలోకి చొచ్చుకువచ్చింది

"ఇంకా పడుకున్నావేం? లేచి నిలబడు" చాల అనాగరికమయిన పదాలుకూడ కలిపి ఆదేశించాడు యిబ్రహీం! వీలయినంత ఎక్కువ భయపెట్టగలిగితేనే ఇలాంటి దాడిలో ఎక్కువ ప్రయోజనాలుంటాయనేది అతనికి చిన్నతనం నుంచి అనుభవం

వొణుకుతూ లేచి నిలబడింది తన్వి వాస్తవానికి ఆమె శరీరంలో రవంత అయినా శక్తిలేదు భయమే నిలబెట్టింది

"నేను అడిగే ప్రశ్నలకు సరయిన సమాధానం చెప్పు లేకపోతే నీ "చాల అసభ్యమయిన మాట అన్నాడు యిబ్రహీం!

"అలా చేయకండి చెప్తాను" అంది తన్వి

"ఇండికేటర్ ఎక్కడుంది?"

"అదేమిటో నాకు తెలియదు"

# ఫొటోవ్యాఖ్య పోటీ-27 ఫలితాలు

## బహుమతి పొందిన వ్యాఖ్య

**ఆడదంటే అలుసా!**
**తల్చుకుంటే తొక్కేస్తా తెలుసా?**

–చొప్పరపు సత్యనారాయణ, (మంటాడ)

"జోడు గుర్రాలపై స్వారీ, ఇలలో
అతివల ఆధిపత్యానికి, ఋజువు మరోసారి!"

–పెన్మెత్స సూరిబాబు, (హైదరాబాద్)

అది మత్తుని కలిగించే ప్రౌఢ
ఇది గమ్మత్తనిపించే క్రీడ!

–నెల్లూరు మనోహరరెడ్డి, (చిల్లకూరు)

జోడు గుర్రాల స్వారీ,
ఎంచుకున్నావా కోరి,
మనసు వుంచకపోతే నారీ,
పడిపోతావు జారి!

–ఏలేటి నరసింహారెడ్డి, (నిజామాబాద్)



### లక్కీ పేర్లు

మన్నెముత్తుల సిద్ధార్థ (ఇందుకూరుపేట మండలం), కె కృష్ణమూర్తి (నంద్యాల), యర్రా శ్రీనివాసరావు (పాలకొల్లు), ఏలేటి నరసింహారెడ్డి (నిజామాబాద్), కరీమున్నీసా (ఒంగోలు), వి జయశ్రీ (విశాఖపట్నం), పి బాలాజి (శ్రీహరికోట), బాణాల రమేష్‌బాబు (ఖమ్మం), వి జయరామిరెడ్డి (కర్నూలు), భానుమతి (మద్రాసు)

---

"కారు ప్రమాదం రోజు పాప తెచ్చిన వస్తువు"వివరించాడు

"అవును పాప ఏదో ఒక విచిత్రమయిన వస్తువు తెచ్చింది"

"వెంటనే దాన్ని తెచ్చి నాకు యివ్వాలి కదులు"రాడ్‌తో పొడిచాడు అది శరీరంలోకి దిగలేదు కాని నరాలు జివ్వుమన్నాయి

"దాన్ని పాప ఎక్కడో పోగొట్టుకుంది"

"అబద్ధాలాడకు యినుపరాడ్‌తో గుచ్చుతాను"

"నిజంగా పారవేసింది ఎక్కడో!"

"అబద్ధాలాడితే చస్తావు "

"నన్ను నమ్మండి నేను నిజమే చెప్తున్నాను"

"ఆ గుంటని లేపి అడుగు ఎక్కడ పెట్టిందో!" పిడుగులా గర్జించాడు

"పాప నిద్రలేస్తే జడుసుకుంటుంది చాలసార్లు అడిగిచూచాం కాని చెప్పలేకపోయింది"వొణు కుతూ బదులుచెప్పింది తన్వి

"ఇల్లంతా గాలించండి"ఆదేశించాడు యిబ్రహీం సైతాన్ గణం యింటిగదుల్లో వస్తువులమీద విరుచుకుపడ్డారు

ఒకవంక అన్వేషణ సాగుతూవుండగా మరింత ఒత్తిడి చేయడం ప్రారంభించాడు యిబ్రహీం!

"నకరాలు చెయ్యొద్దు తకరారులో పడతావు లేపు"అన్నాడు అయినా పాపను లేపేందుకు ప్రాణం ఒప్పలేదు కళ్ళప్పగించి చూస్తోంది తన్వి

"ప్రాణాలమీద ఆశ లేదా?"పెద్దగా అరిచాడు ఆ అరుపుకి ఉలికిపడి లేచి కూర్చుంది పాప! కళ్ళు నులుముకుంది ఆవులించింది

"అంకుల్! మీరెవరు? ఆంటీని ఎందుకలా తిడుతున్నారు"అంది రాతిచెట్టును పూలచెండు తాకినట్టు అయింది

ఆ మాటలకు క్షణకాలం ఉక్కిరిబిక్కిరి అయాడు యిబ్రహీం! పసి మనసుల్లో ద్వేషానికి తావులేదు ప్రేమ ఒక్కటే వారిని దారిలోకి తీసుకువచ్చే ఆయుధం

"పాపా! యిండికేటర్ ఎక్కడపెట్టావమ్మా!"యినుపరాడ్‌ని, సైకిల్ చైయిన్‌ని వెనుక దాచుకుంటూ అడిగాడు

"ఎక్కడో పెట్టాను మరిచిపోయాను అంకుల్!"

"నెమ్మదిగా ఆలోచించుకుని గుర్తు తెచ్చుకో!"మెత్తగా అడిగాడు

"కావాలంటే ఈ మిక్కీమౌస్ యిస్తాను తీసుకోండి అంకుల్!"రెండుచేతులూ ముందుకుచాచి అందించింది పాప సంతోషం కోసం దాన్ని అందుకున్నాడు

కాని అతని దౌర్భాగ్యరేఖ అతని చేతుల్లోనే వుందని ఆ క్షణంలో గ్రహించలేకపోయాడు యిబ్రహీం! మరు క్షణంలో దాన్ని మూలకి గిరవాటు కొట్టాడు పసిపాపల చేతుల్లో ఆటవస్తువులుంటాయి వారి లేతమనసులో ఆటవస్తువుల గురించిన ఆలోచనలే వుంటాయి చాల సహజమయిన సంగతి!

అతనికి అనుమానం వచ్చే ఆస్కారమే లేదు

పాప మంచం దిగి నెమ్మదిగా వెళ్లి మిక్కీమౌస్‌ని తెచ్చుకుంది తండ్రి యిచ్చిన అద్భుతమయిన కానుక!

సైతాను గణం తిరిగివచ్చారు కాని వారికి ఎక్కడా ఏమీ కన్పించలేదు ఖాళీ చేతులతో తిరిగివచ్చారు

"ఇండికేటర్ దీని తండ్రికి చిక్కి ఉండాలి పాపని తీసుకుని పదండి వెతుక్కుంటూ వస్తాడు"అని ఆదేశించాడు యిబ్రహీం! తన్విని అవతలకు నెట్టేసి పాపని ఎత్తుకున్నాడు ఓ సైతాన్!

(ఇంకా ఉంది)

"నీకేం తొందరొచ్చిందిరా! ముందు వాడిని స్నానం చేయనీయ్! వాడికి కాలేజీకి టైమ్ అవుతోంది

నువ్వు స్నానం చేసినా చేసేదేం వుంది బలాదూర్ తిరగడం తప్ప తల్లి గొంతు ఖంగుమనడంతో నిశ్శబ్దంగా బాత్‌రూమ్ నుండి బైటకు వచ్చాడు సుందరం

సుందరం బి ఎస్సి ఫస్ట్‌క్లాస్

బి ఎస్సీ ఫస్ట్ క్లాస్‌లో పాసైన వాళ్ళు లక్షల్లో వున్నారు కాబట్టి వుద్యోగం దొరక లేదు లక్షల్లో లక్షలేం ఖర్మ కోట్ల బి ఎస్సీలున్నా వుద్యోగాలు వచ్చేవారికి వస్తూనే వున్నాయి

వస్తున్నాయంటే వారికి కోట్లతో వ్యవహారం చేసే ఆఖరికి కోట్లున్న వ్యక్తులతో పరిచయాలుంటాయి కాబట్టి వారికి వుద్యోగాలొస్తున్నాయి

లేదా పాతికో ముప్పైయో చదివించేందుకు వారివద్ద డబ్బుంటుంది లేదా రికమెండేషనుంటుంది

సుందరానికి ఇవేవీ లేవు కాబట్టి వుద్యోగం రాలేదు వుద్యోగం రాలేదని పెళ్ళి కాలేదని జాలిపడి రోజులు గడవకుండా నిల్చిపోవు కాబట్టి సుందరానికి ఈ రోజుతో ప్రభుత్వ వుద్యోగం వచ్చే వయోపరిమితి నిండి పోయింది

ఏవిట్రా వెదుకుతున్నావ్ అలమరంతా కలియ తోడుతున్న సుందరాన్ని అడిగింది చెల్లెలు సుకన్య

మొన్న టోపజ్ బ్లేడొకటి పెట్టానే! కనబడటం లేదు చెప్పాడు

నిన్న నేను తీసుకొన్నా లేవోయ్ ఇప్పుడు నీ అందానికేం తక్కువొచ్చింది పేపర్ చదువుతూ నున్నటి గడ్డం మీద వాలిన దోమను అదిలిస్తూ అన్నాడు కృష్ణశాస్త్రి

ఈ రోజు నా పుట్టినరోజు షేవ్ చేసుకుందామని చెప్పబోయి ఆగిపోయాడు

పుట్టినరోజని చెపితే తనకిక ప్రభుత్వోద్యోగం రాదని తెల్సిపోతుంది దాంతో ఇంతెత్తున ఎగురుతాడు

బట్టలేసుకొని ఫైలు పట్టుకొని బయల్దేర బోయాడు

జేబులు తడుముకొని సుకన్యా! ఓ అయిదు అప్పుగా ఇస్తావటే! ఇంటర్వ్యూ అయ్యేసరికి లేట్ అవుతుంది తండ్రికి వినబడకూడదని గొణిగాడు

•



# సుందరమరణం

## ఎ.యస్.రాజశేఖర్

కానీ విన్నాడు కృష్ణశాస్త్రి

అప్పుగా అట సిగ్గులేదురా ఆడపిల్ల– దాన్ని నమ్మించి తీసుకుపోవడానికి నీకంటే చిన్నదైనా కష్టపడి కుట్టు స్కూల్‌లో పని చేసి నూటయాభై తెస్తుందది

దాని సొమ్ము కూడా కాజేయడానికి బుద్ధుండాలి కొడుకును తిట్టడం మొదలెట్టాడు కృష్ణశాస్త్రి

ఇక్కడో విషయం గమనించాలి ఆ తిట్టడంలో ద్వేషం వుంది కసి వుంది ఈ బరువు ఎప్పుడు దిగుతుందా– కొంచెం మోటుగా చెప్పాలంటే వీడెప్పుడు ఇంట్లోంచి పోతార్రా భగవంతుడా' అన్న ఆక్రోశం వుంది

పాపం కృష్ణశాస్త్రి యు డి సి కష్టపడి కొడుకును డాక్టర్ చేయాలని చదివిస్తే వాడు డాక్టరు కాదు గదా కనీసం కాంపౌండరన్నా కాక రోడ్లు కొలుస్తుంటే బాధపడుతూ వ్యవస్థలోని లోపాన్ని గమనించక కొడుకులను మానసికంగా హింసలు పెట్టే మధ్య తరగతి బడుగు జీవులకు వుదాహరణ

అబ్బ నీ సోది అపునాన్నా' వాడెళ్ళేది ఇంటర్వ్యూకట తన పర్సులోంచి అయిదు నోటు తీసిస్తూ అంది సుకన్య

వెళ్ళొస్తాను చెప్పి కదిలాడు

గుడ్‌లక్‌రా అన్నయ్యా' వాకిలి దగ్గర నిలబడుతూ అంది సుకన్య

తను డిగ్రీ పాసయ్యాక మొట్టమొదటిసారిగా ఇంటర్వ్యూకు వెళ్ళడం గుర్తొచ్చింది సుందరానికి

తండ్రి తనను స్వయంగా దగ్గరుండి బస్ ఎక్కించడం ఇంటర్వ్యూనుండి రాగానే వుద్యోగం వస్తుందిరా' నీకు తప్పకుండా వస్తుంది అని కళ్ళనిండా ఆశతో పలికిన అమ్మ గుర్తొచ్చారు

ఆ ఉద్యోగం రాలేదు అలానే ఇంటర్వ్యూలకు వెళుతున్నాడు కాంపిటీటివ్ ఎగ్జామ్స్ కాంపిటీషన్ సక్సెస్ టెస్ట్ యువర్ ఐక్యూ ఉహూ ఏవీ ఉపయోగపడలేదు

వీటన్నిటికంటే పవర్‌ఫుల్లైనది మరోటుంది అది లేదు సుందరం దగ్గర

కనీసం ఈ రికార్డ్ అసిస్టెంట్ పోస్టొచ్చినా చాలు బయటపడిపోతాడు తను అనుకొంటూ కాంపౌండు దాటుతున్న సుందరానికి ఆ ఆశ కూడా పెట్టుకోవద్దన్నట్టుగా పిల్లి ఎదురైంది

* * * * * *

ఇంటర్వ్యూ పూర్తయ్యేసరికి సాయంత్రం నాలుగు అయింది

ఇంటర్వ్యూ అంటే ఆఫ్రికాలోని అడవుల గురించి బెనజీర్ గురించి ప్రశ్నలేసే ఇంటర్వ్యూ కాదు

వున్నవి పది పోస్టులు రిజర్వేషన్స్ పోగా మిగిలినవి ఆరు వాటికి అయిదు వందల అభ్యర్థులు వారందర్నీ ఇంటర్వ్యూ చేయాలంటే చేయాలన్నట్టుగా ఒరిజనల్స్ అన్నీ చూసి పంపేసాడు ఓ ఆఫీసర్

నిర్వేదంగా బయట కొచ్చాడు సుందరం

ఇంతకుమునుపు ఇంటర్వ్యూ అంటే మనసంతా ఎక్సైటింగ్‌గా వుండేది ఇప్పుడదేం లేదు వుద్యోగం రాదనిఎలాగు తెల్సిపోతుంటుంది విరక్తి ఈ జీవితంమీద కష్టపడి చదివినా వుద్యోగాలు చూపలేని ప్రభుత్వం మీద వుద్యోగం ఇవ్వకున్నా కనీసం నిరుద్యోగ భృతి ఇవ్వలేని ప్రభుత్వంమీద వోట్లకోసం తీర్చలేనివాగ్దానాలు చేసే నాయకులమీద విరక్తి అంతే

ఎమ్ కె హెయిర్ డ్రెసర్స్ షాపులోని అద్దాల్లోంచి తన ప్రతిబింబం చూసుకొంటూ ముందుకు నడిచేడు సుందరం

తన అభిమాన నటుడు కమల్ ఆకలి రాజ్యం గుర్తొచ్చింది దాంట్లో ఎమ్ ఎ ఫిలాసఫీ చదివి ఆఖరుకు బార్బరు షాప్‌లో చేరతాడు కమల్ తనకు కనీసం ఆ విద్యన్నా రాదు

ప్రభుత్వ డిగ్రీ కళాశాల అనంతపురం బోర్డు చూస్తున్నాడు

ఈ కాలేజీలోనే తను చదువు వెలగబెట్టేడు మూడేళ్ళు మూడు క్షణాల్లా గడిచాయి

ఈ వుద్యోగం కూడా రాదు ఇక రైలు పట్టాలే గతి అనుకొంటూ నడుస్తున్న సుందరానికి కాలికేదో తగలడంతో ఆగి చూ చేడు

పర్సు ఎవరో పోగొట్టుకున్నారు పర్సు నిండుగా డబ్బు అంతే సుందరం జీవితం ఓ మలుపు తిరిగింది చివరి మలుపు

* * * * * * *

జాగ్రత్తరా నాయనా' మీ ఆఫిసర్స్‌కు ఎదురు చెప్పేవ్ కాన్ఫిడెన్షియల్ రిపోర్టు నాశనం చేస్తారు సాయంత్రం త్వరగా వచ్చేయ్ ప్రేమగా చెప్పాడు కృష్ణశాస్త్రి

ఇప్పుడు సుందరానికి ఎనుగెక్కినంత సంబరంగా వుంది ఇది పాత పోలిక ఎయిర్ కండీషన్డ్ కంటెస్సాలో కూర్చుని ప్రయాణిస్తున్నట్టుగా వుంది కారణం సుందరానికి వుద్యోగం వచ్చింది ఇంటలిజెన్స్ డిపార్ట్‌మెంట్‌లో క్లర్క్ సుందరం

ఆ తర్వాత పది రోజులు పండుగలా గడిచాయి ఆ ఇంట్లో

# నవ్వు నాలుగందాల ఆరోగ్యం

## తాతగారి కోపం

జీవితంలో ఎన్నో సంఘటనలు మనకి ఎదురవుతుంటాయి వాటిల్లో కొన్ని ఆనందం కలిగించేవి మరికొన్ని దుఃఖాన్ని మిగిల్చేవి మొదటి వాటిని పదే పదే జ్ఞప్తికి తెచ్చుకొని రెండవ వాటిని మరచి పోవటానికి ప్రయత్నిస్తాం

మేము హైదరాబాదులో




చిక్కడపల్లిలో ఉంటున్నప్పుడు మా తాతగారు బామ్మగారు వేసవి కాలంలో మా ఊరు రావడం జరిగింది మా తాతగారికి కాస్త కోపం జాస్తి అప్పట్లో ఆ ప్రాంతంలో ముష్టివాళ్ళ బెడద విపరీతంగా ఉంది తెల్లవారు ఝామునే వాళ్ళ అర్థింపులు సుప్రభాతాలు రాత్రుళ్ళు ఆ అన్నార్తుల ఆర్తనాదాలే జోలపాటలు

ఒకరోజు మా కుటుంబ సభ్యులు (తాతగారితో పాటు) సాయంత్రం వరండాలో కూర్చుని తీవ్రంగా ఎ విషయం గురించో చర్చించుకుంటున్నారు ఇంతలో ఒక బిక్షువు అక్కడ ప్రత్యక్షమై యదావిధిగా అరిచాడు సరే మా తాత విషయం చెప్పానుగా చిర్రెత్తుకొనివచ్చి అయన వాడిని గెంటేసారు

ఒకటి రెండు నిముషాలు అయిన తరువాత ఆ ఆర్తనాదం నాకు మరింత దగ్గరగా వినిపించింది పుస్తకం ద్యాసలో ఉన్న నేను ఆ విషయం పట్టించుకోలేదు ఆ వెధవ ఇంట్లోకి కూడా వచ్చాడా? అన్న మా తాతగారి కేకతో నేను ఈ లోకంలోకి వచ్చాను

అక్కడున్న ఆ గది తలుపు దగ్గర ఉన్న అతనిని చూసి నేను నవ్వాపుకోలేక పోయాను మా తాతగారు కూడా అక్కడికి వచ్చి నాతో శృతి కలిపారు

ఇంతకి అసలు విషయ మేమిటంటే మా ఇంటివాళ్ళ అబ్బాయికి మిమిక్రీ అంటే బాగా ఇష్టం అందుకని అతడు ఆ రోజున పోయే ఆ అన్నార్తుల అర్థింపులని బాగా పరిశీలించి రాత్రుళ్ళు బాగా ప్రాక్టీసు చేసి మా తాతగారిని ఆటపట్టించడానికి అలా చేసాడుట

– కె శ్రీలత

## నాన్ స్టాప్ బస్

ఒకడు నాన్ స్టాప్ బస్ ఎక్కి తన పక్క సీట్లో కూర్చున్న ఇంకో అతనిని ఇలా అడిగాడు

ఎవండి మిగిలిన బస్‌లకి నాన్‌స్టాప్ బస్‌కి తేడా ఎమిటి?

రెండవతను మిగిలిన బస్సులు స్టాప్ వున్న ఊరు వస్తే ఆగుతాయి నాన్ స్టాప్ బస్సు అయితే ఎక్కడా ఆగదు

మరి మనం దిగాల్సిన ఊరు వస్తే ఎలాగా?

'ఊరు వచ్చేముందు గేట్ దగ్గర నిలబడి ఊరు రాగానే దూకేయటమే!'

అయితే ఈ బస్సు బయలు దేరాక ఎప్పుడు ఆగుతుంది ఎక్కడ ఆగుతుంది?

ఎక్కడ ఎప్పుడు పెట్రోలు అయిపోతే అక్కడ అప్పుడు ఆగిపోతుంది

ఎందుకంటారు?

మిగిలిన బస్సులకి బ్రేకు లుంటాయి కాబట్టి ఆపితే ఆగుతాయి నాన్ స్టాప్ బస్సుకి బ్రేకు లుండవు అందుకని పెట్రోలు అయిపోతేనే గాని దానంతట అది ఆగదు అనగానే మొదటతనికి భయం వేసి అయ్యో బాబోయ్! మీరంతా ఎలా ప్రయాణం చేస్తారు బాబు దీనిలో! నేను మాత్రం దిగిపోతాను– ఇందులో ప్రయాణం చేయటం నా వల్ల కాదు బాబూ' అని లేవగానే బస్సులోని మిగిలిన ప్రయాణీకులు గొల్లుమని నవ్వేశారు

– టి మంజుమానస్

## తేగలు

సాధారణంగా జనసంచారం ఎక్కువగా ఉన్న సెంటర్లలో తినుబండారాలు పండ్లు తోపుడు బండ్లపై నిలుపుకుని అమ్మేవాళ్ళను చూస్తుంటాం అలాగే అలాంటి వారిని బెదిరించి సొమ్ము చేసుకునే ఎర్ర టోపీల వారిని కూడా చూస్తుంటాం ఓ తేగల బండివాడు మంచి సెంటరు చూసుకుని బండి నిలిపి అమ్ముకుంటుండగా అక్కడకు ఓ పోలీసు వ్యానొకటి వచ్చి ఆగింది అందులోంచి యస్సయితో పాటు మరో కానిస్టేబుల్ దిగటం చూసిన బండివాడు భయంతో బండి తోసుకుంటూ ఓ గొందిలోకి పరుగెత్తటం మొదలెట్టాడు ఆ వెనుకే కానిస్టేబుల్ కూడా చివరకు ఎలాగైతేనేం బండివాడ్ని పట్టుకున్నాడు కానిస్టేబుల్ ఎందుకయ్యా అలా పరుగెడుతావ్ మా అయ్యగార్కి తేగలంటే మహాఇష్టం ఇదుగో ఈ రెండ్రూపాయలకు తేగలివ్వు అన్నాడు అంతే ఆ తేగల బండివాడికి ఖంగారుపోయి నవ్వటం మొదలెట్టాడు' చంపేవు కదయ్యా ప్రేగులు తెగేలా పరిగెత్తాను అన్నాడు

– బి కృష్ణప్రసాద్

## సుందర మరణం

అడ్వాన్సిచ్చారమ్మా' అని సుందరం కృష్ణశాస్త్రికి రాదమ్మకు బట్టలు తెచ్చాడు సుకన్యకు చీర కొనిపెట్టాడు పాలిటిక్నిక్ చదువుతున్న తమ్ముడికి వాచ్ తెచ్చాడు

స్వీట్స్ తెచ్చాడు ఆనందంగా పండుగ జరుపుకొన్నారు పది రోజులూ హాయిగాగడిచాయి

పదకొండో రోజున సుందరం రైల్వే ట్రాక్‌మీద చచ్చిపడున్నాడు నీ కపుడే నూరేళ్ళు నిండాయిరా' అని గుండెలు బాదుకొని ఏడ్చారు తల్లిదండ్రులు

మొన్ననే వుద్యోగ మొచ్చింది ప్ప అని బాదపడ్డారు స్నేహితులు

అయినా రాత్రి పూట రైల్వే ట్రాక్‌మీద ఎందుకంత అజాగ్రత్తగా నడిచ దో' అని చాలామందికి అర్థం కాలేదు

కనీసం మీకన్నా అర్థమైందా చదువరీ!

అర్థం కాలేదా' సుందరం పొరబాటున గూడ్సు కింద పడలేదు కావాలనే పడ్డాడు

వుద్యోగం వచ్చాక ఎందుకు పడ్డాడు?సుందరానికేమన్నా పిచ్చా' అని మీరడగొచ్చు

కానీ సుందరానికి వుద్యోగం ర లేదు బ్రతికున్నా రాదు కూడా ఈ విషయం తెల్సే సుందరం చచ్చిపోయాడు

చనిపోయేముందన్నా కనీసం ముసలి తల్లిదండ్రులను సంతోషపెడదామని తనకు దొరికిన పర్సులోని డబ్బుతో బట్టలు తెచ్చాడు వుద్యోగం వచ్చిందని తన ఆఫీసుకు బోర్డు వుండదని అబద్ధమాడేడు కొడుకుకు వుద్యోగం వచ్చిందనే తృప్తితోనే వాళ్ళను వుండనిచ్చి తను వెళ్ళిపోయాడు ●

# SCHOOL OF CORRESPONDENCE COURSES

## ANDHRA UNIVERSITY VISAKHAPATNAM 530003.

# ప్రవేశ ప్రకటన 1989–90

ఈ దిగువ ఇచ్చిన కోర్సుల్లో ప్రవేశం కొరకు భారతదేశంలో నివశించు అభ్యర్థుల నుంచి ధరఖాస్తులు కోరబడుచున్నాయి

| కోర్సు | అర్హత |
|---|---|
| **I డిగ్రీ కోర్సులు (మూడు సంవత్సరాలు)** | |
| 1 బి ఎ (ఇంగ్లీషు మరియు తెలుగు మీడియం) స్పెషల్ ఇంగ్లీషు స్పెషల్ తెలుగు హిస్టరీ ఎకనమిక్స్ పొలిటిక్స్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ సోషియాలజీ మరియు మాథమాటిక్స్ కాంబినేషన్‌తో | ఇంటర్మీడియట్/పి యు సి లేదా ఈ స్కూలుచే నిర్వహించబడిన ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణత |
| 2 బి కాం (ఇంగ్లీషు మరియు తెలుగు మీడియం) | ఇంటర్మీడియట్/పి యు సి లేదా ఈ స్కూలుచే నిర్వహించబడిన ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణత |
| 3 బి ఎస్‌సి (ఇంగ్లీషు మీడియం మాత్రమే) మాథమాటిక్స్, ఫిజిక్స్ మరియు కెమిస్ట్రీ కాంబినేషన్‌తో | ఇంటర్మీడియట్/పి యు సి లేదా తత్సమానమైన ఫిజికల్ సైన్సెస్ మరియు మాథమాటిక్స్ కాంబినేషన్ |
| **II పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు (రెండు సంవత్సరాలు)** | |
| 4 ఎం ఎ ఇంగ్లీషు | బి ఎ/బి ఎస్‌సి/బి కాం |
| ★ 5 ఎం ఎ హిందీ | బి ఎ /బి ఎస్ సి /బి కాం (హిందీ ఒక సబ్జెక్టుగా చదివి ఉండాలి పూర్తి అర్హత వివరాలకు ప్రాస్పెక్టస్‌ను చూడండి) |
| ★ 6 ఎం ఎ తెలుగు | బి ఎ /బి కాం లేదా బి ఎ స్పెషల్ తెలుగు ఒక సబ్జెక్టుగా చదివి ఉండాలి బి ఎస్‌సి / హోం సైన్సెస్/ ప్రతీ సంవత్సరం 100 గరిష్ట మార్కులతో తెలుగు ఒక సబ్జెక్టుగా రెండు సంవత్సరాలు చదివి ఉండాలి పూర్తి అర్హత వివరాలకు ప్రాస్పెక్టస్‌ను చూడండి |
| ★ 7 ఎం ఎ ఎకనామిక్స్ (ఇంగ్లీషు మీడియం మాత్రమే) | బి ఎ ఎకనమిక్స్ (మెయిన్ లేదా యాన్సిలరీ) |
| ★ 8 ఎం ఎ హిస్టరీ (ఇంగ్లీషు మీడియం మాత్రమే) | బి ఎ (పాస్ లేదా ఆనర్స్) బి ఎ (ఒ టి) బి ఎ (ఒ ఎల్) హిస్టరీ ఒక సబ్జెక్టుగా చదివి ఉండాలి |
| ★ 9 ఎం ఎ పొలిటిక్స్ (ఇంగ్లీషు మీడియం మాత్రమే) | బి ఎ (పొలిటిక్స్ లేదా పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ ఒక సబ్జెక్టుగా చదివి ఉండాలి)/బి ఎల్ /బి జి యల్ |
| 10 ఎం ఎ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ (ఇంగ్లీషు మీడియం మాత్రమే) | బి ఎ (పొలిటిక్స్ లేదా పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ ఒక సబ్జెక్టుగా చదివి ఉండాలి)/బి ఎల్ /బి జి యల్ |
| ★11 ఎం ఎ సోషియాలజీ (ఇంగ్లీషు మీడియం మాత్రమే) | బి ఎ (సోషల్ సైన్సెస్) |
| 12 ఎం కాం (ఇంగ్లీషు మీడియం మాత్రమే) | బి కాం మాత్రమే |

★ఆంధ్ర విశ్వకళా పరిషత్ వజ్రోత్సవాల సందర్భంగా ఈ ఎం ఏ కోర్సులు 1989 90 విద్యా సంవత్సరం నుంచి నూతనంగా ప్రవేశపెట్టడం జరిగింది

| కోర్సు | అర్హత |
|---|---|
| **III వృత్తివిద్యా కోర్సు (ఒక సంవత్సరం)** | |
| 13 పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లొమా ఇన్ కో ఆపరేషన్ అండ్ రూరల్ స్టడీస్ (ఇంగ్లీషు మీడియం మాత్రమే) | బి ఎ (ఎకనమిక్స్ మెయిన్ లేదా యాన్సిలరీ)/బి కాం /బి ఎస్‌సి (అగ్రికల్చర్) సహకార మరియు తత్సంబంధిత సంస్థల్లో పనిచేయుచున్న ఉద్యోగులు, నాన్ ఆఫీషియల్స్ అర్హులు<br>లేదా<br>బి ఎ /బి కాం /బి ఎస్‌సి డిగ్రీతో సహకార సంస్థల్లో ఐదు సంవత్సరాలు సర్వీసు కలిగియున్న పర్మినెంటు ఉద్యోగులు, సహకార సంస్థల డిప్యూటీ రిజిస్ట్రార్ ఇచ్చిన సర్టిఫికేటు జతపర్చాలి |
| **IV ఫౌండేషను కోర్సు (ఆరు నెలలు)** | |
| 14 ఫౌండేషన్ కోర్సు (ఇంగ్లీషు మరియు తెలుగు మీడియం) బి ఎ బి కాం డిగ్రీ కోర్సుల్లో చేరదల్చి ప్రవేశ నిమిత్తం నియమిత విద్యార్హత లేకున్నచో 1990 జూన్‌లో నిర్వహించబడు ప్రవేశపరీక్ష కొరకు అభ్యర్థులకు స్టడీ మెటీరియల్ అందిస్తూ తర్ఫీదు ఇచ్చుటకు ఈ కోర్సు రూపొందించబడినది | ఏ నియమిత విద్యార్హత అవసరం లేదు కాని 1-7 1990 నాటికి అభ్యర్థికి 21 సంవత్సరాలు నిండి ఉండాలి |

**దరఖాస్తు ఫారం మరియు ప్రాస్పెక్టస్ తే 16 8 89 ది నుంచి ఇవ్వబడును పూర్తి చేసిన దరఖాస్తులు తే 7 10 89 ది లోగా క్రింది సంతకందారునకు చేరాలి**

ఆసక్తిగల అభ్యర్థులు డైరెక్టరు గారి పేర తీసిన రూ 10లు బ్యాంకు డిమాండు డ్రాఫ్టును గాని మనియార్డరు గాని డైరెక్టరు, స్కూల్ ఆఫ్ కరస్పాండెన్స్ కోర్సెస్ ఆంధ్రా యూనివర్శిటీ, వాల్తేరు 530003 అనే చిరునామాకు పంపుటచే ప్రాస్పెక్టస్ మరియు దరఖాస్తు ఫారం కొరకు అభ్యర్థన ద్వారా పొందవచ్చు అడ్మిషన్ కోరుచున్న అభ్యర్థులు తమ పేరు, చిరునామా & కోర్సు పేరు డిమాండు డ్రాఫ్టు(లు) వెనుక వైపు లేదా మనిఆర్డరు కూపన్ మీద గాని విధిగా వ్రాయాలి

స్కూల్ ఆఫ్ కరస్పాండెన్స్ కోర్సెస్ డైరెక్టర్ గారి పేర తీసిన రూ 10లు బ్యాంకు డిమాండు డ్రాఫ్టును యిచ్చి ప్రవేశ దరఖాస్తు ఫారం మరియు ప్రాస్పెక్టస్‌లను అసోసియేషన్ ఆఫ్ ఇండియన్ యూనివర్శిటీస్ ఎ ఐ యు హౌస్ 16 కొట్లా మార్గ్ న్యూఢిల్లీ 110002 మరియు ఈ క్రింది లభ్యయిన కేంద్రాల్లో కూడా పొందవచ్చు

1 శ్రీకాకుళం ప్రభుత్వ కళాశాల 2 విజయనగరం ఎం ఆర్ కళాశాల 3 విశాఖపట్టణం మిసెస్ ఎ వి ఎన్ కళాశాల 4 రాజమండ్రి ప్రభుత్వ కళాశాల 5 కాకినాడ పి ఆర్ ప్రభుత్వ కళాశాల 6 ఏలూరు సి ఆర్ రెడ్డి కళాశాల 7 విజయవాడ ఎస్ ఆర్ ఆర్ అండ్ సి వి ఆర్ ప్రభుత్వ కళాశాల 8 గుంటూరు ఎ సి కళాశాల 9 భీమవరం- డి ఎన్ ఆర్ కళాశాల 10 ఒంగోలు ఎ బి ఎమ్ కళాశాల 11 కర్నూలు సిల్వర్ జూబిలీ కళాశాల 12 హైదరాబాద్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజిమెంట్ అండ్ కామర్స్ 13 అనకాపల్లి ఏ ఎం ఏ ఎల్ కళాశాల 14 బొబ్బిలి ఆర్ ఎస్ ఆర్ కె ఆర్ కళాశాల 15 మచిలీపట్టణం నోబుల్ కళాశాల 16 తెనాలి వి ఎస్ ఆర్ అండ్ ఎన్ వి ఆర్ కళాశాల

ప్రవేశం కొరకు ఏ యితర సంస్థలు ఇచ్చిన ప్రాస్పెక్టస్‌గాని చేసిన వాగ్దానాలకు గాని స్కూలుకు బాధ్యత లేదు స్కూలు తరపున ఎవరూ ప్రతినిధులు లేరు

**1989 జూలైలో బి ఏ/బి కాం ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైన అభ్యర్థులకు ప్రత్యేక గమనిక**

మొదటి సంవత్సరం బి ఏ/బి కాం డిగ్రీ కోర్సులో చేరడం కోసం 1989 జూలైలో నిర్వహించిన ఎంట్రెన్స్ పరీక్షలో ఉత్తీర్ణులైన అభ్యర్థులు ప్రాస్పెక్టస్ మరియు దరఖాస్తు ఫారం కొరకు అప్లై చేయనవసరం లేదు ఉత్తీర్ణులైన అభ్యర్థులకు మార్కుల పట్టిక, అర్హత సర్టిఫికేటుతో ప్రాస్పెక్టస్, దరఖాస్తు ఫారాలు స్కూలు వారిచే పంపబడును అభ్యర్థులు అడ్మిషన్ సమయంలో చెల్లించవలసిన నిర్ణీత ట్యూషన్ ఫీజుతో పాటు ప్రాస్పెక్టస్ మరియు దరఖాస్తు ఫారం ఖరీదు రూ 10లు చెల్లించాలి క్రమంగా పూర్తిచేసిన దరఖాస్తుతో పాటు నిర్ణీత ఫీజు కొరకు తీసిన డిమాండు డ్రాఫ్టు లేక మనియార్డరు రశీదును జతపరిచి అవసరమైన సర్టిఫికెట్లతో పంపించవలెను ఆఖరు తేదీలోగా స్కూల్ ఆఫ్ కరస్పాండెన్స్ కోర్సెస్‌కు చేరాలి

వాల్తేరు తే ది 29 7 1989

ఆచార్య వి అబ్రహాము డైరెక్టర్

సీరియల్

# ద్రౌపది

ప్రయాగ రామకృష్ణ



(గత సంచిక తరువాయి)

ఇంతవరకూ సాగిన కద-15- పాంచాల దేశాదీశుడు ద్రుపదుడి కుమార్తె ద్రౌపదిని పాండవులు పెళ్ళాడతారు పట్టాబిషేకానంతరం ధర్మరాజు- ద్రౌపదిని మిగిలిన సోదరులను తీసుకుని ఖాండవప్రస్థం చేరుకుంటాడు నారదుడ సలహాపై రాజసూయ యాగం నిర్విఘ్నంగా జరిపి కృష్ణుడికి అగ్రపూజ నిస్తాడు ధర్మరాజు మయసభలో తనకు జరిగిన అవమానానికి ప్రతీకారంగా దుర్యోధనుడు పాండవుల సంపదనంతటినీ జూదంలో గెలుచుకోవటమే కాకుండా పాండవులను ఆఖరికి ద్రౌపదిని కూడా గెలుచుకుంటాడు తన దాసి అయిన ద్రౌపదిని నిండు కొలువులో వస్త్రాపహరణం చేయించి అవమానిస్తాడు కొడుకు చేసిన తప్పిదానికి పశ్చాత్తాపపడిన ధృతరాష్ట్రుడు పాండవులకు దాస్య విముక్తి కల్గిస్తాడు

దుర్యోదనుడు అంత పుర మందిరంలో హంస తూలికా తల్పంమీద కూర్చునున్నాడు చుట్టూవున్న పరిచారికలు వింజామరలు వీస్తున్నారు పక్కనే సువర్ణ పాత్రల్లో పళ్ళూ పానియాలు వున్నాయి సుగందాల పరిమళం సుతారంగా గాలిలో తేలి వస్తోంది గాందార సుతుడు కల గంటున్నాడు అందమైన కల- హస్తినాపురానికీ ఇంద్ర ప్రస్థానికీ కూడా తనేరాజు రాజేం కర్మ మహారాజు లోకంలో వున్న భూపతులందరూ తనకు సామంతులు సార్వ బౌమాదికారం తనకిచ్చి వాళ్ళందరూ చేతులు కట్టుకుని నిలబడి వున్నారు [illegible]

చెప్తూ అన్నీ తనే అని నమ్మి పాంచాలి [illegible] మెళ్ళో వరమాల వేస్తోంది ఆమె చెయ్యి పట్టుకు[illegible] తను

అడుగుల చప్పుడికి కల చెదిరింది

ఎదురుగా శకుని

అతను రాగానే పరిచారిక లందరూ నిష్క్ర మించారు

మనం జూదంలో గెల్చిన రాజ్యమూ సర్వ సంపదలూ అన్నీ మీ తండ్రి మళ్ళీ పాండవుల కిచ్చేశాడు శకుని ఆ మాట చెప్పే సమయానికి దుర్యోదనుడు మదువు పాత్రలోకి వొంప బోతు న్నాడు ఆ చెయ్యి మద్యలోనే ఆగిపోయింది పంచిన తలని నెమ్మదిగా- చాలా నెమ్మదిగా పైకెత్తాడు

శకుని మామ చెప్పింది విని ఆ దిగ్భ్రమ నుంచి తేరుకోటానికి దుర్యోదనుడికి చాలా సేపే పట్టింది చెయ్యి అప్రయత్నంగా కిందకు జారి పోయింది మదువంతా నేల పాలైంది తను వింటున్నది నిజమో కాదో అని తెలుసుకోవటం కోసం ఎమిటీ అని తిరిగి ప్రశ్నించాడు

శకుని మళ్ళీ చెప్పాడు అంతే అప్పటికో అతని మొహం ఎర్రబడింది పెద్దగా అరుస్తూ మణిమయ పాత్రలు నేలకేసి కొట్టాడు [illegible]

[illegible] కాలితో తన్నాడు అది వెళ్ళి అల్లంత దూరంలో పడింది మందిర ద్వారాలకున్న ముత్యాల తోరణాలన్నీ తెంపి కుప్పలు పోశాడు అవన్నీ చెల్లాచెదరై నేలమీద దొర్లుతున్నాయి

దుర్యోదనుడి పిచ్చి చేష్టలకి అంత పురమంతా బయంతో విలవిల్లాడుతున్న సమయాన శకుని విలాసంగా నవ్వుకున్నాడు

* * * * * * *

ఎకాంత మందిరంలో – దృతరాష్ట్రుడు బంగారు నగిషీ పని చేసిన మంచం మీద కూర్చునున్నాడు గాందారి కూడా లేదు అంతరంగికసేవకు లెవరో ఒక రిద్దరున్నారు

దర్మాదర్మాల మాట ఎలావున్నా బలవంతులతో విరోదం మాత్రం మంచిది కాదు ఇది తెలుసు కోవడం మీదే తన బిడ్డల బవిష్యత్తు ఆదారపడి వుంటుందని దృతరాష్ట్రుడు అనుకుంటున్న సమయంలో దడేలున తలుపులు తెరుచుకున్నాయి వచ్చింది ఎవరో వూహించక పోలేదు గ్రుడ్డిరాజు

నాయనా! రా! ఇలా నా దగ్గరగా వచ్చి కూర్చో అన్నాడు

దుర్యోదనుడు దగ్గరకు వెళ్ళలేదు

తలుపులకి చేతులు ఆన్చి ఆలాగే నిలబడి వున్నాడు

ఇద్దరి మద్యా కాసేపు బయంకరమైన నిశ్శబ్దం నిశ్శబ్దాన్ని చీలుస్తూ పెద్దగా నా మీద ప్రేమ నటిస్తూనే నాకు తెలియకుండా నాటకం ఆడటంలో మి ఉద్దేశ్యం ఎమిటి? అన్నాడు దుర్యో దనుడు తండ్రితో

దృతరాష్ట్రుడు కాసేపు మౌనం వహించి ఆ తరువాత నాయనా! లోకంలో చెడ్డ కొడుకు లుంటారేమో కాని చెడ్డ తల్లు లుండరు కడుపారా కన్న కొడుకుల్ని చంపు కోవడం ఇష్టం లేక పాండవుల సంపదని పాండవుల కిచ్చెయ్యమని మీ అమ్మే నాతో చెప్పింది నీ వల్ల పాండవులు అనుబవించిన పరాబవం లేదుట అందువలన పలిత మెలా వుంటుందోనని ఆవిడ బయం

దుర్యోదనుడు కాసే పు ఏం మాట్లాడలేదు తరవాత తలపట్టుకుని ఎంత పని చేశారు! మాయా జూదంలో సునాయాసంగా గెల్చుకున్న సొమ్మంతా పాడు చేశారు అయినా తెలీక అడుగుతాను- పాండవులకు జరగవల్సిన పరాబవమంతా జరిగాక మీరు వాళ్ళకు ఎంత మేలు చేస్తే మాత్రం మేము మళ్ళీ వాళ్ళకు మంచివాళ్ళ మౌతామా? త్రాచు పాముల్ని రెచ్చగొట్టి విడిచిపెట్టి నట్టయింది అంతకు మించేం లేదు అన్నాడు

దృతరాష్ట్రుడికి కూడా కొడుకు చెప్పింది నిజమే

అనిపించింది

తెలివితక్కువ పని చేశానేమో అనుకుని మౌనం వహించాడు

మహారాజా! ఎన్ని ఉపాయాలైనా అవలంబించి శత్రువులకు బుద్ధి చెప్పాలని బృహస్పతి ఇంద్రుడికి ధర్మోపదేశం చేశాడని మీరే ఒకసారి నాతో చెప్పారు

చెప్పుండచ్చు

బృహస్పతి ఉపదేశం నన్నెప్పుడూ ఉత్తేజ పరుస్తుంటుంది ఆ ధర్మోపదేశం ఎప్పుడూ నాకు నా గమ్యాన్ని సూచిస్తూనే వుంటుంది

నీ పిన తండ్రి బిడ్డలు నీకు శత్రువులా? అయినా వాళ్ళు నీకు చేసిన ద్రోహ మేమిటి?

దుర్యోధనుడు ఇబ్బందిగా నవ్వి వాళ్ళు ముమ్మాటికీ నాకు శత్రువులే నేను ఓర్వలేనంత ఐశ్వర్యమూ, సామ్రాజ్య వైభవమూ దైవమానుష సంపదలూ కలిగి వుండటమే వాళ్ళు నాకు చేసిన ద్రోహం అన్నాడు

ధృతరాష్ట్రుడు నిశ్చేష్టుడయ్యాడు

తనకు అత్యాశ వుందనీ లోభితనం వుందనీ గాంధారి అప్పుడప్పుడు దెప్పి పొడుస్తుంటుంది అదేమీ లేదన్నట్టు తను ప్రవర్తిస్తే మీరు ఆత్మవంచన చేసుకుంటున్నారు పోన్లెండి! కనీసం పైకయినా మీరు ఉదారంగా వ్యవహరిస్తున్నారు మీ సుపుత్రుడికి ఆపాటి జ్ఞానం కూడా లేకుండా పోతోంది అని చాలాసార్లు హెచ్చరించింది

దుర్యోధనుడి మాటలు వింటుంటే నిజమే అనిపిస్తోందది

వ్యాకులపడ్డాడు మహారాజు కాని కొడుకు మీద ప్రేమ చంపుకోలేక ఇంతకీ ఇప్పుడేం చేస్తానంటావు? అని అడిగాడు

మీరు ఒప్పుకుంటే ఇంకొక రకంగా పాండవుల్ని పడగొడ్తాను అన్నాడు దుర్యోధనుడు

ఎలా?

అది కాసేపట్లో మీకే తెలుస్తుంది "అన్న దుర్యోధనుడు అంటూండగానే శకునీ కర్ణుడూ



సైంధవుడూ ముగ్గురూ ఒకేసారి లో పలికివచ్చారు

శకుని వస్తూనే బావా! జరిగిందేదో జరిగిపోయింది అసలు విషయంలోకి నేరుగా వస్తాను పాండవులను మళ్ళీ అనుద్యూతానికి ఆహ్వానిద్దాం ఓడిపోయిన వాళ్ళు దేశం విడిచిపోవాలని ఆంక్ష విధిద్దాం ఎలాగో వాళ్ళు ఓడిపోతారు వాళ్ళ రాజ్యమంతా నీ బిడ్డలకు వచ్చి చేరుతుంది అన్నాడు దృతరాష్ట్రుడు తలెత్తి మళ్ళీ మోసం చెయ్యడమా ' అన్నాడు

జూదం మోసం రెండూ వేరుకావు శకుని నిర్మొహమాటంగానే చెప్పాడు

దృతరాష్ట్రుడు అవునూ కాదూల మద్య సందిగ్ధంలో నే తలూపాడు

దుర్యోదనుడు సంతోషం పట్టలేక శకుని మామను కౌగలించుకున్నాడు

–తరువాత కాసేపటికి మహారాజు దగ్గర శలవు తీసుకుని అందరూ బయటకు వచ్చారు

ఇంద్రప్రస్థానికి ఎవరిని పంపిద్దాం?

ప్రాతికామి వున్నాడుగా

వాడ్ని లక్ష్యపెడ్తారంటావా? అన్నాడు దుర్యోదనుడు శకుని మొహంలోకి చూస్తూ

దృతరాష్ట్ర మహారాజు పిలుపు అంటే ఆజ్ఞ కన్నా ఎక్కువ కరినమని వాళ్ళకు తెలుసు

మీ ఆహ్వానాన్ని వాళ్ళు కాదనలేరు అలాంటప్పుడు ప్రాతికామి వెళ్ళినా ఎవరు వెళ్ళినా ఒకటే అన్నాడు శకుని

వెంటనే ప్రాతికామిని ఇంద్ర ప్రస్థానికి పంపారు అతన్ని చూడగానే పాండవుల మనసు కీడు శంకించింది

మళ్ళీ ఏమైంది? అని అడిగాడు దర్మరాజు ఆదుర్దాగా

ప్రాతికామి తటపటాయించాడు

బహుమతులు గెలుచుకోండి!

ద్రౌపది సీరియల్

విడువకుండా చదవండి

బహుమతుల పథకం ఉన్నది!

-ఎడిటర్

ఏమైంది? ఎందుకు నీ మొహం అలా వుంది? చెప్పు దుర్యోదనుడు నిన్ను వెళ్ళగొట్టాడా?

లేదు

మరి

మిమ్మల్ని అనుద్యూతానికి రమ్మని మహారాజు కబురంపారు. ఈ సారి ఆడే ఆటే నిజమైన ఆటట గెలుపు ఓటమిల నిర్ణయం ఈ సారి నిష్పక్షపాతంగా జరుగుతుందట మహారాజు మిమ్మల్ని వెంటనే బయల్దేరి రమ్మన్నారు అని చెప్పాడు ప్రాతికామి

దర్మరాజుకి కాళ్ళకింద మట్టి అదిరింది తమ్ముళ్ళు నలుగురూ నిశ్చేష్టులై అలాగే నిలబడిపోయారు

బీముడు వున్నట్టుండి ఆవేశపడ్డాడు

మీకు తెలీదా– కేవలం మనల్ని బికారుల్ని చెయ్యడానికే ఈ ప్రయత్నం! మనం పరాక్రమదనులమని తెలిసి మనల్ని యుద్ధంలో ఓడించలేమని తెలిసి ఇలా మోసంతో జయిద్దామని




మేము రావని చెప్పు జూదాలూ దొంగాటలూ మాకు గిట్టవని చెప్పు వెళ్ళు–

బీమా

అది అన్న పిలుపో మందలింపో తెలీలేదు ఒక్కసారిగా మాటలు రాని వాడిలా అయిపోయాడు బీముడు దర్మరాజు రెండు చేతులూ సాచి తమ్ముళ్ళ నలుగురినీ దగ్గరకు తీసుకుని నాయనలారా మనమంతా ఏకోదరులమైనందుకు మీకీ శి తప్పదు మీ అన్న దర్మజ్ఞుడూ సంయమవంతుడు కావాలంటే మీరూ నాతో పాటు కష్టాలు పడాల్సింద విధి నియోగాన్నీ పితృ నియోగాన్నీ అతిక్రమించలే బలహీనుడ్ని నేను అన్నాడు అలా అంటున్నప్పుడ ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

బీముడు చటుక్కున కిందకు వంగి దర్మరాజ పాదాలు తాకాడు

## అనుద్యూతం

దర్మరాజు అనుజులతో సతితో మళ్ హస్తినాపురం ప్రవేశించాడు మునుపటిలాగే మళ్ అందరూ సభ తీర్చారు

శకుని దర్మరాజు కెదురుగా కూర్చుని పాచికల తీసుకున్నాడు

దర్మరాజా! దృతరాష్ట్ర మహారాజు మీ మీ ప్రేమతో క్రితంసారి మీరు జూదంలో ఓడిపోయి నప్పటికీ మీ రాజ్యాన్ని మీకు సమర్పించాడు అందుకని ఇంక ఆ రాజ్యంలో దేనినీ పందెంగ పెట్టొద్దు ఒక అపూర్వమైన పందెం చెబుతాన విను

ఈ సారి ఆటలో ఓడిపోయిన వాళ్ళ కృష్ణాజినమూ నారచీరెలూ కట్టుకుని కంద మూల ఫలాలు తింటూ బ్రహ్మచారులై పన్నెండేళ్ళు అరణ్యవాసం చేసి పదమూడో ఏడు ప్రజలెవరి తమ ఉనికి తెలియకుండా అజ్ఞాతంగా గడపాలి అజ్ఞాతవాస సమయంలో ఒకవేళ బయట పడి మళ్ళీ పన్నెండేళ్ళు అరణ్యవాసమూ ఒక ఏడు అజ్ఞాత వాసమూ చెయ్యాలి మరి ఇది నీ కిష్టమైతే ఆడు అన్నాడు శకుని

దర్మరాజు నిర్లిప్తంగా నవ్వి మామా! ఆడాలనేగ మళ్ళీ అనుద్యూతం అని పిలిచావు ఇంక నా ఇష్టా యిష్టాలతో పనేముంది? విధి నిర్ణయం ఎలా వుంటే అలా జరుగుతుంది సంపాదించడం పోగొట్టుకోవడం ఇవేవీ మన చేతుల్లో లేవని నా నమ్మకం దైవ నిర్ణితాలై వున్న శుభా శుభ కర్మలను ఏ ప్రాణీ తప్పించుకోలేదు అన్నాడు

శకునీ! నువ్వూ నీ మేనల్లుడూ ఈ పందెంలో గెలిస్తే గెలవొచ్చుగాక– కాని ఆత్మగత సంస్కార విషయంలో దర్మజుడిది ఎప్పుడూ పై చేయే అనుకున్నారు సభలో వున్న కురువృద్ధ బాంధవులు

* * * * * *

## ద్రౌపది

ఆట మొదలైంది

**అనుకున్నంత** సేపు పట్టలేదు- ఎత్తులు పన్నడంలో మోసాలు చేయడంలో ఆరితేరిన శకుని దర్మరాజుని క్షణాల మీద ఓడించాడు

చేసుకున్న ఒప్పందం ప్రకారం పాండవులు రాజ్యోపబోగాలన్నీ విడిచిపెట్టారు నార చీరలు కట్టారు హితులూ విప్రులూ తోడు రాగా అరణ్యవాసానికి సంసిద్ధులయ్యారు బీష్మ దృతరాష్ట్ర కృప ద్రోణాదులకునమస్కరించి విదురుడి దగ్గరకు వెళ్లారు

ఆయన చెమ్మగిల్లిన కళ్ళతో నాయనా మితి మీరిన మంచితనం ఎంత ప్రమాదమో అర్థమయిందా ఎప్పుడయితే నువ్వు దర్మజ్ఞుడవని పేరుబడ్డావో అప్పుడే తెలిసింది వీళ్ళకి నిన్ను మోసం చెయ్యడం పెద్ద కష్టం కాదని! నాయనా! నేను రేపటి నుంచీ లేచీ లేవగానే చేయబోయే ప్రార్థనేమిటో తెలుసా బగవంతుడా! దర్మరాజు మనసు కొంచెమైనా కఠినం చెయ్యి స్వామి అని కళ్ళ నీళ్ళు తెగి దర్మరాజు చేతుల మీద పడ్డాయి

తండ్రీ! నీతి విశారదుడైన విదురుడేనా ఈ మాటలు అంటోంది నమ్మలేనట్టు అడిగాడు దర్మరాజు

కన్నీళ్ళను ఆపుకోలేక దర్మరాజుని కౌగలించుకుని బావురుమన్నాడు విదురుడు

### కొత్తవాళ్ళతో ఛోప్డా చిత్రం

టివి మహాబారత్ నిర్మించిన రవి చోప్డా దరమ్‌శక్తి అనే చిత్రాన్ని నిర్మిస్తున్నాడట తన చిత్రాల్లో యిన్నాళ్ళుగా నటిస్తున్న హీరోలతో బోర్‌కొట్టిపోయిందట చోప్డాకు మిథున్ కుమార్‌గౌరవ్‌ల వంటి నటులతో మళ్ళీ సినిమా తీయకూడదని ప్రతిజ్ఞ తీసుకున్నాడట

ఎడుగురు కొత్తముఖాలతో కొత్త చిత్రాన్ని తీయాలని తలపోస్తున్నాడు చోప్రా మరి పాతవారి ముఖాలు మళ్ళీ తన సినిమాల్లో ఎందుకు చూపకూడదనుకున్నాడో ఎవ్వరికీ అంతుబట్టటంలేదట! కొత్తవాళ్ళు ఉద్ధరిస్తారనేమో!

దర్మరాజా! మీ తల్లి కుంతీదేవి వనవాస క్లేశాన్ని బరించలేదు మీరు తిరిగివచ్చేదాకా ఆమె కేలోటూ జరగకుండా నేను చూసుకుంటాను నాయనా నువ్వు దర్మజ్ఞుడవు బీముడు పరాక్రమ దనుడు అర్జునుడు శస్త్రాస్త్ర నిపుణుడు నకులుడు అర్థానర్థాలు తెలిసిన యశోనిది సహదేవుడు సంయమవంతుడు మీ పౌరోహితుడు దౌమ్యుడు అద్యాత్మ విద్యలో ఆరాద్యుడు

మా పాంచాల పుత్రి అర్థదర్మ విచక్షణా దక్షురాలు మిమ్మల్ని పంచ బూతాలూ సూర్య చంద్రులూ నిరంతరం కాపాడుదురు గాక! అన్ని విషయాలలోనూ అప్రమత్తంగా వుండండి దేవుడు మీ వెంటే వున్నాడు అని శోక గద్గద స్వరంతో విదురుడు ఆశీర్వదించాడు

దర్మరాజు చేతులు జోడించి తల్లి దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు

నగానట్రా లేకుండా నార చీరలు ధరించి తలలు వంచుకుని నిలబడ్డ కొడుకుల్ని చూడగానే కుంతీదేవికి శోకంతో గుండె చెరువైంది

నాయనలారా! ఈ స్థితిలో మిమ్మల్ని చూడకుండా సురలోకానికి పోయిన మీ తండ్రి 'దన్యుడు మాద్రి ఏం పుణ్యం చేసుకుందో బర్తతో పాటే తనూ వెళ్ళిపోయింది నేనురా పాపిష్టిదాన్ని ఈ దౌర్భాగ్యం చూసి ఏడుస్తూ బ్రతకమని బగవంతుడు నా మొహాన రాశాడు అదేమి పాపమో! కృష్ణుడి కూడా మీ మీద దయ లేకుండా పోయింది నాయనా కృష్ణయ్య తండ్రీ! నా బిడ్డలు నిరంతరం నిన్ను ద్యానిస్తూ నిన్ను కొలుస్తూ వుంటారే వీళ్ళనెందుకు రక్షించకుండా వుపేక్షిస్తున్నావు? వీళ్ళంత క్షమించరాని నేరమేం చేశారు? వాసుదేవా! నిజం చెప్పు పాండుకుమారులు రాజ్యం విడిచి వెళ్ళిపోవాల్సిందేనా?

నాయనా! సహదేవా! నువ్వు కూడా అన్నలతో అడవులకు పోతున్నావా తండ్రీ నువ్వొక్కడివీ నా దగ్గర వుంటే మీ అందరూ వున్నంత తృప్తిగా

హాతకులకో సవాల్!

# టిట్ ఫర్ టాట్

## -ఏంగురూ! దాదాగిరీ నుంచి చెంచాగిరీకి దిగి పోయావా?

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి- ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలేగాని బాదించకూడదు రసబరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్టవచ్చినట్లుండరాదు కార్డు మీద మాత్రం రాయాలి ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి మీ పూర్తి చిరునామా ముఖ్యం ప్రచురించిన రెంటికీ రు 25, రు 15 చొప్పున బహుమతి వుంటుంది!- ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం

**5-9-1989 లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!**

చాలా మంది వెంటనే' రిపార్టీలవర్షం కురిపించారు కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం బహుమతులు పొందిన రెండూకాక- మరికొన్ని యిక్కడ వేశాము తతిమ్మా వారి 'వాగ్బాణాలు స్థలాబావం చేత వేయలేకపోయాం లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం' ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్లీ ప్రయత్నించండి'

-ఎడిటర్

## "రైలుబండెక్కుదాం! దేశాలన్ని చుట్టుదాం! వస్తావా?"

**రు. 25 లు బహుమతి పొందిన రిపార్టీ :**

**"దేశాలెళ్లాలంటే పొగబండీ చాలదు- పొగవోడకాని, గాలివోడకాని కావాలి తెల్సా?"** -కోటి అనంతప్రసాద్ (కలకత్తా)

రు. 15 లు బహుమతి పొందిన రిపార్టీ

**"ఫ్రీప్యాసా! అయితే రెడీ ?"** -యం. సురేఖాదేవి, హైదరాబాద్

మరికొన్ని వాగ్బాణాలు

**"అబ్బ ఆశ! మూడు ముళ్లు పెడనీ... "**

కె. మాధవరావు (మాదన్నపేట), వి. జగదీష్ (వరంగల్)

**"డొంకతిరుగుడు మాటలెందుకండీ! హనీమూన్ వెళ్దాం అంటే నే వస్తాగా!"** -నేతి లక్ష్మీప్రసాద్ (మద్రాసు)

**"నేను రాను కాని నీవు వచ్చేటప్పుడు ఇండియా మాప్ ఒకటి పట్టుకురా!"** -కె. శ్రీనివాసులు (విడవలూరు)

లక్కీ పేర్లు

కె గోపీనాధ్ (తుమ్మూరు), ఎ. హిమబిందు (చిత్తూరు), వి కె విశ్వనాధ్ (వరంగల్), ఎ. గిరిధర్ (పుత్తూరు), ఓ అర్కె.రావ్, సి వి నరసింహదాసు (విజయనగరం), కె హరిబాబు (చిత్తూరు), డి. రామానుజులు (కలకడ), ఎ వేణు గోపాలరావు (పుత్తూరు), అవసర్తి రాంబాబు (తుని), కె.ఆర్.సి ఎల్ శ్రీనివాస్ (గుడివాడ), వి జె ప్రసాద్ (విశాఖపట్నం), ఎస్. నారాయణరెడ్డి (అనంతపూర్)

## ద్రౌపది

వుంటుందిరా నాయనా' అంటూ కుంతీదేవి సహదేవుణ్ని దగ్గరకు తీసుకుని పెద్దగా ఏడ్చింది

దర్మరాజు తడబడే కంఠంతో నేను జూదం తప్పని తెలిసి కూడా తప్పని సరిగా ఆడాల్సొచ్చిందమ్మా తమ్ముళ్ళనీ పాంచాల పుత్రినీ కూడా ఇక్కట్లకు గురి చేసి నీ మనసు నొప్పించానేమో అన్నాడు

దర్మరాజు తలదించుకుని వున్నప్పటికీ అతని కళ్ళు వర్షించడం ద్రౌపది గమనించింది పాంచాలి అత్తగారి పాదాలకు పాలతలం సోకేటట్లు సమస్కరించింది ఆమెను చూసి కుంతీదేవి వెక్కి వెక్కి ఏడ్చింది ఆమె ముఖాన్ని పైకెత్తి కన్నీళ్ళతో నే ముద్దాడింది

అమ్మా' కృష్ణా' నువ్వు పుట్టినందువల్ల ద్రుపదుని వంశమూ మెట్టినందువల్ల పాండవ వంశమూ పవిత్రమయ్యాయి పురుషసింహాలైన నీ బర్తలకు పరిచర్యలు చెయ్యబోతున్నావు సుఖంగా తిరిగిరా తల్లీ అని దీవించింది

తల వివబోసుకుని పాండుకుమారుల వెంట మౌనంగా నడచి వెళ్తున్న ద్రౌపదీ దేవిని చూసి కౌరవాంత పురాంగనలంతా సిగ్గుతో తలలు వంచుకున్నారు

పాండవులు రాజప్రాసాదం వెలుపలికి వెళ్ళి నిలబడ్డారు బీముడి మనస్సు కోపాగ్నితో మండుతోంది హరిహరాదులు అడ్డమొచ్చినాసరే నా గదాదండంతో దుర్యోదనాది ద్రోహులను యుద్ధంలో నాశనం చేస్తాను దుర్యోదనుణ్ని తొడలు విరగగొడ్తాను వాడి తలను నా ఎడమ కాలితో పెడేలుమని తంతాను దుశ్శాసనుడి రొమ్ము చీల్చి రక్తం తాగుతాను అని ప్రతిజ్ఞ చేశాడు

అరణ్య అజ్ఞాత వాసాలు పూర్తయ్యాక పద్నాలుగో ఏట నన్నెదిరి పోరాడే దుర్జనులందర్నీ నా గాండీవంతో చంపి పగ తీర్చుకుంటాను యుద్ధ రంగంలో మృతి చెందిన కురు కుమారుల రక్తాన్ని గ్రద్దలు ఆస్వాదిస్తాయి అన్నాడు అర్జునుడు కటువుగా

శకునిని మేము చంపుతాం అని నకుల సహదేవులు జంటగా పలికారు

ఆ ప్రతిజ్ఞలు విన్న వాళ్ళంతా దృతరాష్ట్రుడి కొడుకులు చచ్చినట్టే బావించారు పాండవులు హస్తినాపురం దాటి అడుగు అవతల పెట్టగానే దృతరాష్ట్రుడి మందిరంలోకి పట్టపగలే నక్కలు ప్రవేశించి బీకరంగా అరిచాయి

మిట్ట మధ్యాహ్నమే ఉల్కలు జారి కింద పడ్డాయి

మేఘాలు లేకుండా ఆకాశంలో మెరుపు తీగలు మిల మిలమన్నాయి

మబ్బు లేకుండా పిడుగుపడింది

ఆకాశంలో రాహువు సూర్యుణ్ని పట్టాడు

భూమికంపించింది

నేల బీటలు వారింది (ఇంకా వుంది)

కొత్త రచయితల
"వర్క్ షాప్"
ముగింపు తేది : 31-8-'89

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## కొత్త రకం కథల పోటీ!

కథకో రూ. 100 కథకో రూ. 100 అట్లా వారం వారం లెక్కలేనన్ని "వంద" రూపాయిల బహుమతులు!

★ మీరు కొత్తగా రచయితలవ్వాలనుకుంటే యిదో "వర్క్ షాప్"

★ 'టాపిక్' మేమేయిస్తాం! దాని మీద రెండున్నర అర ఠావులు మించకుండా విడి విడి పంక్తులలో చిన్న కథలు అల్లి పంపాలి.

★ ఎంపికైన కథలు వీక్లీలో పడతాయి. పడ్డ కథకి 100 రూపాయిలు బహుమతి అందుతుంది!

## వరద లొచ్చాయి!

ఇదండీ టాపిక్! దీని మీద కథ అల్లి యీ దిగువ కూపన్ పూర్తి చేసి పంపాలి! పేరు చిరునామా హామీ వగైరా నింపాలి. జత చేసి కథతో పాటు పంపాలి! రచనలు త్రిప్పి పంపబడవు.

★ కూపన్ నింపడం వల్ల మీకు గల ప్రయోజనం?- ప్రతి 50 కూపన్‌లను "లక్కీ డిప్" తీసి కథ పడ్డా పడకపోయినా- 6 మాసాల చందా బహుమతిగా వారికి 6 మాసాలపాటు వారపత్రిక పంపిస్తాము

★ సంపాదకునిదే తుది నిర్ణయం

-సం

ఆంధ్రసచిత్ర వారపత్రిక "వర్క్ షాప్" కూపన్

టాపిక్ వరద లొచ్చాయి!

హామీ రచన నా సొంతం కాపీ కొట్టలేదు

పేరు

చిరునామా

ముగింపు తేదీ : *31-8-89*

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము ...ఆరవ భాగము

(గత సంచిక తరువాయి)
























... గేయరచన ...
నండూరి రామమోహనరావు — బొమ్మలు... బాపు




























(ఇంకావుంది)

# వారఫలం

**25-8-1989 శుక్రవారం మొదలు**
**31-8-1989 గురువారం వరకు**

**మేషం** వ్యాపారాన ఒడిదుడుకులు రావు వ్యవహారములందు బహు జాగరూకతతో సంచరించాలి సాహితీ రంగాన కొందరకు అనుకూలం సాదు సజ్జన సాంగత్యమున్నది వాదోపవాదాలతో కాలం వ్యర్థం చేయకండి స్త్రీలకు బందు మిత్ర సమాగమం దనవసతి

**వృషభం** గురుని అనుగ్రహమున్నది ద్వితీయ రాశియందు స్థితి ఆ కారణమున దన విషయంగా ఏమాత్రం లోటు రాదని గ్రహించాలి దూర ప్రయాణాలందు బహు జాగ్రత్తగా సంచరించుట మేలని గ్రహించాలి శుబదాయక దినాలని గ్రహించి శ్రమించండి స్త్రీలకు దన వసతి వృత్తి పెంపు కళారంగ ప్రతిబ

**మిదునం** విరోదివర్గమున్నది ఎంత చాకచక్యంతో మెలగితే గాని వారమంతా శుబదాయకంగా జరుగదు అయినవారితో గాని మిత్రులతో గాని తగాదాలు రాకుండా చూచుకోవాలి ఇరుగు పొరుగు తగాదాలు రాకుండా చూచుకోవాలి స్త్రీలకు కళారంగ ప్రతిబ ఉద్యోగమందు పెంపు

**కర్కాటకం** వారమంతా శ్రేయోదాయకం శుబ వర్తమానం అందుతుంది విద్యావేత్తల సహాయమున్నది కళా సాహితీ రంగానుకూలత చెప్పదగిన ముఖ్యాంశం రాజకీయవేత్తలకు శుబదాయకమని గుర్తించాలి చలన చిత్ర రంగానుబవం గలవారికి అనుకూలం స్త్రీలకు వృత్తి వికాసం నూతన మిత్ర సాంగత్యం రాజకీయమందు మేలు

**సింహం** కానివర్గమున్నది గమనించి తిరగాలి ఇరుగు పొరుగువారితో తగాదాలు రాకుండా చూచుకోవాలి ఆరోగ్య బాగ్యానికి లోపం లేదు చాల కాలంగా ఎటూ తెమలని గృహ సమస్య పరిష్కారం కానున్నది వృత్తియందు పెంపు చేకూరుట నిశ్చయం స్త్రీలకు సబా గౌరవం వృత్తియందు పెంపు సజ్జన సాంగత్యం

**కన్య** దన దాన్య వసతి యున్నది సుఖ శాంతులున్నాయి కుటుంబానందమున్నది ఆరోగ్య బాగ్యమున్నది బందు మిత్ర సహాయమున్నది స్థితియందు పెంపు చేకూరనున్నది సబా గౌరవమున్నది సాదు సజ్జన సాంగత్యమున్నది వృత్తియందు పెంపుచేకూరుటచే వారమంతా ఆనందదాయకం స్త్రీలకు అబిమానించే వారున్నారు కొందరకు వాహన సేకరణకు అనుకూలం

**తుల** తృతీయమందలి వక్ర శని బాగ్య గురుడు బహు విదముల వివిద రంగాలందు మేలు చేయనున్నాడు ఉత్తములైనవారికి యిది బంగారువంటి కాలం దనలోపం ఏ మాత్రం రాదు మీ కళా రంగ ప్రతిబకు వికాసమున్నది ఖర్చులు అదుపులో పెట్టుకోండి స్త్రీలకు దన వసతి వృత్తి వికాసం

**వృశ్చికం** ద్వితీయ శని దోషియే అయినా గురు గ్రహ వీక్షణలు యున్నది ఆనందదాయకుడు ఆరోగ్య లోపం రానీయడు యత్న కార్యసిద్ధి కోర్టు వ్యవహారాలున్న అనుకూలమే నిరుత్సాహంతో కార్యాచరణమునకు ఉపక్రమించకండి స్త్రీలకు ఉత్తమ కాలం ఉద్యోగరీత్యా బహుజాగరూకత అవసరం గ్రహించాలి

**ధనుస్సు** తృతీయ రాహువు సప్తమ గురుడు సకల విధాల మేలు చేయగలరు ఇంట శుబం జరుగుట నిశ్చయం కళారంగాన మీ ప్రతిబ రాణిస్తుంది ఉత్తరాషాఢ జాతకులకు మం మేలని గ్రహించాలి అప్రయత్న దనలబ్ధి సుఖ శాంతులు స్త్రీలకు దన వసతి ఉద్యోగమందు మేలు యోగదాయక కాలంగా గ్రహిస్తారు

**మకరం** వ్యయ శనిగ్రహాన్ని గురుడు వీక్షించుటచేత మీకు ఏవిదంగా యిబ్బంది రాదు మీకు సాయశక్తుల సహకరించువారున్నారు మీ బాట రాచబాటగా ఉంటుంది అయినవారి సహాయ సంపత్తు లున్నాయి అప్రయత్నంగా దన వసతి ఏర్పడగలదు స్త్రీలకు సబా గౌరవం రచనా రంగాన అనుకూలత గ్రహించాలి

**కుంభం** ఆరింట రవి యోగ కారకుడు ధన విషయంగా ఎలాంటి యిబ్బంది రాదు చేతికి చిక్కిన అవకాశాన్ని జారవిడువకండి బందు సంబందం నిశ్చయింపబడనున్నది ఏ వృత్తి ఉద్యోగాలలో ఉన్నవారికైనా మేలున్నది కుటుంబానందమున్నది స్త్రీలకు నూతనోద్యోగ యత్నం సపలం అధిక ఖర్చులుండవచ్చు

**మీనం** గ్రహానుకూలత గల వారం ఆడిన ఆట పాడింది పాట గా వారమంతా గడిచిపోతుంది అన్ని రంగాలలో అబివృద్ధికరమైన మార్పులు రానున్నవి ఆదాయాన్ని మించిన వ్యయం ఉండవచ్చు గమనించి మెలగాలి ఆరోగ్య లోపం రాదు చాలాకాలంగా యిల్లు వదలి వెళ్లినవారు యిల్లు చేరవచ్చు స్త్రీలకు వారమంతా ఉత్సాహ జనకం ఆశించిన పలితాలు అందనున్నవి కళారంగాన వికాసమున్నది గ్రహించాలి

–విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# యువతా! కవితా!!

## ముసుగులు

ఇది నటనా ప్రపంచం
లేదులే ఇట మంచికి స్థానం!
తేనెల మాటలతో
తెచ్చిపెట్టుకున్న నగవులతో
ఎదుటివారిని భ్రమింపజేయటం
ఈ లోకనైజం!
ముసుగులలో బ్రతికే ఈ
మనుష్యుల నడుమ
నీ మనుగడ సుగమం కావాలంటే
నీవూ ఓ ముసుగులో
జీవించక తప్పదు!

- ఎ.వి.జి.యస్.మూర్తి

## భక్తి

ఒకప్పుడు
ముక్తికోసం
ఈనాడు
భుక్తికోసం!

## నిజం

నదులెన్నైనా
కలిసేది సాగరగర్భంలోనే
నరులెందరూ
చేరేది శ్మశానధూళిలోనే!

-శ్రీమతి లక్ష్మీభువన్

## హృదయ స్పందన

ప్రియా
మాటలకందని భావాలు
నీ కళ్ళలో దోబూచులాడినప్పుడు
బుంగమూతి పెట్టి లెక్కిరించినప్పుడు
చూపు మరల్చాను ఎందుకో తెలుసా?
ఈ ఆనందం తాత్కాలికమనీ
నిన్ను పొందుచేరువలో లేవనీ తెలిసి
ఇనప తెరలతో హృదయాన్ని బంధించా
ఇది నాకు నేను విధించుకున్న శిక్ష
అయినా అప్పుడప్పుడూ
కారుమబ్బులు కమ్ముకున్న నాయెదలో
నీ జ్ఞాపకాలు ఈదురుగాలులై
నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే
ఒక్కటే ఆలోచన
మరో జన్మంటూ వుంటే
నా హృదయ సామ్రాజ్యానికి
మహారాజ్ఞివి నువ్వేకావాలని!

-దాసరి విజయభాస్కర్



## కుంభకోణం

రేఖ మీద రేఖ
నిటారుగా నిలబడితే
అది లంబకోణం!
అధికారం ముసుగుతో
కోట్లను స్వాహా చేస్తే
అది కుంభకోణం!

-పాటిబండ్ల శ్రీమన్నారాయణ

## అక్షరం

అక్షరం-
నా మస్తిష్క సరోవరంలో
రేగిన అలల భావాలకు
రూపాన్నిచ్చింది!
అక్షరం-
నా హృదయాకాశంలో
ఎగిరే ఊహల పక్షులకు
స్థానమై నిలిచింది!
అక్షరం-
నా 'లవ్'బిజినెస్ బ్యాలన్స్‌షీట్‌లో
మైనస్‌పాయింట్లను విశ్లేషణ చేసింది
మనిషంటే
మారణాయుధం అంటూ వివరించింది!
నీవు- నీ ప్రేయసి,
నీవు- నీ ప్రేమ,
నీవు- నీ కవిత్వం, అంటూ,
విడదీసి- వివరించి- హద్దులు గీతలు గీసింది
నీ జీవితాన్ని శాసించేది శ్లేషించేది నేను-
నీ జీవన కథనరంగంపై ప్రధానపాత్రను నేను-
నిన్ను వెన్నంటుతూ నడిపించి- కడవరకు
కాపాడేది నేనే
అంటూ భయపెడుతూ, అభయమిచ్చింది
అందుకే అక్షరమంటే నాకు భయం
అక్షరమంటే నాకు ప్రియం!

-బొండాడ శాంతిరాజా

## ప్రతిఫలం

ఆరేళ్ల
ప్రాయంతో
అజ్ఞానమనే భూమిలో
విద్య అనే మొక్కను నాటి
చెమటోడ్చి పెంచారు
పదునైదు సంవత్సరాలు -
ఆ మొక్క వృక్షమై
అతి తక్కువ కాలములోనే
పూత - పిందెతో
కలకలలాడి
చివరకు
నాకు
నవ్వుతూ అందించింది
నిరుద్యోగమనే ఫలాన్ని!!

- కె శ్రీప్రియ

## వింత మార్పు

వింతగా చూస్తావు వేనిక
వెర్రివాడా అదే తొండ
కీటకాలు స్వాహా చేసేందుకు
మాటున పొంచి చూస్తుందది
అమాయకం అనుకోబోకది
తమాషా పన్నుగడకు నాంది
కీటకాలను తిని బలిసిన నాడు
వాటంగా రంగు మార్చేస్తుంది మారు
ముదిరిన ఆ తొండే అవుతుంది
మోసాల ఊసరవెల్లి
ఊసరవెల్లి ముదిరితే
పాపమైనా పసుతుంది కానీ
ఏనాటికీ అది మళ్ళీ
ఎప్పటికీ తొండగా మారదు

-కొక్కరగడ్డ కామశాస్త్రి




హాస్య నవలికల పోటీలో ద్వితీయ బహుమతి నవల!

కాస్త పలు చూసుకొని వీరమ్మ బర్త దగ్గరకు పోయింది

పెద్దలందరి మద్యా కూర్చుని గొంతెత్తి అరుస్తూ ఏవేవో చెబుతున్నాడు వీరమ్మను చూసి జనంలో నుండి తప్పుకొని బైటకు వచ్చాడు

అబ్బాయిని మంగళ స్నానానికి తీసుకెళ్లాలి స్నేహితులతో కబుర్లాడుతూ కూర్చున్నాడో ఏమిటో వెళ్ళి పిలవండి అంది

లింగోజీ ఆమె వంక వింతగా చూశాడు

అబ్బాయి నీతో రాలేదా? దగ్గరుండి తీసుకు రాలేదా? అన్నాడు

బలేవారే స్నేహితులతో ముందే వచ్చాడుగా గదిలో లేకపోవడం చూసి నేనే తాళం పెట్టి వచ్చాను ఇంతకీ వాడిక్కడకు రాలేదా? అంది

రాలేదు అక్కడ కూడా లేడని చెబుతున్నావ్? ఇంతకీ ఎటు పోయినట్లు? విసుగ్గా చూసి చిట్టిబాబు స్నేహితుల్ని పిలిచాడు కాని వారు కూడా అదే సమాదానం చెప్పారు

మేం కలసి వస్తామంటే మీరేగా మమ్మల్ని ముందుగా పంపించారు? అని ఎదురు ప్రశ్న వేశాడు శ్రీరామ్

బాగా ఆలోచించి అన్నాడు లింగోజీ

వెదకండి వేరే కార్లో ఒక్కడూ వచ్చేసి వుంటాడు ఎక్కడో ఒక చోట వుండి వుంటాడు కాస్త వెదకండి అన్నాడు అంతా కలిసి చిట్టిబాబు కోసం చుట్టూ గాలించారు

మస్తుగా తిని ఎక్కడైనా పడుకున్నాడేమో! అన్నాడు సారధి

కరెక్ట్ ఈ ఆలోచన సరిగా వుంది పదండి అంటూ కళ్యాణమండపంలో వుండే విశ్రాంతి గదులన్నీ వెదకసాగేరు కాని ఫలితం లేకపోయింది

శ్రీరామ్‌కో ఐడియా వచ్చింది

ఫ్రెండ్స్ అసలు మనవాడు హోటల్లోనే వుండి వుంటాడు ఎవరైనా ఒకసారి వెళ్ళి చూస్తే

(గత సంచిక తరువాయి)

బాగుంటుంది అన్నాడు

స్కూటరిస్తే నేను పోయి వస్తాను అన్నాడు సాయి విషయం విన్నాక లింగోజీ ఆలోచించి పదండి అంతా కార్లో వెళ్దాం అన్నాడు కారెక్కి సరాసరి హోటల్‌కి వచ్చారు

అప్పటికే పదకొండు గంటలయ్యింది నిద్రను ఆపుకుంటూ కునుకు తీస్తున్న రిసెప్షనిస్ట్ వీరిని చూసి కళ్ళు తెరిచాడు

ఏం లేదూ మా బంధువులంతా వచ్చారో ఇంకా ఎవరైనా వుండిపోయారో ఒకసారి చూసిపోదామని వచ్చాం అన్నాడు

శ్రీరామ్ తన బృందంతో లిఫ్ట్‌లో పైకి పోయి ప్రతి గదీ చెక్ చేశాడు అన్నిటికీ తాళం కప్పలు వ్రేలాడుతున్నాయి

నిరాశతో క్రిందకు దిగి వచ్చారు

ఎవరూ లేరు సార్ గదులన్నీ తాళాలు వేసే వున్నాయి అన్నాడు శ్రీరామ్ లింగోజీ హతాశుడయ్యాడు అతని ఎడం కన్ను అదిరింది

ఇంతలో కౌంటర్లో ఫోన్ మ్రోగింది రిసీవర్ ఎత్తి మాట్లాడిన రిసెప్షనిస్ట్ సార్ ఫోన్ మీకో అంటూ లింగోజీకి అందించాడు

ఖచ్చితంగా చిట్టిబాబే అయ్యుంటాడు అన్నాడు సాయి

హలో హలో హల్లో! అరిచాడు లింగోజీ అందరూ చెవులు మూసుకొన్నారు

బావగారూ! నేను సాంబయ్యను ఏడీ వరుడు? ఇంకా తీసుకురాకపోతే ఎలాగండీ కార్లో మీరు బయల్దేరి వెళ్లారని చెప్పినా పురోహితుడు చిందులు త్రొక్కుతున్నాడు ఈసరికి పీటల మీద కూర్చొని వుండాలట చెయ్యాల్సిన తతంగం చాలా వుందని నానా గొడవ చేస్తున్నాడు మీరు చాలా అర్జెంట్‌గా వచ్చేయాలి అన్నాడు ఫోన్‌లో

ఆఁ ఆఁ వచ్చేస్తున్నాం అంటూ నీరసంగా ఫోన్ పెట్టేశాడు

చివరి ఆశకూడా తీరిపోయింది అబ్బాయిలూ ఇక్కడ లేడు అక్కడకు యింకా రాలేదని ఫోన్ - ఎం చెయ్యాలీ - అసలీ వెదవ ఎటుపోయినట్లు? నా కొంపముంచేలా వున్నాడు అంటూ తలపట్టుకొన్నాడు

ఎమిటిసార్ ప్రోబ్లెమ్? అడిగాడు రిసెప్షనిస్ట్

మా మనిషి ఒకరు మిస్‌అయ్యారు వెదుకుతున్నాం అన్నాడు సారది

సార్! ఎవరో ఒకవ్యక్తి మీ తాలూకేనని చెప్పాడు బాగా త్రాగివచ్చి నిద్రపోవాలని అడిగాడు బోయ్‌తో చెప్పి ప్రక్కనున్న హాల్లో మడతమంచం ఎర్పాటు చేశాను ప్రస్తుతం అక్కడే వున్నాడు అని చెప్పాడు

సర్కస్ ఫీట్ చేసినట్లు గెంతుకొంటూ అంతా హాల్లోకి పరుగుతీశారు కాని అక్కడ గుర్రుతీస్తూ నిద్రపోతున్న కరీం కన్పించాడు ఆశ నిరాశ కాగా దిగులుగా వెనక్కు తిరిగారు

ఇప్పుడేం చెయ్యాలి? ఎక్కడ వెదకాలి? ఇదే ప్రశ్న వారిని వేదిస్తోంది

రెండుగంటల్లో ముహూర్తం పెళ్ళికొడుకు మాయమయ్యాడని తెలిస్తే ఎంత అప్రతిష్ఠ చీచీ పైగా కట్నం డబ్బు కొత్త నోట్లకట్టలు కూడా తీసుకొని భద్రపరిచాడు ఈ విషయం తెలిస్తే సాంబయ్య ఏం చేస్తాడోననే భయం లింగోజీకి ఆందోళనతో బీ పీ పెరిగిపోతూంది అందరూ కలసి కారెక్కారు

ఒకపనిచేస్తే ఎలావుంటుంది? పోలీస్‌రిపోర్ట్‌ యిస్తే సాయి అన్నాడు

లాభంలేదు ముహూర్తం టైమ్‌కి వాడ్ని వెదికి పట్టుకొనే సామర్థ్యం పోలీసులకులేదు నగరమంతా గాలించి ఆ పని మనమే చెయ్యాలి చిట్టిబాబు ఎక్కడున్నాసరే పట్టుకోవాలి అన్నాడు శ్రీరామ్ అంతా తీవ్రంగా ఆలోచించసాగేరు

అదేసమయంలో మాంచి నిద్రలోవున్న చిట్టిబాబు ఉలిక్కిపడి లేచాడు కళ్ళు నులుముకొని చుట్టూ చూశాడు అప్రయత్నంగా చేతికున్న గడియారంలో టైం చూస్తే పదకొండూ పదిహేను నిముషాలు చూపిస్తోంది మత్తు వదిలిపోయింది

ఇదేదో కొంప మునిగేలావుంది నా కోసం ఎవరూ రాలేదంటే నే నిక్కడ వుండననే బావంతో నే ఎవరూ వచ్చివుండరు ఎం చెయ్యాలి? ముహూర్తం వేళ ముంచుకొస్తూంది నేను కన్పించకపోతే నాన్న కోపంతో చిందులు త్రొక్కడమేకాదు - నరికి పోగులు పెట్టేయడం ఖాయం ఎలా? అనుకొని జుత్తు పీక్కున్నాడు

ఆ గదిలో నుండి ఎలాగైనా బయటపడాలి ఎవరూ చూడకుండా మాయమైపోతే చాలు ఏ ఆటో నో పట్టుకొని కళ్యాణమండపం చేరుకోవచ్చును అప్పటికీ ప్రశ్నలతో వేదించి చంపుతారని తెలుసు కాని యీ గండం నుండి బైటపడతాడు

ఆ గదిలో తిరుగుతూ బైటకుపోయే మార్గం కోసం

వెదికాడు కాని ఒకే మార్గంతప్ప వేరే దారులు లేవు ఆ దారి ఒక్కటే బందించివుంది బాత్‌రూమ్‌లోకి పోయాడు

పైన వెంటిలేటర్ కనిపించింది

గుడ్డిలో మెల్ల' అనుకొని ఒక స్టూల్ తెచ్చి వేసుకొని వెంటిలేటర్‌లో నుండి పైకి చూశాడు అతని అదృష్టం బాగుంది ప్రక్కనే పిట్టగోడ వుంది దాని నాధారం చేసుకొని ఎలాగోలా తప్పించుకోవచ్చును

కాని వెంటిలేటర్‌కు గాజు అద్దాలున్నాయి

ఒక్కక్షణం ఆలోచించాడు చిట్టిబాబు అద్దాలు పగలగొడితే చాలు మనిషి పట్టే దారి ఏర్పడుతుంది ఎలా పగలగొట్టాలి?

తిరిగి గదిలోకివచ్చి తగిన సాధనంకోసం వెదికాడు

తండ్రి నిత్యం ఉపయోగించే గొడుగు సామాన్ల మధ్యలో కనిపించింది ఉత్సాహంగా తీసి దానినే ఒక ఆయుధంగా వాడి ఎలాగో అద్దాలు పగలకొట్టాడు

ఆ సమయంలో గాజు పెంకులు క్రిందపడి చిట్టిబాబు చేతిమీద స్వల్పంగా గాయమయ్యింది అయినా పట్టించుకోలేదు

అత్యుతగా స్టూల్ ఎక్కాడు

వెంటిలేటర్ కోసం వుంచిన ఖాళీ జాగాలో ముందుగా తల పెట్టి నెమ్మదిగా ముందుకు జరిగాడు చేతులు అడ్డం వచ్చాయి ఈసారి చేతులు ముందుపెట్టి తర్వాత తల పెట్టాడు ఈ పద్ధతి వీలుగా తోచింది బలమంతా ఉపయోగించి ముందుకు కదిలాడు

కొంతవరకూ విజయం సాధించాడు

ఈసారి మరీ ఫోర్స్‌గా ముందుకు దేకి ఆగిపోయాడు ఆశ్చర్యం! కాళ్ళు పైకి తేలిపోయాయి కాని విశాలమైన పొట్ట మాత్రం మధ్యలో యిరుక్కుంది ఇక ఒక అంగుళం కూడా ముందుకి



వెనక్కి కదిలే అవకాశం పోయింది నిస్సహాయంతో బాదగా అరిచాడు

* * * * * *

రాత్రి ఎన్మెండు గంటలకు నగరమంతా తిరిగిన కారు వెనక్కు తిరిగి కళ్యాణమంటపం కేసి పరుగు తీసింది దూరంగా కన్పించే విద్యుద్దీపాలు చూసి లింగోజీ కారు ఆపండి అని అరిచాడు సడెన్‌బ్రేక్‌తో కారు ఆగిపోయింది లింగోజీ కారు దిగాడు

బెంజి సర్కిల్ సమీపంలో వున్న పార్క్ దగ్గరకు పోయి కూర్చున్నాడు శ్రీరామ్ బృందం కూడా దిగి అక్కడకు వెళ్ళారు

అయిపోయిందయ్యా నా పరువు గంగలో కలిసి పోయింది నేను అక్కడికి రాను రాలేను అన్నాడు లింగోజీ బాదతో

దూరంగా మంగళ వాయిద్యాలు విన్పిస్తున్నాయి

కారు డ్రైవర్ వారివంక విచిత్రంగా చూస్తూ బీడీ అంటించాడు అతనికి పరిస్థితి అర్థమయింది ఈ పెళ్ళి రసాబాస కాక తప్పదు అనే ఫీలింగ్ రాగానే నగటు మనిషిగా ఆ వ్యవహారంతో సంబంధం లేని వ్యక్తిగా అతనెంతో ఆనందించాడు

ఒకరు బాదలో వుంటే అవమానానికి గురి కావలసిన స్థితిలో వుంటే– చూసేవారికి వినోదం తప్ప సానుభూతి వుండదు ఇదీ నేటి లోకపు తీరు

సార్ మీరిలా మధ్యస్థంగా కూర్చుండిపోతే మీ వాళ్ళందరూ ఏం కావాలి? అమ్మగారెంత బాద పడతారు? అన్నాడు శ్రీరామ్

నిజమే కాని ఏ ముఖం పెట్టుకొని వియ్యంకుడికి ముఖం చూపించాలి?. కారణం ఏం చెప్పాలి? దీనివల్ల అనేకమైన అనుమానాలు వస్తాయి పెళ్ళి యిష్టం లేక పెళ్ళికొడుకు పరారీ అయ్యాడంటారు

సాంబయ్య నా మీద పరువునష్టం దావా వేస్తాడు నేనూ నా వాళ్ళూ కలసి ఏదైనా గంగలో దూకాల్సి వస్తుంది

మీరింకా చిన్న వాళ్ళు యీ గొడవలు మీకు తెలియవు ఈ బాదపడేకన్నా చిటికెడు విషం మ్రింగి–

సార్! మరేం వర్రీ కాకండి ఈ విషయం నాకు వదిలేయండి ఏం చేయాలో నేనే చూసుకొంటాను మీరు మాట్లాడకుండా కార్లో పడుకొని కళ్ళు మూసుకోండి స్పృహతప్పి పోయారని చెబుతాను ప్రస్తుతానికి యీ ప్రశ్నలకు సమాధానం చెప్పే పని తప్పి పోతుంది

అయితే ఒక విషయం డ్రైవర్ వాళ్ళ మనిషి ఈ నాటకం వాడికి తెలిస్తే రసాబాసే కనుక కారెక్కగానే బాధగా అరిచి వెంటనే సీటు మీదకు ఒరిగి పోండి అన్నాడు శ్రీరామ్

ఎలాగయ్యా! నా కిలాటివి వచ్చి చావదే! పైగా బయం కూడా–

సినిమాల్లో తండ్రి పాత్రలు గుర్తు చేసుకోండి నటించడం అదే వచ్చేస్తుంది నేను చెప్పేవరకూ లేవకండి ఇకపోతే జరిగేది మీరు చూడక పోయినా మీ చెవులకు విన్పిస్తూనే వుంటుంది దాని ప్రకారం నడుచుకో వచ్చును అన్నాడు శ్రీరామ్

ఇదే గుడ్ ఐడియా! అంటూ బలపరిచారు మిత్రులంతా

సరే చేసే దేముంది రోట్లో తలపెట్టాక రోకటి పోటుకు వెరుస్తామా! కానివ్వండి అంటూ లేచి నిల్చున్నాడు

కార్లోకి ఎక్కగానే వాళ్ళ ప్లాన్ అమలు జరిగింది

ఏమైంది సార్– అలా పడిపోయా రేమిటి? ఖంగారుగా అన్నాడు డ్రైవర్

ష్– మాట్లాడకు గుండెపోటు వచ్చింది స్పృహతప్పి పోయారు అన్నాడు శ్రీరామ్ డ్రైవర్ బయపడ్డాడు

సరాసరి హాస్పిటల్‌కు పోనివ్వమంటారా? అడిగాడు

వద్దు కళ్యాణమంటపానికే పోనివ్వు మేమంతా డాక్టర్లమే తగిన చికిత్స చేస్తాం అన్నాడు శ్రీరామ్ కారు ముందుకు పోయింది

గేటు ముందు మిలిటరీ బ్యాండ్‌తో సిద్ధంగా వున్నాడు సాంబయ్య ఆడా మగా కళ్ళు కాయలు కాచేలా పెళ్ళి కొడుకు ఆగమనం కోసం ఎదురు చూస్తున్నారు కారు రావడం చూడగానే బ్యాండ్ మాస్టర్ తన బృందానికి సూచన లిచ్చాడు

చుట్టు ప్రక్కల మైలు దూరం వరకూ విన్పించేలా అదరగొట్టేశారు మిలిటరీ బ్యాండ్‌తో పెళ్ళి మండపంలో జనమంతా ఒకరి నొకరు త్రోసుకొంటూ గేట్లోకి రాసాగారు

కారు నెమ్మదిగా వచ్చి ఆగింది

స్వాగతం పెళ్ళి కుమారా! ఇంత మందిని యీవిదంగా నిరీక్షణలో పెట్టడం నీకు బావ్యమా కారు దిగి రమ్ము అంటూ చలోక్తి విసిరాడో బావకవి శ్రీరామ్ బృందం కారు దిగారు

ప్లీజ్– దారి యివ్వండి పెళ్ళి కొడుకు రాలేదు అతని తండ్రిగారికి గుండె పోటు వచ్చింది వెంటనే అయనకు వైద్యం చెయ్యాలి అని చెబుతూ నలుగురూ సాయంపట్టి లింగోజీని బైటకు తీశారు

కట్టెలా బిగుసుకు పోయిన లింగోజీ మౌనంగా వింటున్నాడు ఆరి దేవుడోయ్ యిదేం ఖర్మ అంటూ వీరమ్మ శోకాలు ప్రారంబించింది

బ్యాండ్ వాళ్ళు వాయిద్యం ఆపు చేశారు

అంతా తొలగి దారి యిచ్చారు కాని అక్కడితో ఆగలేదు

పెళ్ళికొడుకు ఎక్కడ?

ఎందుకు రాలేదు?

అసలు ఏమయ్యాడు? – అవన్నీ ప్రశ్నలే

కాని సమాదానం చెప్పేవారే లేరు

లింగోజీని ఒక గదిలోకి చేర్చి పడక ఏర్పాటు చేశారు సాంబయ్య అయోమయంగా చూస్తుండి పోయాడు ఇంతలో పురోహితుడు వచ్చాడు

అయ్యా వియ్యంకుడికి అస్వస్థగా వున్న మాట నిజమే డాక్టర్లు వున్నారు వైద్యం చేస్తారు కానీ ఈ ముహూర్తం దాటి పోకుండా పెళ్ళి జరిపించాలి ఆ విషయం ఏం చేశారు? అన్నాడు

సాంబయ్యలో చలనం కలిగింది

ఏమయ్యా! పెళ్ళి కొడుకేడీ– తండ్రికి అనారోగ్యం అని తెలిసిందా? అని అడిగాడు శ్రీరామ్ వెంటనే జవాబు యివ్వకుండా లింగోజీని పరీక్ష చేస్తున్నట్లు నటించ సాగేడు సారది సాయి సుబ్బారావు సీరియస్‌గా పోజులిచ్చి చుట్టూ మూగి చూస్తున్నారు

మిమ్మల్నే– ఏడీ వరుడు? అరిచాడు సాంబయ్య

మైల్డ్ స్ట్రోక్– అయినా ఎమర్జెన్సీ ట్రీట్‌మెంట్ యివ్వాలి అన్నాడు సాయి

పెళ్ళికొడుకు ఏమయ్యాడూ? అన్నాడు సాంబయ్య

ఈ కేసులు రాను రానూ కాంప్లికేటిడ్ కావచ్చును అన్నాడు సారది

'మీ కేమైనా చెముడా– పెళ్ళి కొడుకు ఏదీ?

పల్స్ వీక్‌గా వున్నాయి కేసు అనుమానమే అన్నాడు సుబ్బారావు

సాంబయ్య జుత్తు పీక్కొన్నాడు కథాకళి నృత్యం చేశాడు

చూడండి? మీరు కాసేపు బైటకు వెళ్తారా? పేషెంట్ ప్రాణాపాయ స్థితిలో వున్నాడు అన్నాడు శ్రీరామ్ సీరియస్‌గా

## అల్పసందేశం

ఓ సత్కవీ .
కవితావేశపు వెల్లువలో
జాలువారిన ప్రతి అక్షరం
జాతి సమైక్యతను ఖ్యాతం చేయాలి!
ఓ వక్తా...
ఉపన్యాసోద్రేకంతో
వృదివిచేరిన ప్రతి పదము
కుల, మత, ప్రాంతీయ తత్వాల్ని రూపుమాపాలి!
ఓ గాయకుడా,
సంగీతాభిమానంతో
గొంతు విప్పిన ప్రతి పాట
జాతినేతల కీర్తిప్రతిష్ఠలు చాటి చెప్పాలి!
ఓ మాతృమూర్తీ...
బిడ్డపై ప్రేమానురాగాలుతో
రొమ్ము రాల్చిన ప్రతి పాలచుక్క
దేశభక్తిని వారికి జీర్ణింపచేయాలి!

– వియ్యన్నార్ కాండూరి

## క్రీడారంగం

# 'పీలే'కు బ్రహ్మరథం



ఒలింపిక్ హాకీలో స్వర్ణ పతక విజేతలు, ఆసియా క్రీడోత్సవాలలో బంగారు పతకాలు గెల్చినవారు యితర అగ్రగామి ఆటగాళ్ళు మనదేశంలో వృద్ధాప్యములో అనేక కష్ట నష్టములు అనుభవించు చున్నారు క్రికెట్ టెన్నీసు లాంటి క్రీడలలో పాల్గొన్న వారిని మినహాయించితే మిగతా క్రీడాకారుల అందరి పరిస్థితి అతి దీనముగా ఉన్నది

పాశ్చాత్య దేశాలలో ముఖ్యముగా అమెరికా (యు ఎస్ ఎ, కెనడా) బ్రెజిల్, జర్మనీ, రష్యా అర్జంటీనా మొదలగు దేశాలలో అగ్రగామి క్రీడా కారులకు సంఘంలో ప్రత్యేక స్థానము లబించుటయే గాక వారి బవిష్యత్తు సుఖవంతముగా గడుచుటకు ఏర్పాట్లు యున్నవి ఆ దేశ ముఖ్య వ్యక్తిగా గుర్తిస్తారు

వరల్డ్ కప్ ఫుట్‌బాల్ పోటీలలో బ్రెజిల్‌కు ప్రత్యేక స్థానము లబించునట్లు చేయుటయే గాక విజయానికి కూడా తోడ్పడిన 'పీలే కు ఆ దేశస్థుల హృదయాలలో గౌరవం అబిమానం ఉంన్నవి అతని అసలు పేరు 'ఎడ్సన్ అరంటన్ డో వాసిమెంటో' 1940లో పుట్టాడు శాంటాస్ జట్టు ఆటగాడు. 1969 నవంబరు 19న సీనియర్ ఫుట్‌బాల్ నందు 1000వ గోలు చేసిన 'ఫుట్‌బాల్ మాంత్రికుడు '

17వ ఏటనే అతనిలో గల ప్రతిబ గుర్తించి బ్రెజిల్ తరఫున వరల్డ్ కప్ పోటీలలో పాల్గొను అవకాశం యివ్వబడినది 1958, 1970 వరల్డ్ కప్ గెల్చిన బ్రెజిల్ జట్టు ఆటగాడు 1962, 66 లలో గాయాల వలన ఆడలేదు

ఆ దేశం అతనిని అన్ని విదాల గౌరవించడమే గాక, యిటీవల 'టూరిష్ట్ అంబాసిడర్'గా నియమించినది రేపు పీలే' బ్రెజిల్ అద్యక్ష పదవి అలంకరించినా ఆశ్చర్య పడ నవసరము లేదు ఆ దేశస్థులు అతనిని అభిమానముగా 'పీలే' అనగా నల్ల ముత్యం అని పిలుస్తారు అస్తవ్యస్తంగా యున్న బ్రెజిల్ రాజకీయ రంగం 'పీలే' కాబోయే అద్యక్ష స్థానముకు ఆహ్వానించవచ్చునట

రెండు ఏళ్ళ క్రితం పారీస్‌లో 'క్రీడా కారుల బార్'ను పీలేచే ప్రారంబోత్సవం చేయించారు పీలే అనేక టెలివిజన్ చిత్రాలలో పాల్గొన్నాడు

'స్పోర్ట్స్ మన్ బార్' ప్రారంబించిన తర్వాత 'పీలే'తో ఆనందముగా డాన్స్ బార్ ముందు చేయుచున్న ఫ్రెంచ్ యువతులు 'పీలే' ఎక్కడ ఉంటే అక్కడ ఫుట్‌బాల్ తప్పక వుంటుంది.

–ముకరమ్

---

ఏ క్షణంలో నైనా ప్రాణాలు పోవచ్చును పైకి చూస్తూ అన్నాడు సాయి

సుబ్బారావు వారందరినీ బైటకు నెట్టేసి తలుపులు వేశాడు అప్పుడు నెమ్మదిగా కళ్ళు తెరిచాడు

లింగోజీ చూశారా? నే చెప్పలేదూ? ఏయ్యంకుడు రంకెలేస్తున్నాడు ఇక నాపని గోవిందా' ఇదంతా వాడివల్లే వచ్చింది అన్నాడు

ష్ – మాట్లాడకండి అన్నాడు శ్రీరామ్

బయటనుండి ఎవరో తలుపులు బాదుతున్నారు

వద్దు తలుపులు తియ్యకండి' అన్నాడు లింగోజీ ఆందోళనగా

ఓరినాయనోయ్ – శుబమా అని పెళ్ళిచేసుకో బోతే యీ ఖర్మ ఏమిటి? నా మొగుడో నువ్వేమై పోయావు దేవుడోయ్ అంటూ బయటనుండి వీరమ్మ శోకాలుపెడుతోంది

దాని నోరు మూయించండి చెవులు చిల్లులు పడుతున్నాయి అంటూ చెప్పాడు లింగోజీ

వద్దు ఈ సన్నివేశంలో అదే మనకు సేఫ్టీ లేకపోతే సాంబయ్యగారు విజృంబిస్తారు అన్నాడు శ్రీరామ్

సరే' నేనిలా ఎంతసేపు చావాలయ్యా? విసుగ్గా అన్నాడు లింగోజీ

చావే మిమ్మల్ని రక్షిస్తుంది ఖంగారుపడకండి నేనొకప్లాన్ ఆలోచిస్తున్నాను అన్నాడు శ్రీరామ్

అక్కడ హోటల్లో చిట్టిబాబు పరిస్థితి బాదా కరంగావుంది ఏనాడూ కష్టమంటే ఎరుగని అతని శరీరం ఎలకలబోనులో పెట్టినట్లు వెంటిలేటర్‌లో యిరుక్కుని ఎటూ పోలేనిస్థితిలో నొప్పితో విలవిల్లాడుతోంది అంత బాదలోనూ తలెత్తి చూశాడు

హోటల్ రెండో అంతస్థులో వున్నగది అది రోడ్డు మీద పోయే వ్యక్తులు కనిపిస్తూనేవున్నారు కాని చిట్టిబాబు నీడలో వుండటంతో ఎవరి దృష్టీ అటు పడలేదు

ఎవరైనా తనవంక చూసి రక్షిస్తే చాలు అప్పుడు తను బుద్ధితక్కువతనానికి చింతించాడు రూమ్ బైట తాళంవేసినా రూమ్‌లో వున్న ఫోన్‌లో ఆ విషయం రిసెప్షన్‌కి తెలియజేస్తే వాళ్ళే ఒకదారి చూపేవారు

బగవంతుడా' ఏమిటీ దుస్థితి? పెళ్ళికూతురు మెడలో మూడుముళ్ళూ వేయవలసిన యీ సమయంలో త్రిశంకుస్వర్గంలో వేలాడుతూ మరింత పరిహాసాస్పదమైన స్థితిలో పడి పది మందిలో నవ్వులపాలు కావలసినదేనా? ఆక్రోశించాడు

రోడుమీద ఇద్దరు స్టూడెంట్స్ నడిచివస్తున్నారు వారేదో సీరియస్‌గా చర్చిస్తూ క్రిందే నిలబడిపోయారు

వారి సంబాషణ జరుగుతూనేవుంది చిట్టిబాబు సిగ్గూ బిడియం వదిలేసి ఇదిగో అబ్బాయిలూ' మాట యిటు చూడండి మిమ్మల్నే అంటూ బిగ్గరగా అరిచాడు

నాబిదగ్గర కండరాలు పట్టేసివుండటంతో అతని స్వరం చాలా విచిత్రంగా మారిపోయి వినిపించింది

క్రిందనున్నవారు ఉలిక్కిపడి చుట్టూ చూశారు ఎవరూ కన్పించకపోయేసరికి ఏదో అనుమానం ఏర్పడింది

మిమ్మల్నేనయ్యా – ఎందుకలా దిక్కులు చూస్తారూ? ఇటురండి అని బిగ్గరగా అరిచాడు

మళ్ళీ చుట్టూచూశారిద్దరూ ఎవరూలేరు'

ఎవరో పిలుస్తున్నారు కాని కంటికి కన్పించడం లేదు అన్నాడొకడు

విన్పిస్తూ కనిపించకపోతే– ఎవరనుకోవాలి' అన్నాడు రెండోవాడు

చిట్టిబాబు కోపం ఆపుకోలేక పోయాడు పొట్ట విపరీతంగా సలుపుతోంది బాద బరించలేక రేయ్ మూర్ఖపు ముండా కొడకల్లారా– నేను పిలిస్తే మీకు వినపడ్డంలే– అని అరిచాడు

బాబోయ్ యిది దెయ్యమే' అంటూ ఒక్క సారిగా దౌడు తీశారిద్దరూ

(ఇంకావుంది)

## సూచనలు

1908 సంవత్సరములో స్థాపించబడి, 81 సంవత్సరాలు నింపుకొని, వారం వారం అభివృద్ధి చెందుతూ నేటికి ఆధునికంగా ఆంధ్రపత్రిక వెలువడుతున్నది కవర్ పేజీని పరిశీలిస్తే రంగు రంగులతో ముఖచిత్రం ముచ్చటగా వుంటున్నది 'వీక్లీ పోస్ట్' శీర్షికలో పాఠకుల విలువైన సూచనలు, సలహాలక బహుమతిని ప్రవేశపెట్టి పాఠకులను అలరిస్తున్నది ప్రముఖ రచయితలు విశ్వప్రసాద్, శాతవాహన, లల్లాదేవి, బాపు, ప్రయాగ రామకృష్ణల సీరియల్స్ రసవత్తరంగా సాగుచున్నవి కొత్తగా ప్రారంభమైన 'దొంగల రాజ్యంలో ' హాస్య నవలిక పాఠకులను మొదటిలోనే ఆకర్షించినది పాఠకుల మేథాశక్తిని పదును పట్టేందుకు పజిల్, కథల వర్క్‌షాప్, టిట్ ఫర్ టాట్, ఫోటో వ్యాఖ్య పోటీలు ఎంతో దోహదపడుతున్నాయి పురుషుల కోసం 'నల భీమ పాకం' శీర్షిక, హాస్యం కోరే పాఠకులకు 'నవ్వు నాలుగందాల ఆరోగ్యం' శీర్షిక, సినిమా ప్రియులకు 'సినిమా సినిమా' శీర్షిక, ఇంకా ఫాలాక్షునిడైరి, సంపాదకీయం, తాజా కాలం వంటి అనేక శీర్షికలు ఈ పత్రికకే హైలెట్ -

విమర్శించడానికి వీలులేకుండా నేడు ఆంధ్రపత్రిక వెలువడుతున్నది కానీ కొద్ది మార్పులు చేస్తే ఆంధ్రపత్రిక సాటిలేని నేటి పత్రిక అవుతుంది

1 మహిళలకోసం ఒక ప్రత్యేకమైన శీర్షిక ఆంధ్రపత్రికలో లేదు

2 కార్టూన్స్, జోక్స్ సంఖ్య పెంచితే మంచిది

3 వెరైటీ కోరే పాఠకులకు ప్రముఖులతో ఇంటర్వ్యూలు జరిపిస్తే బాగుంటుంది

4 నేటి యువకులలో గల మానసిక, శారీరక సమస్యలను తొలగించుటకు ప్రముఖ కార్డియాలజిస్ట్‌చే పాఠకులతో ముఖాముఖి ఏర్పరిచితే సముచితంగా వుంటుంది

ఏది ఏమైనా ఆంధ్రపత్రిక నేడు ఆధునికంగా వెలువడుతున్నది

- మున్నంగి శ్రీనివాసరావు
(నందిగామ)

(మరొక్కసారి యిటీవలి సంచికలు తిరగేయండి మీరుకోరినవన్నీ వున్నాయి

- ఎడిటర్)

## ఈవారం సలహా!

ఉదయం పూట రెండోసారి 'కాఫీ'కి బదులు - ఓ 'కప్పుడు' రసం అనగా మిరియాలు వేసిన, చింతపండు తక్కువగా వేసిన 'చారు'ను వేడి వేడిగా త్రాగి చూడండి! - మళ్ళీ శీతాకాలం చివరి దాకా యీ 'చిట్కా' - అనక ఎండాకాలం వద్దుసుమా!

# వీక్లీ పోస్ట్

( 5 వ పేజీ తరువాయి)

## బాగు బాగు !

ఆకర్షణీయమైన పోటీలతో పాఠకుల మనసులను, మనోభావాలను 'ఆంధ్రపత్రిక' తన చుట్టూ తిప్పుకుంటోందా అన్పిస్తుంది శీర్షికలు బాగున్నాయి కథలు అభినందనీయం సీరియల్స్ విషయానికొస్తే "వజ్రసంకల్పంతో పంచశూలమ్‌ను చేబూని సూపర్‌గర్ల్ ద్రౌపదికై శత్రుసంహారం గావిస్తున్న పాండవుల వంటి" అయిదు సీరియల్స్ అద్భుతం ఎడిటర్‌గారికి ధన్యవాదాలు

-కరీమున్నీసా, ఒంగోలు

### బహుమతి పొందిన లేఖ

### ఆకాంక్ష

రాజకీయాలు, ఒకరు మరొకరిమీద దుమ్మెత్తి పోసుకోవడాలు ఇటీవల అన్ని రంగాలలో మాదిరిగానే మన పత్రికా రంగంలో కూడా ఎక్కువై పోయింది కానీ మన 'పత్రిక' అటువంటి వాటివైపు వెళ్లనందుకు సంతోషం ఇక మీద వెళ్లకూడదని నా ఆకాంక్ష

నివాస్, కొత్తగూడెం

## యువతా-కవితా

ఈ మధ్యన మన పత్రికలో ప్రచురితమవుతున్న కథలు, సీరియల్స్ మమ్మల్నెంతో ఆకట్టుకుంటూ వాస్తవాన్ని ఆలోచింప చేస్తున్నాయి "ద్రౌపది" సీరియల్ ప్రచురిస్తున్న మీకు, రచయిత గారికి మా ధన్యవాదాలు "యువతా-కవితా"లో కవితల సంఖ్య ఈ మధ్యన తగ్గిపోతుంది ఈ విషయమై ఆలోచించి కవితలు ఎక్కువగా ప్రచురించి యువకవులను ఇంకా ఎక్కువగా ప్రోత్సహిస్తారని మా ఆశ మీరు ప్రవేశపెట్టిన టిట్‌ఫర్ టాట్, కథల వర్క్‌షాప్ పత్రికకే హైలెట్!

-ఎన్ మాధవిలతా రాంబాబు, తుని

## 15 పైసలు మాత్రమే

ఈ రోజుల్లో పదిహైదుపైసలకు చిన్న పిల్లలకు చాక్లెటు కూడా రాదు కదా! ఇలాంటి కీలక తరుణంలో కేవలం 15 పైసల కార్డుపై పాఠకులు, పఠితలు తమ మెదడుకు, ప్రతిభకు పదునుపెట్టి రచిస్తున్న చిరు చిరు శీర్షికలకు సముచిత పీఠం వేసి ప్రోత్సహించడం ఎంతైనా అభినందనీయం 'వీక్లీ పోస్ట్', 'టిట్ ఫర్ టాట్', 'బొమ్మపై వ్యాఖ్య' తదితర మకుటాలు చదువరులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి

-మన్నెముత్తుల అశోకవర్ధన, శేబూరు

## స్పీడు యుగం

ఆంధ్రపత్రిక నేటి మేటి తెలుగు వారపత్రిక అంటే అతిశయోక్తి కాదు కాలానుగుణంగా విభిన్నమైన, విశేషమైన శీర్షికలను ప్రవేశపెడుతూ పాఠకుల అభిరుచికి అనుగుణంగా ముస్తాబయి ఏ వారానికా వారం కొంగ్రొత్త వెలుగుతో మా ముంగిట నిలుస్తోంది ఇదంతా పొగడ్త అనుకునేరు సుమా. కాదు ఇది పత్రిక పాఠకులందరికీ తెలిసిన అక్షరసత్యం ప్రతి వారం విశిష్టమైన గెటప్‌లో వచ్చిన పత్రికను చూసి మా మనసు పరవశించిపోతోంది పరవళ్ళు తొక్కుతోంది ఈ వారం (21-07-1989) అవర మేనక మీనాక్షి శేషాద్రి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రపత్రిక మమ్మల్ని ఎంతగానో అలరింపజేసింది 'విశ్వంబర' సృష్టికర్త డా సి నారాయణరెడ్డిగారితో ఇంటర్వ్యూ ఆకట్టుకుంది ఇది కంప్యూటర్ల యుగం, లోకమంతా స్పీడే స్పీడు! దీనికనుగుణంగానే సినిమా పాటలు రూపుదిద్దుకుంటున్నాయి ఆ స్పీడు పాటలో భావం ఎంత ఉంది అనేది అనవసరం ఇదంతా కేవలం కాలంతోపాటు మార్పు మాత్రమే !

- ఎస్ రాజేశ్వరరావు
(విశాఖపట్నం)

Editorial Adviser *S RADHAKRISHNA*, Editor *VEERAJI*,
Printed and Published by *S NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd ,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada 520003
Phones Editorial 75667, Business 61247, 61248

"సాక్షి"లో రాజేంద్రప్రసాద్.

### "పసిడిపంటలు"లో వచ్చిబెదిరింపు

యు తి (భాను ( య) రుగువ ంట్లోకి వచ్చి ది పా ను పై కెత్తుకని గిరగిరా తి ్పతూ పాపా నేను కోరుకున్నది సాధి చానమ్మా ని గా ఈరోజు చాలా గొ ్ప శ భదిన అ టూ డగా భైరవమూర్తి (గొ వ్రా ) వికటు గా నవ్వుతూ ( వేశి చాడు నీకే కాదు యు తమ్మా నాకూ ఈరోజు శుభదినమే ఎ దుక టే- ఎగిరిపో యిన నిన్ను మళ్ళీ కలుసుకున్నాను గనుక అన్నాడు

యు తి నెత్తిన దుసులు డ్డట్లయి ది నువ్వా ఇక్కడికె దుకొ ్చావ్ అ ది

త ్రమ్మా ఇ టికి వచ్చిన ెద్దాయన ను ట్టుకు కనీ కా అయినా ఇవ్వకు డా వెళ్ళిపొమ్మ టావా రే పోతాను కా పోతే ఉత్తచేతు తో వెళిపోతే నాకు నిద్ర ట్ట దమ్మా కనుక కా ్త కాష్ కొట్టి చావనుకో నేను నాదారిన పోతానమ్మా లేద టావా బిడను ఇచ్చేయ్

నా గొ తులో ్రాణము డగా నేనీ బిడ్డను ఇవ్వను ( స్తుత నా దగర డబు లేదు





వీర బ్రహ్మేంద్ర కంబైన్స్ చిత్రంలో వాణిశ్రీ

"డబ్బు లేకపోతేనేం? వస్తువేదైనా ఇచ్చావను దా ్ని కాష్ ో మార్చు కు టానుగా ఆ హార కొత్తగా కళకళలా డుతో దమ్మా

ఈ హారమా? లేదు దీన్ని నేనివ్వ లేను ఆర భమయ్యే నా కొత్త జీవితానికి గుర్తుగా ఓ మ చిమనిష ఇచ్చి ది నేనివ్వ లేను

చాలా అన్యాయ తల్లీ రే నువ్వు ఇవ్వలేవు గనుక నేనే తీసుకు టా టూ ఆమె మెడలోని హారాన్ని లాగే సుకున్న భైరవమూర్తి రువు బాగానేవు దమ్మా ఒక రె డు మూడు ె వరకు ర్చు కు ఆలోచి చుకోనక్కర్లేదు నేను ఆ తర్వాత అవ రాన్ని ట్టి వస్తాను మళ్లీ వీ ద్దర్నీ దీవిస్తాను తవరకు నువ్వు మన శ్శా తిగాను విశ్రా తిగాను ఉ డొచ్చు అని నవ్వుకు టూ జారుకున్నాడు

యు తి స్థాణు వులా నిలుచు ఒపో యి ది.

కృష్ణ హారోగా చ ద్రశే రరెడి కథ దర్శకత్వ లో షక్ ష ఖుద్దీన్ ఫజులులా హాక్ నిర్మి ే డి ప టలు చిత్ర షూటింగ్ ఆగస్టులో పాటల షెడ్యూల్‌తో పూర్తవుతు ది



శ్రీ యన్. టి. ఆర్. సంతానంలో
జయకృష్ణా? మోహన్‌కృష్ణా? బాలకృష్ణా? ఈయన ఎవరు?
(సేకరణ : శివా)

# సినిమా

## రాంప్రసాద్ ఆర్ట్స్ చిత్రం

"చెడుదోవన పడిపోతున్న ఒక వ్యక్తిని సన్మార్గంలో పెట్టడమనే విశిష్టాంశంగల ఇతివృత్తం," అన్నారు కోడిరామకృష్ణ. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నందిగం దేవీప్రసాద్ సమర్పించే రాంప్రసాద్ ఆర్ట్స్ ప్రొడక్షన్ చిత్రంలో ఎ.ఎన్.ఆర్. సుమన్, వాణిశ్రీ, రజని, కోట శ్రీనివాసరావు, రాజా కృష్ణమూర్తి, సుదర్శన్, మల్లికార్జునరావు, బాబూమోహన్, శ్రీదివ్య, అరుణకుమారి వగైరా నటవర్గం. శాయినాథ్-మధు మాటలు, వేటూరి-సి. నారాయణ రెడ్డి గీతాలు, రాజ్-కోటి సంగీతం, రాంచంద్రసింగ్ శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, విక్రమ్ ధర్మాసాహసాలు, నాగేశ్వరరావు-సత్యం కూర్పు, బి. బుల్లి సుబ్బారావు నిర్వహణతో నిర్మించే ఎన్. రామలింగేశ్వరరావు "విజయదశమి విడుదల" అన్నారు.

## "నాయకురాలు" శారద

"నెహ్రూ, ఇందిరాగాంధి, బేనజీర్‌భుట్టో లాంటి వారి నాయకత్వ లక్షణాలు పుణికి పుచ్చుకున్న ఓ మహిళ తన అకుంఠితదీక్షతో, పట్టుదలతో సమాజంలోని కుళ్లును,రాజకీయ కల్మషాన్ని ఎదుర్కొని, సమాజాన్ని జాగృతంచేసి, సర్వసమాన సమాజ నిర్మాణం కోసం ఎలా తన ప్రజలను చైతన్యవంతుల్ని చేసింది అన్నదే ఈ చిత్ర ఇతివృత్తం. ఆగస్టు 6 నుంచి 25 వరకు మద్రాసు, ఊటీలలో మొదటి షెడ్యూలు. తదుపరి రెండవ షెడ్యూల్స్‌తో అక్టోబర్‌లో షూటింగ్ పూర్తవుతుంది. పతాక సన్నివేశాలు కామారెడ్డిలో చిత్రీకరించబడతాయి," అన్నారు సత్యారెడ్డి. ఈయన కథ-స్క్రీన్‌ప్లే- దర్శకత్వంలో డి.ప్రభాకర్ సినిమా స్కోప్‌లో నిర్మించే ప్రియా ఆర్ట్ ప్రొడక్షన్స్ "నాయకురాలు" చిత్రంలో శారద, భానుచందర్, నాగేంద్రబాబు, సీత, 'ఆహుతి' ప్రసాద్, కన్నడ ప్రభాకర్, సాయికిరణ్, హరిప్రసాద్, ప్రసాద్‌బాబు, జయప్రకాష్, బ్రహ్మానందం, అశోక్‌కుమార్, వినోద్, పొట్టిప్రసాద్, లత, అన్నపూర్ణ తారాగణం. గణేష్‌పాత్రో మాటలు, వెన్నెలకంటి పాటలు, రాజ్-కోటి సంగీతం, దివాకర్ ఛాయ, రంగారావు శిల్పం, ప్రకాష్ సురేఖ-శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, రాజు సాహసాలు, కె.బి.ఆర్.ప్రసాద్ సహకారదర్శకత్వం, డి.కోటేశ్వరరావు ప్రొడక్షన్, బెనర్జీ కూర్పుతో ఎస్.భావనారాయణ నిర్మాణసారథి.

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయికి సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్, నెం 3
న్యూ ఢిల్లీ 110008




6 మాసాల నుంచి




4 మాసాల నుంచి




6 మాసాల నుంచి




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5712/TEL

## కమలహాసన్ "ఇంద్రుడు-చంద్రుడు"

"హైదరాబాద్‌లో రెండవ షెడ్యూల్ జులై 11 నుంచి ఆగస్టు 5 వరకు జరిగింది. మూడవ షెడ్యూల్ ఆగస్ట్ 16 నుంచి 30 వరకు" అన్నారు డి.రామానాయుడు. ఈయన నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ "ఇంద్రుడు- చంద్రుడు" చిత్రంలో కమలహాసన్, విజయశాంతి, శ్రీవిద్య, గొల్లపూడి మారుతీరావు, చరణ్‌రాజ్, పి.ఎల్. నారాయణ, రాళ్ళపల్లి, సుపర్ణ, జయలలిత, కుయిలీ పాత్రధారులు. పరుచూరి సోదరుల రచన, ఇళయరాజా సంగీతం, పి.ఎస్.ప్రకాష్ ఛాయ, మార్తాండ్ కూర్పుతో సురేష్ కృష్ణ దర్శకుడు. ●




"బాలగోపాలుడు"

బాలకృష్ణ నందమూరి కళ్యాణ్